## దశ మహావిద్యలలో 1వ మహావిద్య

# శ్రీ కాళీ దేవి



నిత్ర పబ్లికేషన్స్

## దశ మహావిద్యలలో
## 1వ మహావిద్య

# శ్రీ కాళీ దేవి



నిత్ర పబ్లికేషన్స్

# దశమహావిద్యలు



విద్య అంటే సరైన జ్ఞానం. మన చుట్టూ ఉన్న మాయను పటా పంచలు చేసి సత్యాన్ని చూడగల శక్తినిచ్చేది మహా విద్య. జ్ఞాన స్వరూపిణి అయిన శక్తి ధరించిన పది రూపాలే దశ మహా విద్యలు. తంత్ర శాస్త్రంలో శక్తి ఉపాసనను విద్య అంటారు.

మంత్ర శాస్త్రంలో పురుష దేవతా మంత్రాలని మంత్రాలని, దేవీ మంత్రాలని విద్యలని అనడం పరిపాటి. ఈ పది దేవీ శక్తులని దశావతారలతో కొందరు పోల్చారు. వీటిని బ్రహ్మ విద్యలుగా గుర్తించి, దేవతా శక్తులుగా పూజించి సాధకులు అనుగ్రహాన్ని పొందారు, శక్తివంతులయ్యారు.

అజ్ఞానం పాపానికి కారణమౌతుంది. పాపం దుఃఖానికి కారణం. జ్ఞానం స్వేచ్ఛనిస్తుంది. పరమానందాన్ని కలిగిస్తుంది. అటువంటి జ్ఞానాన్ని అమ్మవారు పది అవతారాలలో ప్రసాదిస్తుంది. ఆ అవతారాలనే దశ మహా విద్యలన్నారు.



## అవతార రహస్యం





సృష్టి స్థితిలయకారిణి అయిన అమ్మ శ్రీఆదిశక్తి. మహామాత, మహాదేవి అయినటువంటి ఈ ఆదిపరాశక్తి ఈ బ్రహ్మాండం అంతా వ్యాపించి వుంది. జగన్మాత ధరించిన అవతారాలు ఎన్నో ఉన్నట్టుగా వివిధ పురాణాలు పేర్కొంటున్నాయి. లోక రక్షణకు, భక్తుల కోరిక మేర, రాక్షససంహారానికి మరియు లోకోద్ధరణకు ఆమె ఎన్నో రూపాలలో అవతరించింది, ఎన్నో లీలలనూ ప్రదర్శించింది. వాటిల్లో ప్రముఖమైనవి శ్రీదేవి యొక్క “దశమహావిద్యలు”.

తంత్ర శాస్త్రంలో ప్రప్రథమంగా చెప్పుకోదగినవి దశమహావిద్యలు. దశ మహావిద్యలు అని పేర్కొనబడిన మంత్ర విద్యలకు 10 మంది దేవతలు అధిపతులుగా ఉన్నారు.

కలియుగంలో అత్యంత శీఘ్రంగా అనుగ్రహాన్నిచ్చేవి దశ మహా విద్యలు అని చెబుతారు. ఈ దేవతల మూలమంత్రాలను జపహోమ విధానం ద్వారా ఉపాసిస్తే సాధకులు తమ కామ్యాల్ని సులభంగా పొందగలరు అని విశ్వాసము.

## దేవీభాగవతం ప్రకారం దశమహావిద్యలు



పరమ శివుని భార్య అయిన సతీదేవి తండ్రి దక్షప్రజాపతి తల పెట్టిన యజ్ఞానికి వెళ్ళుటకు నిర్ణయించుకుని పరమ శివునితో చెప్పగా, శివుడు దక్షప్రజాపతి ఆంతర్యము తెలుసుకొనినవాడై పిలుపు లేని చోటుకు వెళ్ళ రాదని వారించెను. వెంటనే సతీదేవి కోపంతో పరమ శివునికి తన నిజ రూపమైన ఆదిపరాశక్తి అవతారము దాల్చి మహా శివుని ముందు తన శక్తితో 10 అవతారాలతో 10 వైపులా (ఎనిమిది దిక్కులు, పైన క్రింద (భూమి, ఆకాశము) మొత్తం పది దిక్కులు) శివుని అడ్డుకుంది. ఈ 10 అవతారాలే దశ మహావిద్యలుగా ప్రసిద్ధి పొందాయి.

ప్రతి అవతారమునకు ఒక పేరు, కథ, లక్షణము మరియు మంత్రము ఉన్నది. ఈ అవతారాలలో అమ్మవారు ఒక వైపు భయంకర రూపంతో కనిపిస్తూనే మరోవైపు అందమైన శక్తి స్వరూపిణిగా సర్వ విద్యలకు అధినాయకిగా చెప్పబడినది.

## దశమహావిద్యల ఆవిర్భావం



శ్రీ ఆదిశక్తి అవతారాలు భూలోకంలో ఎన్నో ఉన్నట్లుగా వివిధ పురాణాలు పేర్కొంటున్నాయి. ఇలా జగన్మాత ధరించిన అన్ని రూపాల్లో "దశమహావిద్యలు" అనే పది రూపాలు ఎంతో విభిన్నమైనవిగా, విశిష్టమైనవిగా లోకంలో ప్రసిద్ధి పొందాయి. పూర్వం దుర్గాదేవి లోకాలని కాపాడాలని దేవతల్ని ఉద్ధరించాలని దుర్గముడితో యుద్ధానికి ఉపక్రమించింది. దేవీ దుర్గముల మధ్య భయంకరంగా యుద్ధం కొనసాగుతున్న సమయంలో దేవీ శరీరం నుంచి ఒక్కసారిగా ఈ దశమహావిద్యలు ఆవిర్భవించాయని చెబుతారు.

## చింతామణి ద్వీప నివాసిని

శ్రీదేవి భాగవతంలోని 12వ స్కంధంలో ఆదిపరాశక్తి కొలువుండే మణిద్వీపంలోని నవరత్న ప్రాకారంలో ఈ దశమహావిద్యలన్నీ కొలువుదీరి ఉంటాయని చెప్పటం జరిగింది. దీనిని బట్టి చింతామణి ద్వీప నివాసిని అయిన ఆదిపరాశాక్తికి అత్యంత సమీపంలో నివసించే ఈ మహాశక్తులే దశమహావిద్యలని తెలుస్తుంది. అందుకే ఈ మహావిద్యలకి ఇంత గొప్ప ప్రాముఖ్యత లోకంలో కలిగింది.

## శాక్త తంత్రములో ముఖ్యమైన విద్యలు

శాక్తతంత్రములో ఎందరు దేవతలున్నా ముఖ్యముగా ఉపాసింపబడే వారు దశమహావిద్యలు. అచింత్యము, అవ్యక్తము అయిన చైతన్యమును ఈశ్వరుడు అంటుంది తంత్రము. అదే చైతన్యము కదలికను పొంది త్రిగుణాత్మికగా మారి సృష్టిస్థితిలయములను చేస్తున్నపుడు శక్తి అవుతుంది. ఆ శక్తి ప్రపంచమును నడిపించుటకు పది రూపాలుగా ఉంటుంది. ఆ పదిరకములైన శక్తులే దశమహా విద్యలు.

## దశ మహావిద్యా దేవతలు



కాళి, తార, షోడశి, భువనేశ్వరి, భైరవి, ఛిన్నమస్త, ధూమవతి, భగళా ముఖి, మాతంగి, కమలాత్మిక అన బడువారే దశ మహావిద్యలు. వీరు కేవలము బాహ్య ప్రపంచము నందే గాక అంతర్ ప్రంచమున కూడా అధివసించి ఉంటారు. కనబడే బాహ్య ప్రపంచముగాని, కనపడని ఆంతరిక ప్రపంచముగాని వీరి ఆధీనములోనే నడుస్తూ ఉంటాయి. వీరిని సాధనామార్గమున దర్శించ వచ్చు. వీరి అనుగ్రహమును పొందవచ్చు. దానితో ప్రపంచమున అసాధ్యములైన కార్యములు సాధించవచ్చు. వీరు శక్తులు. అనగా శక్తి శరీరము కలిగిన చైతన్య పుంజములు.

## ప్రతి అవతారమునకు ఒక ప్రత్యేకత



దశమహావిద్యలు పేరుకు తగ్గట్టుగ అపారమైన జ్ఞాన మూర్తులుగా తెలుపబడ్డారు. ప్రతి ఒక అవతారము ఒక ప్రత్యేకతను కలిగి ఉంది. ఆధ్యాత్మికతను సంతరించుకున్నవారికి ఈ దశమహావిద్యలు ఎంతో ప్రేమ, ధైర్యము, జ్ఞానముతో కనిపిస్తాయి. తాంత్రికులకు ఆరాధ్య దేవతలుగా ఈ పది మంది దేవతలు ప్రాముఖ్యం చెంది ఉన్నారు. వీరిలో మొదటి ఐదుగురు దేవతలు ఉగ్రదేవతలుగా గుర్తించబడ్డారు. కానీ వారు నిజానికి దయామయులుగా ఉంటారు. మిగిలిన ఐదుగురు దేవతలు శాంత స్వరూపులుగా కనిపిస్తారు. దశమహావిద్యలు అని పేర్కొనబడిన పది మంది ఆదిపరాశక్తి అంశల యొక్క కథలు, మంత్రాలు మరియు ఆ దేవతల యొక్క స్వరూపాల గురించి నియమ బద్ధంగ పఠించినపుడు ఆయా మంత్రాల యొక్క అధిష్టాన దేవతలయిన దశమహావిద్యలు అనుగ్రహిస్తాయి అని చెబుతారు.

## ఐహిక లాభమునకే ఉపాసన

జగన్మాత భుక్తిముక్తి ప్రదాయిని. అనగా ఐహిక లాభములను ఆముష్మిక లాభములను కూడా సమముగా ప్రసాదించగలదు. ఎక్కువగా మానవులు ఈ శక్తులను ఐహికలాభముల కోసమే ఉపాసించటం కనిపిస్తుంది.

## జాతకములోని చెడులను నిర్మూలించే మాత

జాతకములో బలం లేకపోవటం పూర్వజన్మల చెడుకర్మ వల్ల కలుగుతుంది. దానిని పోగొట్టుకొని సుఖశాంతులతో జీవితం గడపవలె నని ప్రతివానికీ ఉంటుంది. దానికి దైవబలం తప్పనిసరిగా కావాలి. దశమహావిద్యల ఉపాసనద్వారా జాతకములోని చెడును నిర్మూలించు కోవటం సాధ్యం అవుతుంది. శక్తి అనుగ్రహం వల్ల పూర్వకర్మల చెడు ప్రభావం భస్మీపటలం అవుతుంది. కనుక దోషాన్ని బట్టి ఏ దేవతా ఉపాసన అవసరమో చూచుకొని దానిని ఆచరించడం ద్వారా సుఖ శాంతులతో కూడిన జీవితాన్ని పొందవచ్చు అని దశమహావిద్యల ఉపాసకులు చెబుతారు.

## సృష్టి రహస్యానికి ప్రతీకలు

సత్తు అసత్తు తానైన, అవ్యక్తమైన పరమేశి తత్త్వము పదివిధములైన నామరూపములుగా వ్యక్తపరచు లీలయే దశమహాశక్తులు. ఇవి సృష్టి



రహస్యానికి ప్రతీకలు. నానాత్వ ఏకత్వరూపములు అమ్మ స్వేచ్ఛా లీలలు. పరమేశ్వరి సంకల్ప ప్రతీకలు. స్థూల–సూక్ష్మ అండ–పిండ–బ్రహ్మాండ పరిపాలనలో అమ్మకు సహాయపడు అదృష్ట–అద్భుత శక్తులు. నవగ్రహాధి దేవతలుగా, నానా రూపధారులుగా, కఠినత కారుణ్యము రూప స్వభావ ములుగా కొన్ని శక్తులు, మనోహరత మాధుర్యము మూర్తీభవించిన మాతృస్వరూపములుగా మరికొన్ని శక్తులు, ఘోర–అఘోర రూపములను సమయ సందర్భములను అనుసరించి ధరించుచున్న దయార్ద్రశక్తులే దశ మహావిద్యలు. సత్వగుణసంపన్నమైన ఆధ్యాత్మిక భావనయే ఆదిపరాశక్తి. తల్లి ధర్మపరిరక్షణకై పరిసరాలను తానే సృష్టించుకొని, వానికి అనుగుణముగా ఉండే రూపములో అయిన ప్రకటనమే దశమహాశక్తుల ఆవిర్భావము.

## దశావతారాలే మహావిద్యలుగా భావన



నారాయణుని దశావతారములే దశమహావిద్యలుగా భావిస్తారు. స్త్రీ పురుష భేదము మన చర్మ చక్షువులకు మాత్రమే. మాయ తొలగిన కన్నులకు మాధవ తత్త్వము అర్థమవుతుంది. పంచ భూత, పంచేంద్రియ పరిరక్షణ బాధ్యతా నిర్వాహకమూర్తులు ఈ దశ మహావిద్యలు. సూక్ష్మరూపములో పరిశీలిస్తే ఈ దశమహావిద్యలు మానవ దేహమున వివిధ చక్రములను కుండలినీ శక్తిద్వారా వ్యాపింపచేయుచూ, శక్తివంతము చేయుచున్నదన్న మాట యోగసాధకులు అంగీకరించినదే.

## అంతర్యాగము, బహిర్యాగము

అంతర్ముఖ సమారాధ్యా, బహిర్ముఖ సుదుర్లభ అయిన తల్లిని చక్రములు, యంత్రములు, విగ్రహరూపములలో ఆరాధిస్తే బహిర్యాగము అంటారు. మన శరీర చక్రములుగా భావించి, నీవారసూక మాత్రమైన తల్లిని గుర్తించి చేసే ఆరాధనను అంతర్యాగము అంటారు.

## ఉగ్ర శక్తులు, సౌమ్య శక్తులు

దశ మహాశక్తులలో కొన్ని ఉగ్ర తత్త్వము కలవి. మరికొన్ని సౌమ్య తత్త్వము కలవి (ఘోర-అఘోర). ఉగ్రతత్త్వ శక్తులు కాళి కులమునకు



సంబంధించినవి. సౌమ్య శక్తులు శ్రీకులమునకు సంబంధించినవి. సౌమ్యశక్తులను సంప్రదాయబద్ధమైన దక్షిణాచార మార్గములో ఆరాధిస్తారు. ఉగ్రశక్తులను సంప్రదాయ విరుద్ధమైన వామాచార పద్ధతిలో ఆరాధిస్తారు. కొన్ని విద్యలు ఘోర, అఘోర రూపములలో సమయమును బట్టి ప్రకటితమైన వేళ వాటిని ఉభయ పద్ధతులలోను ఆరాధిస్తారు.

## ఎవరు గొప్ప?



దశ మహావిద్యలలో ఎవరికీ వారే గొప్పవారు. ఎవరికి వారే పరమ శక్తి వంతులు. ప్రసాద గుణ సంపన్నులు. ఎవరిని ఉపాసించినను ముక్తి ప్రసాదకులే. వీరు ప్రత్యేక దేవతలు కారు. జగన్మాతయగు ఆద్యాశక్తి యొక్క వివిధ రూపములు. కనుక ఎవరిని ఉపాసించినా భుక్తి ముక్తులను ఇవ్వగలరు. కాని వారివారి లక్షణములను బట్టి ఒక్కొక్క ప్రత్యేక వరమును అధికముగా ఇవ్వగలరు. కనుక జాతకమున గల ఒక్కొక్క దోషమునకు ఒక్కొక్క మహావిద్య ఉపాసన ఉత్తమము అని తెలియుచున్నది.



## సాత్త్విక, రాజసిక దేవతలు





రవి కుజులు రాజసిక గ్రహములు. కనుక త్రిపుర భైరవి, బగళాముఖి రాజసిక దేవతలు. వీరు ఉగ్రరూపులు. వీరి ఉపాసన కష్టతరము. ఇక బుధ చంద్రులు మిశ్రమ గ్రహములు. అనగా వారి స్థితిని బట్టి మంచీ చెడూ రెండూ చేయగలరు. కనుక మాతంగి, భువనేశ్వరి అనువారు వీరికి అధిదేవతలు. వీరి ఉపాసన సాత్వికమునకు, రాజసమునకు మధ్యస్తంగా ఉంటుంది. ఇక మిగిలినది శనీశ్వరులు. వీరికి కాళి అధిదేవత. రాహుకేతువులకు ఛిన్నమస్త, ధూమావతులు అధిదేవతలు. వీరి ఉపాసన బహు కష్టతరము. వివిధ ఆటంకములు, భయమును గొలిపే పరీక్షలతో కూడి ఉంటుంది. అంత మాత్రాన వీరిని తామసిక దేవతలు అనుట తప్పు.



## తత్వప్రకారము విభజన



ఈ దశ మహా విద్యల తత్వాన్ని చూస్తే, అవి ఇలా సూచిస్తాయి.

కాళీ, ఛిన్నమస్త – కాల పరిణామము.

తార, మాతంగి – వాక్కు, వ్యక్తావ్యక్తము.

త్రిపుర సుందరి, కమల – ఆనందము, సౌందర్యము.

భువనేశ్వరి, ధూమావతి – అంతరాళము, అతీత పరబ్రహ్మ శక్తి.

భైరవి, బగళాముఖి – శక్తి, గతి, స్థితి.

## దశమహావిద్యలను సామాన్యులు ఆరాధించవచ్చా?



దశ మహావిద్యలను నిరభ్యంతరంగా ఎవరైనా ఆరాధించవచ్చు. అమ్మను కొలవడానికి అందరూ అర్హులే. కానీ వామాచార పద్ధతులలో దశ మహా విద్యలను ఆరాధించదలచినవారు ముందుగా ఉపాసకులను, గురువులను దర్శించి విధి విధానాలను తెలుసుకోవడం మాత్రం తప్పనిసరి. ఈ పుస్తకములో అటువంటి వామాచార పద్ధతులు ఎక్కడా పేర్కొనలేదు.

ఈ దశ మహావిద్యల యొక్క స్తోత్రాలు, హృదయం, కవచం, అష్టోత్తరం, సహస్రనామము.. మొదలగు వాటిని పారాయణ చేయుటకు గురూపదేశంతో పనిలేదు. స్త్రీ పురుష, వయో భేదం లేకుండా అందరూ నిర్భయంగా ఏ సమయంలోనైనా పారాయణ చేసి ఆ ఆదిశక్తి అనుగ్రహాన్ని పొందవచ్చును.

## మొదటి మహావిద్య శ్రీ కాళీదేవి

దశ మహావిద్యలలో మొదటి మహా విద్య శ్రీ కాళీ దేవి. శ్రీకాళీదేవి ఉపాసన ఎంతో ఉత్కృష్టమైనదిగా శాక్తేయ సంప్ర దాయం చెబుతోంది. తంత్రోక్త మార్గంలో శ్రీకాళీ మహావిద్యని ఆరాధిస్తే సకల వ్యాధుల నుంచి, బాధల నుంచి విముక్తి కలుగుతుంది అని చెబుతారు. కాళీ ఉపాసన



అతిశీఘ్ర ఫలదాయిని. పార్వతీదేవి ఉగ్ర రూపమే కాళికా దేవి. ఈమె సృష్టి చైతన్యానికి రూపం. కాళీ జ్ఞానశక్తికి, క్రియాశక్తికి, సృష్టిశక్తికి ఆదిమాతగా చెబుతారు.

ఈ దశమహావిద్యా మాతలకు సంబంధించిన జననం, అవతార రహస్యం, పూజా విధానాలు, అనుగ్రహం చూపే విధానాలు, ఉపాసనా మార్గాలు మొదలైన ఈ పుస్తకంలో పేర్కొన్న అనేక విషయాలు; ఆయా దేవతలకు సంబంధించిన స్తోత్రాలు, ప్రార్థనలు, ధ్యానాలు, కవచాలు, హృదయాలు, అష్టోత్తరాలు... మొదలైన అన్ని విషయాలకు సంబంధించిన విషయసేకరణకు మాకు అనేక గ్రంథాలు, మాస, పక్ష, వార, దిన పత్రికలు, అంతర్జాలము ఎంతగానో సహకరించినది. ఈ విధముగా లభ్యమైన సమాచారమునకు తగిన పటములను జోడించి మీకు సంకలనముగా అందించాము. ఆయా మూల రచయితలకు, వ్యాసకర్తలకు పేరు పేరునా ధన్యవాదాలు తెలుపుకొంటున్నాము. తప్పులు దొర్లకుండా ఉండుటకు అనేక జాగ్రత్తలు తీసుకొన్నాము. అయినా అక్కడక్కడా కొన్ని అక్షర దోషాలు, భావ దోషాలు దొర్లి ఉండవచ్చును. సహృదయులైన పాఠకులు అలాంటి దోషాలను మా దృష్టికి తెచ్చినచో మా తరువాతి ముద్రణలో వీటిని తప్పక సరిచేసుకొనగలము.

మా పాఠకులు అందరికీ దశమహా విద్యలకు ఆదిదేవత అయిన మాత అనుగ్రహం కలగాలని, తద్వారా వారు తమ జీవితంలో అమృత స్థానాన్ని పొందాలని ఆశిస్తూ...

- నిత్య పబ్లికేషన్స్



# విషయసూచిక





# శ్రీ కాళీ దేవి



కృష్ణ వర్ణంతో ప్రకాశించే **శ్రీకాళీదేవి దశమహావిద్యలలో మొదటి మహావిద్య.** ఆశ్వయుజమాసం కృష్ణపక్ష అష్టమీ తిథి ఈ దేవికి ప్రీతి పాత్రమైనది. శ్రీకాళీదేవి ఉపాసన ఎంతో ఉత్కృష్టమైనదిగా శాక్తేయ

సంప్రదాయం చెబుతోంది. తంత్రోక్త మార్గంలో శ్రీకాళీ మహావిద్యని ఆరాధిస్తే సకల వ్యాధుల నుంచి, బాధల నుంచి విముక్తి కలుగుతుంది. అంతేకాదు శత్రు నాశనం, దీర్ఘాయువు, సకలలోక పూజత్వం సాధకుడికి కలుగుతుంది. భయంకర ఆకారంతో, తంత్ర శాస్త్రంలో కాళి ప్రత్యేక స్థానం కలిగి ఉంది.

## దశమహావిద్యలలో ముఖ్యమైన దేవత కాళికాదేవి

దశ మహావిద్యలలో అత్యంత ముఖ్యమైన దేవత కాళికాదేవి. తాంత్రికులకు ఆమె ఇష్టదేవత. తంత్రమున ఎందరు దేవతలు ఉన్నా కాళీమాతకు ప్రత్యేకస్థానం ఉన్నది. ఎందుకంటే కాళీ ఉపాసనలో చాలా ప్రత్యేకతలు ఉన్నాయి. కాళీ ఉపాసన అతిశీఘ్ర ఫలదాయిని. అతిప్రాచీన కాలం నుంచీ మన దేశంలో పరంపరగా వస్తున్నది. ఒక జీవితకాలం పట్టే సాధనను కాళీమాత కొన్ని నెలలలో ఇవ్వ గలదు. కానీ ఈ సాధన అందరూ చెయ్యలేరు. ఇది చాలా కష్టమైన సాధన అని చెబుతారు.



## చైతన్య దీపిక కాళిక

పార్వతీదేవి ఉగ్ర రూపమే కాళికా దేవి. ఈమె సృష్టి చైతన్యానికి రూపం. కాల స్వరూపం. కాలం ఎప్పుడూ గతిశీలమే. అంటే నిరంతరం కొనసాగుతూనే ఉంటుంది. అది చైతన్యానికి ప్రతీక. ఆ చైతన్యమే కాళిక. అన్ని వర్ణాలనూ తనలో నింపుకున్న కాళ రాత్రి ఈమె వర్ణం.

## కాళీమాత అవతరణ



ఈమె అవతరణని గురించి వేదములలో, దేవి భాగవతంలో, పురాణ ములలో ఎన్నో కథలు న్నాయి. సృష్టి ఆరంభంలో మహావిష్ణు నాభి కమలం నుంచి బ్రహ్మ ఉదయించాడట. విష్ణువు నిద్రావశుడై ఉండగా ఆయన చెవిలోంచి పుట్టిన మధుకైటభ రాక్షసులు బ్రహ్మను బాధించడం మొదలుపెట్టారు. వారినేమీ చేయలేక విష్ణువును లేపడానికి ప్రయత్నించి విఫలుడై మహామాయను, కాల స్వరూపిణి అయిన కాళిని స్తుతించగా ఆమె అవతరించి విష్ణువుని లేపి, రాక్షసులని సంహరించడానికి శక్తి నిచ్చింది అంటారు.

## సత్వర సిద్ధికి కాళీ ఉపాసనే మార్గం



సమస్త విద్యలకు ఆదిరూపం మహాకాళి. ఆ దేవి విద్యామయ శక్తులనే మహావిద్యలని అంటారు. కృష్ణ వర్ణంలో ఉండటంవల్ల దేవికి కాళీ అనే నామ మేర్పడింది. అనేక సంవత్సరములకు కాని ఫలించని యోగ మార్గ సాధన కొద్ది మాసాల లోనో, రోజుల్లోనో సాధించాలనుకొంటే కాళీ ఉపాసన చేస్తారు. కాని కాళీ శక్తిని తమ శరీరంలోనికి ఆకర్షించుకొనేటప్పుడు అగ్నితో సమానమైన మంటలని, భయంకరమైన బాధని యోగి అనుభవిస్తారు

కాళీ అంటే నలుపు అని అర్థం. ఆమె ఆవాసం శ్మశానం. కాళీ అంటే మరణం, కాలం అని కూడా అర్థం. దశమహావిద్యలలో ఈమె ప్రధాన దేవతగా కొలుస్తారు. కాళీ జ్ఞానశక్తికి, క్రియాశక్తికి, సృష్టిశక్తికి ఆదిమాతగా చెబుతారు.

## త్రిమూర్తుల సృష్టికర్త కాళి

నిర్వాణ తంత్రంలో త్రిమూర్తులను కాళీ మాతయే సృష్టించిందని చెప్పబడివుంది. నిరుత్తర తంత్రం, పిచ్చిల తంత్రం ప్రకారం కాళీ మంత్రాలు మహా శక్తివంతమైనవిగా పేర్కొంటాయి. బాహ్యంగా ఈమె భయంకరంగా కనిపించినా ఈమె కారుణ్యమూర్తి. ఎందరో మహా సాధువులు, సన్యాసులు కాళీ మాతను సేవించి కైవల్య ప్రాప్తినొందారు. వారిలో మనందరకు సుపరిచితమైన శ్రీ రామకృష్ణ పరమహంస ప్రముఖులు.



## మహాశివునిపై కాళిమాత నాట్యం





ఒకనాడు భూమిపైన పాప సంచయం బాగా పెరిగిపోయింది. భగవన్నామ స్మరణ, యజ్ఞయాగాది క్రతువులు ఆగిపోయాయి, ప్రజలు అరిషడ్వర్గాలకు లోనై స్వేచ్ఛగా సంచరించసాగారు. భూమిపైన ధర్మమే లేకుండాపోయింది. దీంతో ఆగ్రహించిన కాళీమాత ఉగ్రంగా నాట్యం చేయనారభించింది. దీంతో లోకాలన్ని కంపించసాగాయి. సృష్టి రక్షణకై పరమేశ్వరుడైన మహాశివుడు కాళీమాతను తనపై నాట్యం చేయమని కోరాడు. అలా మహాదేవుణ్ణి చూసి మాత శాంతించింది. అందుకే సాధారణంగా కాళీ మాత మహాదేవుడిపై తన పాదాలను ఉంచినట్టు కనిపిస్తుంటుంది. అంటే అమ్మ ఆగ్రహాన్ని శాంతపరచడానికి మహా శివుడు చిదానందుడై అచేతన స్థితిలో ఆమె కాలికింద పడుకుని ఉంటాడు. స్వామి చర్యను చూసిన కాళిక అచ్చెరువుతో నాలుక తెరచి ఉంటుంది.



## కాళి ఎనిమిది రూపాలు



కొన్ని సంప్రదాయాలలో అష్టవిధ కాళికా మూర్తుల యొక్క వర్ణన ఉన్నది. ఇవే ఆ కాళీ మాత యొక్క ఎనిమిది రూపాలు. 1. దక్షిణ కాళిక, 2. సిద్ధ కాళిక, 3. గుహ్య కాళిక, 4. శ్రీ కాళిక 5. భద్ర కాళిక, 6. చాముండా కాళిక, 7. శ్మశాన కాళిక, 8. మహాకాళిక.



## మంత్ర మహార్ణవం ప్రకారం ఆదిశక్తి





కాళీ మాత సిద్ధుల ధ్యాన పరంపరను అనుసరించి అనేక రూపాలలో అయా క్షేత్రాలలో సాక్షాత్కరించింది. అందుకే కాళీ మంత్రాలలో అనేక బేధాలు ఉన్నాయి. బ్రహ్మ స్వరూపమైన కాళీని ఆదిశక్తి అని చెబుతుంది మంత్ర మహార్ణవము. మొదట్లో దక్షిణ భైరవుడు కాళీ మాతను పూజించి ఉపాసన చేసినందువలన ఈమె దక్షిణ కాళిక అని పిలువబడు చున్నది. మార్కండేయ మహా పురాణంలో ఈ కాళిని నిత్య అనే పేరుతొ పిలువబడినది. ఈమె అవసరాన్ని బట్టి అనేక రూపములలో మనుషులకు, దేవ తలకు, రాక్షసులకు శుభములు చేకూరుస్తూ వుంటుంది.



## సృష్టి వినాశిని



మహాకాలుని వలెనే మహాకాళి కూడా సృష్టి వినాశనమును, సృష్టి సంహరమును అంత్యకాలము నందు చేసే మహా రుద్ర రూపిణి. కాలం నుంచే పదార్ధము పుట్టి, మరలా ఆ కాలంలోనే ఈ పదార్ధము అంతా కలిసిపోతుంది. ప్రళయాంతమున జరిగే మహా ప్రళయమునకు ప్రత్యక్ష సాక్షి ఈ మహా కాళి.

## భయాన్ని పోగొట్టే మాత

కాళీ మాత నడుము చుట్టూ మానవ ఖండిత కరములు చుట్టుకుని ఉంటుంది. అంటే తాను కనపడకుండా మానవుల చేతులతో తాను పని చేయిస్తూ ఉంటాను అన్న సిద్ధాంతానికి ప్రతీకగా విషయాన్ని చెబుతారు.

శ్లో॥ జయంతి మంగళాకాళీ భద్రకాళీ కపాలినీ ।
దుర్గాక్షమా శివధాత్రి స్వాహాస్వధా నమోస్తుతే ॥

మనిషికి ఏదైనా పని చేయాలంటే మనస్సులో భయం మరియు సంశయం ఎక్కువ, ఆ భయాన్ని పోగొట్టి మనిషిని సన్మార్గంలో నడిపే మాత శ్రీ కాళీ మాత.

## కాళికగా జననం

దారుకుని వధించడానికి దుర్గాదేవి నుదుటి నుండి క్రోధజ్వాలయై కాళిక జన్మించిందని, రక్తబీజుడనే రాక్షసుని సంహరించడానికి భయంకర రూపిణియై అవతరించిందనీ, దేవి పురాణం, మార్కండేయ పురాణాలలోని కథలు చెబుతున్నాయి.

## కాళికాదేవి ఉగ్రరూపానికి అర్థం



కాళికాదేవి నల్లని రూపం తమోగుణానికి ప్రతీక. ఒకచేతిలో ఆమె ఖండించిన అసురుని తల, ఖడ్గం, వరద అభయ హస్తాలతో ఉంటుంది. అమ్మ శ్మశానంలో నర్తిస్తుంది. కాలం అంటే వినాశం అనే అర్థం కూడా ఉంది. ఆ వినాశం అనివార్యమైనది. సృష్టించబడిన ప్రతి వస్తువూ

నశించక తప్పదు. సృష్టించిన దాన్ని తిరిగి తనలోకి లయం చేసుకునే శక్తి కాళిక. ఆమె మహాకాలుని స్త్రీ రూపం. ఆమె మెడలోని పుర్రెలదండ దుష్టులను భయపెడుతుంది. ఆ దండలోని పుర్రెలు 22 బీజాక్షరాలకి ప్రతీకలని అంటారు.

## కాళికాదేవి రూపాలు ఎన్ని?

కాళికాదేవి దక్షిణ కాళి, వామ దేవి అనే రెండు ప్రధాన రూపాలు ఉన్నాయి. బృహన్నీలా తంత్రం ప్రకారం కాళికా దేవి రక్తవర్ణంతో సుందర రూపంలోనూ, కృష్ణ వర్ణం (నలుపు)తో భయంకర రూపంతోనూ ఉంటుంది. భద్రకాళీ రూపం భక్తులకు రక్షగా ఉంటుంది.

## విద్యా దాయిని కాళిక

కాళికా దేవి విద్యాదాయిని. నీల కంఠుడు మహాకవి కాళి దాసుగా అయినాడంటే అది అమ్మదయే. కాళికా దేవి మన లోని జాడ్యాలను భయాలను తొలగించి, చైతన్యాన్ని ఇస్తుంది. శత్రువుల నుంచీ, దుష్ట పీడల నుంచీ కాపాడుతుంది. అఖండమైన విద్యాప్రాప్తిని ప్రసాదిస్తుంది.



కాళీ విగ్రహం ఎప్పుడూ ముండ మాలతో, ఖడ్గంతో భయంకరంగానే ఉంటుంది. వీటిలో కోమలత్వం ఏది అనిపిస్తుంది. మరి ఈ కాళికే తెనాలి



రామలింగడికి విద్యని, ఐశ్వర్యాన్ని ఇచ్చింది. వెర్రివాడైన కాళి దాసుకి కవిత్వాన్నిచ్చింది. అమ్మ తలుచుకుంటే లోటేముంది. అమ్మ ఒకసారి కోపంగా ఉంటుంది. ఒక సారి సంతోషంగా ఉంటుంది. ప్రేమ అనేది ఒక అపురూపమైన తత్వం. తిట్టుకున్న, కొట్టుకున్నా ప్రేమతో ఉంటే అవి అద్భుతంగానే ఉంటాయి.

## కాళికా వరప్రసాదికి అసాధ్యం అనేది ఉండదు

కాళికారూపం భయం గోలిపేదిగా ఉంటుంది. కాని తత్త్వం తెలుసు కుంటే భయం ఉండదు. కాళీదర్శనం కలిగితే అంతకంటే అదృష్టం ఇంకొకటి ఉండదు. కాళికా వరప్రసాదికి అసాధ్యం అనేది ముల్లోకాలలో లేనేలేదు. అతని ఆజ్ఞను పంచభూతాలు తలదాల్చవలసిందే.

## శ్మశానకాళీ రూపం అత్యంత భయానకం

భయంకరమైన కాళీరూపాలు కూడా చాలా ఉన్నాయి. అవి చూచి సామాన్య సాధకులు తట్టుకోలేరు. కాళీమాత రూపాలు ఒకటి కాదు. అనేకం ఉన్నాయి. భద్రకాళి, స్మశానకాళి, కరాళకాళి, మహాకాళి ... ఇలా చాలారూపాలు ఉన్నాయి. వాటిలో శ్మశానకాళి రూపం అత్యంత భయానకం. కాని మహాకాళి అలా కాదు. ఆమె రూపం అత్యంత మనోహరంగా ఉండి మాతృత్వ భావనను కలిగిస్తుంది. మన సొంత తల్లిని

కొన్ని ఏళ్ళ తరువాత చూచినప్పటికంటే ఇంకా ఎక్కువ ప్రేమ హృదయంలో పెల్లుబుకుతుంది. కారణం ఆమె ప్రపంచానికే తల్లి. ఆది శక్తి. దేవతలకు మానవులకు సమస్త జీవకోటికి చరాచర సమస్త సృష్టికి మాత.



## కాళి రూపం చిత్రకారుని ఊహ కాదు





కాళి సామాన్యంగా నాలుగు చేతులు కలిగి ఉంటుంది. నూరు చేతుల రూపం కూడా ఉన్నప్పటికీ సామాన్యంగా మనం చూచే రూపం మాత్రం ఇదే. ఒక చేతిలో ఖడ్గము, ఇంకొక చేతిలో ఖండిత శిరస్సు, మిగిలిన రెండు చేతులలో వరద అభయ ముద్రలు దాల్చి అచేతనుడైన శివునిపైన నిలబడి ఉన్నట్లు మనం సాధారంగా కనబడే చిత్రాలలో చూస్తాము. ఇది చిత్రకారుని ఊహకాదు. సాధకులకు దర్శనం ఇచ్చే దేవతా స్వరూపం కూడా ఇలాగే ఉంటుంది అంటారు. ఆ రూపం చిత్రం కంటే ఎన్నోరెట్లు జీవంతో ఉంటుంది. ఆకారం భయానకమే. కాని ఈ భయంకర రూపం రాక్షస ప్రవృత్తి కలవారికే పరిమితం. ఆమె బిడ్డలకు కాదు. బిడ్డకు తల్లి కోపంగా ఉన్నా భయం కలుగదు. ఆ తల్లి కోపం తనలోని అసుర ప్రవృత్తి పైనే గాని తన పైన కాదు అన్న సత్యం తెలిస్తే భయం ఆ అమ్మవారిపై ఉన్న భయం పటాపంచలౌతుంది.

మన దేవతల విగ్రహాలు చిత్రాలు, చిత్రకారుని ఊహలు కావు. అవి మార్మికభాషా సంకేతాలు అని చెబుతారు. అంటే గొప్ప భావాన్ని దృశ్య రూపంగా చెప్పటం. ఈ దృశ్య రూపంకంటే బాగా చెప్పటం, కవితాత్మకంగా చెప్పటం సాధ్యం కాదు అని భావన.

## సృష్టికదలికే శక్తి, ఆ శక్తే కాళి



శివుడు అనగా సృష్టికి ముందు ఉన్నటు వంటి అఖండ నిరాకాల నిశ్చల పరతత్త్వం. అట్టి నిశ్చల తత్వమున కదలిక వచ్చి సృష్టి జరిగింది. ఆ కదలికే శక్తి. ఆ శక్తికే కాళి అని పేరు. అచేతనంగా పడి ఉన్న శివుడు సృష్టికి మూలము ఆధారము అయిన పరమాత్మ. ఆ పర మాత్ముని ఆధారంగా శక్తి సృష్టిస్థితి లయలు చేస్తున్నది. అనగా అచేతన బ్రహ్మము పైన చేతనాత్మక శక్తి నాట్యం చేస్తున్నది. దీనినే శివునిపైన శక్తి నిలిచి ఉన్న చిత్రంగా చూపుతారు.

## జాగృత శక్తికి నిదర్శనం

సాధకుడు ఇంద్రియాతీతుడై సమాధి అవస్థలో ప్రవేశించినపుడు దేహస్పృహ కోల్పోతాడు. అపుడు శవం మాదిరిగా అచేతనుడై పడి ఉంటాడు. కాని ఆ అచేతనునిలో ఆద్యాశక్తి కుండలీరూపంలో జాగృతమై ఉంటుంది. కదలిక లేక సమాధి అవస్థలో ఉన్న సాధకునిలో మహాశక్తి

జాగృతం అయి ఉంటుంది. ఈ శక్తి అతనిలోని రాక్షసత్వాన్ని ఒకే దెబ్బతో అంతం చేస్తుంది. అతనికి వరద అభయశక్తిగా నిలిచి రక్షిస్తుంది. ఆ జాగృత శక్తి ముందు ఏ రాక్షస ప్రవృత్తులూ నిలువలేవు. చావు లేని రక్తబీజుడైనా సరే ఈ శక్తిముందు అంతం కావలసిందే.

## కాళీ అనుగ్రహం పొందినవాని జన్మ ధన్యము



మనిషి తనలోని పశు ప్రవృత్తి, రాక్షసప్రవృత్తి పోవాలని ఎన్నో ప్రయత్నాలు చేయ వచ్చు. కాని అవి సఫలం కావు. పూర్తిగా కళ్లు తెరిచిన జాగృత కుండలినీ శక్తి మాత్రమె ఈ పని ఒక్క క్షణంలో చెయ్య గలుగుతుంది. కాళి నిరంతరం జరుగుతున్న బాహ్యసృష్టి ప్రక్రియకు సజీవ రూపం. ఇంకొక రకంగా సాధకుని ఆంతరిక సాధనా ప్రక్రియకు ప్రతి రూపం. ఈ విధంగా బాహ్య ఆంతరిక భూమికలలో నిరంతరం ఆమె లీల జరుగుతూనే ఉంటుంది. కాళీ అనుగ్రహం పొందగలిగితే అట్టి వాని జన్మలో ఇక అందుకోవలసిన శిఖరాలు ఉండవు. ఆమె సర్వ శక్తిమయి. పరబ్రహ్మ మహిషి అని దేవీ భాగవతం స్తుతించింది. సమస్త లోకాలు భువనాలు ఆశక్తి ఆటలు, లీలా విలాసాలు. సమస్త అవతారాలు, దేవతలు ఆమె

బిడ్డలు. ఆ శక్తిలోనే పుట్టి పెరిగి లయిస్తుంటారు. కాళీశక్తికి అతీతంగా ఏదీ లేదు, ఎవరూ లేరు. ఇదే కాళీ తత్త్వం.

## సర్వమును కబళించే శక్తి



"కాళి" కాల రూపంలో ఉన్న ఈశ్వర శక్తి. తాంత్రికుల దృష్టిలో, యావత్ ప్రపంచము, ఒక మహా శ్మశానము. కాళి, కాల గమనములోని అనంతమైన కదలికలను, అనంత వేగముతో తన సునిశితమైన నాట్య భంగిమలతో వ్యక్తము చేయును. ఆమె, సర్వమును కబళించు నిర్దాక్షిణ్య మారణ ప్రక్రియకు సంకేతము.

## వివిధ రూపాలలో ఆరాధన

శాక్తేయులు ఈమెను తాంత్రిక దేవతగా, బ్రహ్మజ్ఞానాన్ని కలిగించే దేవిగా ఆరాధిస్తారు. ఈమెను కొందరు భవతారిణిగా కొలుస్తారు. రామకృష్ణ పరమహంస వంటి యోగులు ఈమెను కాళీమాతగా పూజించారు.

## సకలప్రాణికోటి చైతన్య శక్తే కాళి

చాందోగ్యోపనిషత్తులో పేర్కొనబడిన సంవర్గ, ప్రాణవిద్యల ఆధారంగా కాళీ ఉపాసన జరుగుతుంది. దేవతలలోని వాయువు, మానవులలోని ప్రాణము అనునవి రెండునూ ముఖ్యమైన సంవర్గములు. ఇవియే సకల ప్రాణికోటికి చైతన్య శక్తిని ఇచ్చునవి. ఈ ప్రాణవాయువు యొక్క వైశ్విక చైతన్య శక్తినే తాంత్రికులు "కాళి" గా ఉపాసిస్తారు.



## కాళీసాధనతో అసాధ్యం అనేది లేదు





కాళీ సాధన వల్ల ఏమి జరుగుతుంది? ఒక్క మాటలో చెప్పాలంటే అసాధ్యాలు సాధించవచ్చు. లోకంలో ఇది అసాధ్యం, జరుగదు అనుకున్న పనులు కాళీ మాత అనుగ్రహం ఉంటే చిటికెలో జరుగుతాయి. ఇదెట్లా సాధ్యం అవుతుంది? కాళీ అను గ్రహంతో కాలగతి త్వరితం అవుతుంది. కర్మ పరిపక్వత త్వరగా అవుతుంది. చెడు కర్మ భస్మీభూతం అవుతుంది. అనేక జన్మల కర్మానుభవం ఒక్క జన్మలో జరుగుతుంది. మహా కాళీ శక్తికి ఎదురు నిలిచే శక్తి ప్రపంచంలో లేదు. ఆ శక్తియే ప్రసన్నురాలైనపుడు ఇక మానవుడు సాధించలేనిదంటూ ఉండదు.



## కాళీమంత్రం కుండలిని మేల్కొలుపుతుంది



కాళీమాతకు, కుండలినీశక్తికి సంబంధం ఉంది. ఎలాగంటే, ఆద్యా శక్తియే ప్రతి మనిషిలోనూ కుండలినీ రూపంలో నిద్రాణ స్థితిలో ఉంటుంది. సూక్ష్మభూమికలను చూడగలిగే శక్తిలేక పోవటమే “నిద్రాణ స్థితి” అంటే. కాళీమంత్ర సాధకులకు కుండలినీ జాగరణ దానంతట అదే సులభంగా జరుగుతుంది. కాళీమంత్రం అద్భుతమైన క్రియాశక్తిని మనిషిలో మేల్కొలుపుతుంది. నిద్రాణంలో ఉన్న కుండలినీ శక్తిని కూడా అదే సులభంగా మేల్కొల్పుతుంది.



## మెడలోని పుర్రెల దండకు అర్థం





కాళీమాత మెడలో పుర్రెల దండ ఉంటుంది. ఈ పుర్రెలు తంత్ర శాస్త్రం ప్రకారం ఏభై ఉండాలి. తంత్ర విజ్ఞానం ప్రకారం ఇవి సంస్కృతం లోని ఏభై అక్షరాలతో సమం. ఈ పుర్రెలదండను వర్ణ మాల అంటారు. 16 అచ్చులు 34 హల్లులు కలిపి మొత్తం 50 అక్షరములే ఈ పుర్రెలు. అక్షర ములు అనే మాటలో అద్భుతమైన అర్థం ఉంది. క్షరము లేనివి అనగా నాశనము లేనివి అక్షరములు. మనుషులు పోవచ్చు. ప్రపంచం నాశనం కావచ్చు. కాని శబ్దం మిగిలే ఉంటుంది. అక్షరములు శబ్ద రూపములు. కనుక వాటికి నాశనం లేదు.



## పుర్రెలను మెడలో ఎందుకు ధరిస్తుంది?



పుర్రెలు శాశ్వతత్వానికి సూచన. మనిషి పోయినా పుర్రెలు లక్షల సంవత్సరాలు అలాగే ఉంటాయి. మనిషి శరీరంలో పుర్రె ముఖ్య భాగం. ఆలోచనను ఇచ్చే మెదడు అందులోనే ఉంది. అలాగే శబ్దాలు పుర్రెలవలె శాశ్వతమైనవి, స్వచ్ఛమైనవి. మనుషుల తలరాతలన్నీ వాటిలో ఉన్నాయి. కనుక మాత వాటిని మెడలో ధరిస్తుంది.

## మాత సర్వ మంత్ర స్వరూపిణి

పుర్రెలదండలో ఇంకొక అద్భుత అర్థం దాగి ఉంది. ఏభై అక్షరాలు షట్ చక్రాలలోని ఏభై దళాలలో ఉంటాయి. కుండలినీ సాధన చేసేవారికి వీటి గురించి వివరాలు పరిచితమే. మూలాధార పద్మం 4 దళములు. స్వాధిష్టాన పద్మం 6 దళములు, మణిపూరక పద్మం 10 దళములు, అనాహత పద్మం 12 దళములు, విశుద్ధ పద్మం 16 దళములు చివరిదైన ఆజ్ఞాపద్మం 2 దళములు అన్నీ కలిపి 50 దళములలో ఈ ఏభై అక్షరాలు, 50 స్పందనలుగా ఉంటాయి. సమస్త మంత్రాలు ఈ ఏభై అక్షరాల వివిధ సమాహారములే. కనుక మాత సర్వ మంత్రాత్మిక. సర్వ మంత్ర మయి. సర్వ మంత్ర స్వరూపిణి.

## నేటికీ ఉజ్జయినిలో కాళీ సాధకులు

కాళికా ఉపాసన ఇప్పటికీ ఉజ్జయిని ప్రాంతాలలో అధికంగా ఉంది. వంగ దేశం ఈ దేవతకు ప్రధాన ఆవాస స్థానం. ఇప్పటికీ ఉజ్జయిని ప్రాంతాలలో కాళీ ఉపాసన అనేక రహస్య మార్గాలలో చేసేవారు ఎందరో సాధకులు ఉన్నట్లు చెబుతారు.

## కాళీప్రసాద పాత్రుడు

శరీరమందు నిరంతరము ప్రవహించుచు, జీవయాత్రను నిర్వహించుచున్న ఈ ప్రాణవాయువు, ప్రతి కదలికలోనూ ఏకాగ్రతను కల్పించి, చాంచల్యములేని మనస్సుతో మాతను కొలిచేవారిని కాళి ఎప్పుడూ రక్షించును. ఉచ్ఛ్వాస-నిశ్వాస గతులను అనుసరించుచూ, శ్వాస మూలమును పొందుచూ, ప్రాణాన్ని ఉపాశించువాడు కాళీప్రసాద పాత్రుడు కాగలడు.

# శ్రీ కాళీ స్తోత్రమ్

ప్రాగ్దేహస్థో యదావా తవ చరణయుగం నాశ్రితో నార్చితోఽహం
తేనాద్యాకీర్తివర్గై ర్జఠరజదహనై ర్బాధ్యమానోబలిష్ఠైః
క్షిప్త్వా జన్మాంతరాన్నః పునరిహ భవితా క్వాశ్రయఃక్వాపి
సేవా క్షంతవ్యోమోఽపరాధః ప్రకటితవదనే కామరూపే కరాళే. 1

బాల్యే బలాభిలా పైర్జటిత జడమతి ర్బాలలీలాప్రసక్తో
నత్వాం జనామి మాతః కలికలుషహరాం భోగమోక్షప్రదాతీమ్
నాచారోనైవ పూజా నచయజనకథా నస్మృతిర్నైవ
సేవా క్షంతవ్యోమోఽపరాధః ప్రకటితవదనే కామరూపే కరాళే. 2

ప్రాప్తోఽహం యౌవనంచే ద్విషధర సదృశై రింద్రియైర్దష్టగాత్రో
నష్టప్రజ్ఞః పరస్త్రీ పరధన హరణే సర్వదా సాభిలాషః
త్వత్పాదాంభోజయుగ్మం క్షణమపి మనసా నస్మృతోనార్చితోవా
క్షంతవ్యోమేఽపరాధః ప్రకటితవదనే కామరూపే కరాళే. 3

ప్రౌఢోభిక్షాభిలాషీ సుతదుహితృకళత్రార్థమన్నాది చేష్టః క్వప్రాప్స్యే
కుత్రయామీ త్యనుదిన మనిశం చింతయామగ్న చిత్తః
నోతేధ్యానం నచాస్థా నచ భజనవిధిర్నామసంకీర్తనంవా
క్షంతవ్యోమేఽపరాధః ప్రకటితవదనే కామరూపే కరాళే. 4

వృద్ధత్వే బుద్ధిహీనః కృశవినశతసుః శ్వాసకాసా తిసారైః
కర్మానర్హోఽక్షిహీనః ప్రగళితదశనః క్షుత్పిపాసాభిభూతః
పశ్చాత్తాపేనదగ్ధో మరణమనుదినం ద్యేయామాత్రం నచాన్యత్
క్షంతవ్యోమేఽపరాదః ప్రకటితవదనే కామరూపే కరాళే. 5

కృత్వాస్నానం దినాదౌ క్వచిదపి సలిలం నాహృంతం నైవపుష్పం
తే నైవేద్యాదికంచ క్వచిదపి న కృతం నాపిభావోనభక్తిః
న న్యాసోనైవ పూజా నచ గుణకథనం నాపిచర్చా కృతా తే
క్షంతవ్యోమేపరాధః ప్రకటితవదనే కామరూపే కరాళే. 6

జానామిత్వాం నచాహం భవభయశమనీం సర్వసిద్ధి ప్రదాత్రీం
నిత్యానందోదయాఢ్యాం త్రితయగుణమయీాం నిత్యశుద్ధో దయాఢ్యామ్
మిథ్యాకర్మాభిలాషైరనుదిన మభితః పీడితో దుఃఖ సంఘైః
క్షంతవ్యోమేఽపరాధః ప్రకటితవదనే కామరూపే కరాళే. 7

కాలాభ్రశ్యామలాంగీ విగళితచికురా ఖడ్గముండాభి
రామాత్రా సత్రాణేష్టదాత్రీ కుణపగణ శిరోమాలినీ దీర్ఘనేత్రా
సంసార స్యైకసారా భవజననహరా భావితా నైవభావైః
క్షంతవ్యోమేఽపరాధః ప్రకటితవదనే కామరూపే కరాళే. 8

బ్రహ్మోవిష్ణుస్తథేశః పరిణమతి సదా త్వత్పదాంభోజ యుగ్మం
భాగా భావాన్న చాహం భవమహిషి భవత్పాదయుగ్మం భజామి
నిత్యం లోభప్రలోభైః కృతవివశమతిః కాముకస్త్వాం యయాచే
క్షంతవ్యోమేఽపరాధః ప్రకటితవదనే కామరూపే కరాళే. 9

రాగద్వేషైః ప్రమత్తః కలుషయుతతనుః కామనాభోగలుబ్ధః
కార్యాకార్యా విచారీ కులమతిరహితః కౌలసంఘైర్విహీనః
క్వధ్యానం తే క్వచర్చా క్వచ మనుజపతా నైవ కించిత్కృతం స్యాత్
క్షంతవ్యోమేఽపరాధః ప్రకటితవదనే కామరూపే కరాళే. 10

రోగీ దుఃఖీ దరిద్రః పరవశ కృపణః పాంసులః పాపచేతాః
నిద్రాలస్య ప్రసక్త స్సుజఠర భరణ వ్యాకుల క్లేశితాత్మా
కింతే పూజావిధానంత్వయిక్వచభజనం క్వాసురాగః క్వచాస్థా
క్షంతవ్యోమేఽపరాధః ప్రకటితవదనే కామరూపే కరాళే. 11

మిథ్యావ్యామోహరోగైః పరివృతమనసః క్లేశసంఘాన్వితస్య
క్షున్నిద్రౌఘాన్వితస్య స్మరసు విరహిణః పాపకర్మ ప్రవృత్తైః
దారిద్రస్య క్వ ధర్మః క్వచ జననరుచిః క్వస్థితి స్సాధుసంఘః
క్షంతవ్యోమేఽపరాధః ప్రకటితవదనే కామరూపే కరాళే. 12

మాతస్తాతస్య దేహాజ్జనని జఠరగస్సంస్థిత స్త్వద్వశేహంత్వం
హర్తా కారయిత్రీ కరణ గుణమయీ కర్మహేతు స్వరూపా
త్వంబుద్ధిశ్చిత్తసంస్థా ప్యహమతి భవతీ సర్వమేతతక్షమస్వ
క్షంతవ్యోమేఽపరాధః ప్రకటితవదనే కామరూపే కరాళే. 13

త్వం భూమిస్త్వం జలంచ త్వమసి హుతవహస్త్వంజగద్వాయురూపా
త్వం చాకాశం మనశ్చ ప్రకృతిరసి మహత్పూర్వికా పూర్వపూర్వా
ఆత్మ త్వం చాసి మాతః పరమసి భవతీ త్వత్పరన్నైవకించిత్
క్షంతవ్యోమేఽపరాధః ప్రకటితవదనే కామరూపే కరాళే. 14

త్వం కాళీ త్వం చ తారా త్వమసిగిరిసుతా సుందరీ భైరవీత్వం
త్వం దుర్గా ఛ్ఛిన్నమస్తా త్వమసిచ భువనత్వం హిలక్ష్మీశ్శివాత్వమ్
ధూమా మాతంగినీత్వం త్వమసి చ బగళా మంగళాది స్తవాఖ్యా
క్షంతవ్యోమేఽపరాధః ప్రకటితవదనే కామరూపే కరాళే. 15

స్తోత్రేణానేన దేవీం పరిణమతి జనో యస్సదా భక్తియుక్తో
దుష్కృత్యా దుర్గసంఘాత్పరితరతి శతం విఘ్న తానాశమేతి
నాధిర్వ్యాధిః కదాచిద్భవతి యదిపునస్సర్వదా సాపరాధః
సర్వం తత్కామరూపే త్రిభువన జనని క్షామయేః పుత్రబుద్ధ్యా. 16

జ్ఞాతావక్తాకవీశో భవతిధనపతి ర్దానశీలోదయాత్మా
నిష్పాపీ నిష్కళంకీ కులపతికుశల స్సత్యవాగ్ధార్మికశ్చ
నిత్యానందో దయాఢ్యః పశుగణవిముఖ స్సత్యథా చారశీలః
సంసారాబ్ధిం సుఖేన ప్రతరతిగిరిజా పాదయుగ్మావలంబాత్ 17

**ఇతి శ్రీ మద్విద్యారణ్యకృతం శ్రీమహాకాళీ స్తోత్రమ్ సమాప్తం**

# శ్రీ మహాకాళీ స్తోత్రం

**ధ్యానం :**

శవారూధాం మహాభీమాం ఘోరదంష్ట్రాం వరప్రదాం

హాస్యయుక్తాం త్రిణేత్రాంచ కపాల కర్త్రికా కరాం ।

ముక్తకేశీం లలజ్జిహ్వాం పిబంతీం రుధిరం ముహుః

చతుర్బాహుయుతాం దేవీం వరాభయకరాం స్మరేత్ ॥

శవారూఢాం మహాభీమాం ఘోరదంష్ట్రాం హసన్ముఖీం
చతుర్భుజాం ఖడ్గముండవరాభయకరాం శివాం ।
ముండమాలాధరాం దేవీం లలజ్జిహ్వాం దిగంబరాం
ఏవం సంచింతయేత్కాళీం శ్మశనాలయవాసినీమ్ ॥

**స్తోత్రం :**

ఓం విశ్వేశ్వరీం జగద్ధాత్రీం, స్థితి సంహారకారిణీం
నిద్రాం భగవతీం విష్ణో రతులాం తేజసః ప్రభాం ॥ 1

సుధాత్వ మక్షరే నిత్యే త్రిధా మాత్రాత్మికా స్థితా
అర్థమాత్రా స్థితౌ నిత్యా యానుచ్చార్యా విశేషతః ॥ 2

త్వమేవ సంధ్యా సావిత్రీ త్వం దేవీ జననీ పరా
త్వయైతద్ధార్యతే విశ్వం త్వయైతద్ సృజ్యతే జగత్ ॥ 3

త్వయైతత్పాల్యతే దేవి! త్వమత్స్యంతే చ సర్వదా
విసృష్టౌ సృష్టి రూపా త్వం స్థితి రూపా చ పాలనే ॥ 4

తథా సంహతి రూపాంతే జగతోఽస్య జగన్మయే
మహావిద్యా మహామాయా మహామేధా మహాస్మృతిః ॥ 5

మహామోహా చ భగవతీ మహాదేవీ మహాసురీ
ప్రకృతిస్త్వం చ సర్వస్య గుణత్రయ విభావినీ ॥ 6

కాలరాత్రి ర్మహారాత్రి ర్మోహరాత్రిశ్చ దారుణా
త్వం శ్రీస్త్వ మీశ్వరీ త్వం హ్రీస్త్వం బుద్ధిర్బోధ లక్షణా ॥ 7

లజ్జా పుష్టి స్తథా తుష్టిః త్వం శాంతిః శాంతి రేవ చ
ఖడ్గినీ మాలినీ ఘోరాగదినీ చక్రిణీ తథా ॥ 8

శంఖినీ చాపినీ బాణా భుశుండీ పరిఘాయుధా
సౌమ్యా సౌమ్యతరాశేషా సౌఖ్యేభ్యస్త్వతి సుందరీ ॥ 9

పరా పరాణాం చ పరమా త్వమేవ పరమేశ్వరీ
యచ్ఛ కించిద్క్వచిద్వస్తు సదసద్వాఖిలాత్మి కే ॥ 10

యస్య సర్వస్య యా శక్తిః సాత్వం కిం స్తూయసే తదా
యయాత్వయా జగత్ స్రష్టా జగత్పాత్యత్తియో జగత్ ॥ 11

సోపి నిద్రా వశం నీతః కస్త్వాం స్తోతుమ్మహేశ్వరః
విష్ణుః శరీర గ్రహణ మహామీశాన ఏవ చ ॥ 12

కారితాస్తే యతోతస్త్వం కః స్తోతుం శక్తిమాన్ భవేత్
సాత్వమిత్థం ప్రభావైః స్వైః ఉదారైర్దేవి సంస్తుతా ॥ 13

త్వం భూమిస్త్వం జలం చ త్వమసిహుతవహ స్త్వం జగద్వాయురూపా
త్వం చాకాశమ్మనశ్చ ప్రకృతి రసి మహిత్పూర్వికా పూర్వ పూర్వా॥ 14

ఆత్మాత్వం చాసి మాతః పరమసి భగవతి త్వ త్పరాన్నైవ కించిత్
క్షంతవ్యో మేపరాధః ప్రకటిత వదనే కామరూపే కరాళే ॥ 15

కాలాభ్రాం శ్యామలాంగీం విగళిత చికురాం ఖడ్గముండాభిరామాం
త్రాసత్రాణేష్టదాత్రీం కుణపగణ శిరోమాలినీం దీర్ఘనేత్రాం ॥ 16

సంసారస్యైక సారాం భవజననహరాం భావితో భావనాభిః
త్వం స్వాహాత్వం స్వధాత్వం హివషట్కారః స్వరాన్వికా ॥ 17

# కాళికా స్తోత్రం

**శ్రీగణేశాయ నమః ।**

దధన్నైరన్తర్యాదపి మలినచర్యాం సపది యత్
సపర్యాం పశ్యన్సన్ విశతు సురపుర్యాం నరపశుః ।
భటాన్వర్యాన్ వీర్యాసమహరదసూర్యాన్ సమితి యా
జగద్ధుర్యా కాళీ మమ మనసి కుర్యాన్నివసతిమ్ । ।1।

లసన్నాసాముక్తా నిజచరణభక్తావనవిధౌ
సముద్యుక్తా రక్తామ్బురుహదృగలక్తాధరపుటా ।
అపి వ్యక్తాఽవ్యక్తాయమనియమసక్తాశయశయా
జగద్ధుర్యా కాళీ మమ మనసి కుర్యాన్నివసతిమ్ । ।2।

రణత్సన్జ్మరా ఖలదమనధీరాఽ_తిరుచిర-
స్ఫురద్విద్యుచ్ఛీరా సుజనఝషనీరాయితతనుః ।
విరాజత్కోటీరా విమలతరహీరా భరణభృత్
జగద్ధుర్యా కాళీ మమ । 3

వసానా కౌశేయం కమలనయనా చన్ద్రవదనా
దధానా కారుణ్యం విపులజఘనా కున్దరదనా ।
పునానా పాపాద్యా సపది విధునానా భవభయం
జగద్ధుర్యా కాళీ మమ । 4

రధూత్తంసప్రేక్షారణరణికయా మేరుశిఖరాత్
సమాగాద్యా రాగాజటితి యమునాగాధిపమసౌ ।
నగాదీశప్రేష్ఠా నగపతిసుతా నిర్జరనుతా
జగద్ధుర్యా కాళీ మమ మనసి । 5

విలసన్నవరత్నమాలికా కుటిలశ్యామలకున్తలాలికా ।
నవకుఙ్కుమభవ్యభాలికాఽ_వతు సా మాం సుఖకృద్ధి కాళికా । 6

యమునాచలద్దమునా దుఃఖదవస్య దేహినామ్ ।
అమునా యది వీక్షితా సకృచ్ఛము నానావిధమాతనోత్యహో । 7

అనుభూతి సతీప్రాణపరిత్రాణపరాయణా ।
దేవైః కృతసపర్యా సా కాళీ కుర్యాచ్ఛుభాని నః । 8

య ఇదం కాలికాస్తోత్రం పఠేత్తు ప్రయతః శుచిః ।
దేవీసాయుజ్యభుక్ చేహ సర్వాన్కామానవాప్నుయాత్ । 9

ఇతి కాళికాస్తోత్రం సంపూర్ణమ్ ।



# కాళీ స్తోత్రం (పరశురామకృతం)



**పరశురామ ఉవాచ ।**

నమః శ్కరకాన్తాయై సారాయై తే నమో నమః ।
నమో దుర్గతినాశిన్యై మాయాయై తే నమో నమః । 1

నమో నమో జగద్ధాత్ర్యై జగత్కర్త్ర్యై నమో నమః ।
నమోఽస్తు తే జగన్మాత్రే కారణాయై నమో నమః । 2

ప్రసీద జగతాం మాతః సృష్టిసంహారకారిణి ।
త్వత్పాదౌ శరణం యామి ప్రతిజ్ఞాం సార్థికాం కురు । 3

త్వయి మే విముఖాయాం చ కో మాం రక్షితుమీశ్వరః ।
త్వం ప్రసన్నా భవ శుభే మాం భక్తం భక్తవత్సలే । 4

యుష్మాభిః శివలోకే చ మహ్యం దత్తో వరః పురా ।
తం వరం సఫలం కర్తుం త్వమర్హసి వరాననే । 5

రేణుకేయస్తవం (జామదగ్న్యస్తవం) శ్రుత్వా ప్రసన్నా భవదామ్బికా
మా భైరిత్యేవముక్త్వా తు తత్రైవాన్తరధీయత । 6

ఏతద్ భృగుకృతం స్తోత్రం భక్తియుక్తశ్చ యః పఠేత్ ।
మహాభయాత్సముత్తీర్ణః స భవేదేవ లీలయా । 7

స పూజితశ్చ త్రైలోక్యే తత్రైవ విజయీ భవేత్ ।
జ్ఞానిశ్రేష్ఠో భవేచ్చైవ వైరిపక్షవిమర్దకః । 8

ఇతి శ్రీబ్రహ్మవైవర్తపురాణే గణేశఖణ్డే షట్త్రింశోఽధ్యాయాన్తర్గతమ్
శ్రీపరశురామకృతం కాళీస్తోత్రం సమ్పూర్ణమ్ ।



## శ్రీ మహాకాళీ పరాక్రమ శ్లోకం





విచిత్ర ఖట్వాంగధరా నరమాలా విభూషణా ।
ద్వీపి చర్మ పరీధానా శుష్కమాంసాతిభైరవా ॥
అతి విస్తార వదనా జిహ్వాలలన భీషణా ।
నిమగ్నారక్త నయనా నాదాపూరితదిఙ్ముఖా ॥

# కామ కళా కాళి భుజంగ ప్రయాత స్తోత్రం

శ్రీ గణేశాయ నమః ।

మహాకాల ఉవాచ ।

అథ వక్ష్యే మహేశాని దేవ్యాః స్తోత్రమనుత్తమమ్ ।
యస్య స్మరణమాత్రేణ విఘ్నా యాన్తి పరాఙ్ముఖాః ॥ 1

విజేతుం ప్రతస్థే యదా కాలకస్యా
సురాన్ రావణో ముఞ్జమాలిప్రవర్వాన్ ।
తదా కామకాలీం స తుష్టావ
వాగ్భిర్జిగీషుర్మృధే బాహువీర్యేణ సర్వాన్ ॥ 2

మహావర్తభీమాసృగబ్ధ్యుత్థవీచీ-
పరిక్షాలితా శ్రాన్తకన్థశ్మశానే ।
చితిప్రజ్వలద్వహ్నికీలాజటాలే
శివాకారశావాసనే సన్నిషణ్ణామ్ ॥ 3

మహాభైరవీయోగినీడాకినీభిః
కరాలాభిరాపాదలమ్బత్కచాభిః ।
భ్రమన్తీభిరాపీయ మద్యామిషాస్రాన్యజస్రం
సమం స్ఫురన్తీం హసన్తీమ్ ॥ 4

మహాకల్పకాలాన్తకాదమ్బినీ-
త్విట్పరిస్పర్ధిదేహద్యుతిం ఘోరనాదామ్ ।
స్ఫురద్ద్వాదశాదిత్యకాలాగ్నిరుద్ర-
జ్వలద్విద్యుదోఘప్రభాదుర్నిరీక్ష్యామ్ ॥ 5

లసన్నీలపాషాణనిర్మాణవేది
ప్రభశ్శ్రోణిబిమ్బాం చలత్పీవరోరుమ్ ।
సముత్తుఙ్గపీనాయతోరోజకుమ్భాం
కటిగ్రన్థితద్వీపికృత్త్యుత్తరీయామ్ ॥ 6

స్రవద్రక్తవల్గన్నృముణ్డావనద్ధా-
సృగాబద్ధనక్షత్రమాలైకహారామ్ ।
మృతబ్రహ్మకుల్యోపక్ఌప్తాఙ్గభూషాం
మహాట్టాట్టహాసైర్జగత్ త్రాసయన్తీమ్ ॥ 7

నిపీతాననాన్తామితోద్వృత్తరక్తో-
చ్ఛలద్ధారయా స్నాపితోరోజయుగ్మామ్ ।
మహాదీర్ఘదంష్ట్రాయుగన్యఞ్చదఞ్చ-
ల్లలల్లేలిహానోగ్రజిహ్వాగ్రభాగామ్ ॥ 8

చలత్పాదపద్మద్వయాలమ్బిముక్త-
ప్రకమ్పాలిసుస్నిగ్ధసమ్భుగ్నకేశామ్ ।
పదన్యాససమ్భారభీతాహిరాజా
ననోద్గచ్ఛదాత్మస్తుతివ్యస్తకర్ణామ్ ॥ 9

మహాభీషణాం ఘోరవింశార్ధవక్త్రై
స్తథాసప్తవింశాన్వితైర్లోచనైశ్చ ।
పురోదక్షవామే ద్వినేత్రోజ్జ్వలాభ్యాం
తథాన్యాననే త్రిత్రినేత్రాభిరామామ్ ॥ 10

లసద్వీపిహర్యృక్షఫేరుప్లవఙ్గ-
క్రమేలర్క్షతార్క్ష్యద్విపగ్రాహవాహైః ।
ముఖైరీదృశాకారితైర్భ్రాజమానాం
మహాపిఙ్గలోద్యజ్జటాజూటభారామ్ ॥ 11



భుజైః సప్తవింశ్యాత్తైర్వామభాగే
యుతాం దక్షిణే చాపి తావద్భిరేవ ।
క్రమాద్రత్నమాలాం కపాలం చ శుష్కం
తతశ్చర్మపాశం సుదీర్ఘం దధానామ్ ॥ 12

తతః శక్తిఖట్వాముణ్డం భుశుణ్డీం
ధనుశ్చక్రఘణ్టాశిశుప్రేతశైలాన్ ।
తతో నారక్కలబభ్రూరగోన్మాద
వంశీం తథా ముద్గరం వహ్నికుణ్డమ్ ॥ 13

అధో డమ్మరుం పారిఘం భిన్దిపాలం
తథా మౌశలం పట్టిశం ప్రాశమేవమ్ ।
శతఘ్నీం శివాపోతకం చాథ దక్షే
మహారత్నమాలాం తథా కర్తుఖడ్గౌ ॥ 14

చలత్తర్జనీమ్కుశం దణ్డముగ్రం
లసద్రత్నకుమ్భం త్రిశూలం తథైవ ।
శరాన్ పాశుపత్యాంస్తథా ప్చ కున్తం
పునః పారిజాతం ఛురీం తోమరం చ ॥ 15

ప్రసూనస్రజం డిణ్డిమం గృధ్రరాజం
తతః కోరకం మాంసఖణ్డం స్రువం చ ।
ఫలం బీజపూరాహ్వయం చైవ సూచీం
తథా పర్శుమేవం గదాం యష్టిముగ్రామ్ ॥ 16

తతో వజ్రముష్టిం కుణప్పం సుఘోరం
తథా లాలనం ధారయన్తీం భుజైస్తైః ।
జవాపుష్పరోచిష్ఫణీన్ద్రోపక్లృప్త
క్వణన్నూపురద్వన్ద్వసక్తాఙ్ఘ్రిపద్మామ్ ॥ 17

మహాపీతకుమ్భీనసావద్ధనద్ధ
స్ఫురత్సర్వహస్తోజ్జ్వలత్కఙ్కణాం చ ।
మహాపాటలద్యోతిదర్వీకరేన్ద్రా-
వసక్తాఙ్గదవ్యూహసంశోభమానామ్ ॥ 18

మహాధూసరత్త్విడ్భుజఙ్గేన్ద్రక్లృప్త-
స్ఫురచ్చారుకాటేయసూత్రాభిరామామ్ ।
చలత్పాణ్డురాహీన్ద్రయజ్ఞోపవీత-
త్విడుద్భాసివక్షఃస్థలోద్యత్కపాటామ్ ॥ 19

పిషఙ్గరగేన్ద్రావనద్ధావశోభా
మహామోహబీజాఙ్గసంశోభిదేహామ్ ।
మహాచిత్రితాశీవిషేన్ద్రోపక్లృప్త
స్ఫురచ్చారుతాటఙ్కవిద్యోతికర్ణామ్ ॥ 20

వలక్షాహిరాజావనద్ధోర్ధ్వభాసి
స్ఫురత్త్రిప్రలోద్యజ్జటాజూటభారామ్ ।
మహాశోణభోగీన్ద్రనిస్యూతమూర్ణో
ల్లసత్కింకిణీజాలసంశోభిమధ్యామ్ ॥ 21

సదా సంస్మరామీదృశోం కామకాలీం
జయేయం సురాణాం హిరణ్యోద్భవానామ్ ।
స్మరేయుర్హి యేఽన్యేఽపి తే వై జయేయు
ర్విపక్షాన్మృధే నాత్ర సన్దేహలేశః ॥ 22

పఠిష్యన్తి యే మత్కృతం స్తోత్రరాజం
ముదా పూజయిత్వా సదా కామకాలీమ్ ।
న శోకో న పాపం న వా దుఃఖదైన్యం
న మృత్యుర్న రోగో న భీతిర్న చాపత్ ॥ । 23 ।

ధనం దీర్ఘమాయుః సుఖం బుద్ధిరోజో
యశః శర్మభోగాః స్త్రియః సూనవశ్చ ।
శ్రియో మ్గలం బుద్ధిరుత్సాహ ఆజ్ఞా
లయః శర్మ సర్వ విద్యా భవేన్ముక్తిరన్తే ॥ । 24 ।

ఇతి శ్రీమహావామకేశ్వర తన్త్రే కాలకేయ హిరణ్యపుర విజయే
రావణకృతం కామకలాకాళీభుజఙ్గప్రయాతస్తోత్రరాజం సంపూర్ణమ్

# శ్రీ కాళీ హృదయ స్తోత్రం

**శ్రీ మహాకాళ ఉవాచ :**

సహస్రం దుఃఖమాప్నోతిసోఽ చిరాన్మృత్యుమాప్నుయాత్
మహాకౌతుహలస్తోత్రం హృదయాఖ్యం మహోత్తమమ్
శృణుప్రియే మహాగోప్యందక్షిణాయా స్సుగోపితమ్. 1

అవాచ్యమపి వక్ష్యామి తవప్రీత్యా ప్రకాశితమ్
అన్యేభ్యః కురుగోప్యంచ సత్యం సత్యంచ శైలజే. 2

**శ్రీదేవ్యువాచ :**

తస్మిన్యుగే సముత్పన్నం కేనస్తోత్రం కృతంపురా
తత్సర్వం కథ్యతాం శంభో మహేశ్వర దయానిధే 3

**శ్రీ మహాకాళ ఉవాచ :**

పురా ప్రజాపతేశ్శీర్ష ఛేదనం కృతవాహనమ్
బ్రహ్మహత్యాకృతైః పాపైః భైరవత్వం మమాంగతః 4

బ్రహ్మహత్యా వినాశాయ కృతం స్తోత్రం మయాప్రియే
కృత్యావినాశకంస్తోత్రం బ్రహ్మహత్యాపహారకమ్ 5

ఓం అస్యశ్రీ దక్షిణకాళీ హృదయస్తోత్ర మహామంత్రస్య, శ్రీ మహాకాల ఋషిః ఉష్ణిక్ఛందః శ్రీ దక్షిణకాళీకాదేవతా, క్రీం బీజం, హ్రీంశక్తిః నమః కీలకం, సర్వపాపక్షయార్థేజపే వినియోగః.

ఓం క్రాం హృదయాయ నమః ఓం క్రీం శిరసే స్వాహా, ఓం క్రూం శిఖాయై వషట్, ఓం క్రైం కవచాయహుం, ఓం క్రౌం నేత్రత్రయాయ వౌషట్, ఓం క్రః అస్త్రాయఫట్.

**ధ్యానమ్**

ఓం ధ్యాయేత్కాళీం మహామాయాం త్రినేత్రాంబహురూపిణీమ్
చతుర్భుజాం లలజ్జిహ్వాం పూర్ణచంద్ర నిభాననామ్. 6

నీలోత్పలదళప్రఖ్యాం శత్రుసంఘ విదారిణీమ్
నరముండం తథాఖడ్గం కమలం వరదం తథా. 7

బిభ్రాణీం రక్తవదనాం దంష్ట్రాళీం ఘోరరూపిణీమ్
అట్టాట్టహాసనిరతం సర్వదా చ దిగంబరామ్ 8
శవాసన స్థితాం దేవీం ముండమాలా విభూషితామ్
ఇతిధ్యాత్వా మహాదేవీం తతస్తు హృదయంపఠేత్. 9
ఓం కాళికా ఘోరరూపాఽద్యా సర్వకామఫలప్రదా
సర్వదేవస్తుతాదేవీ శత్రునాశం కరోతు మే. 10
హ్రీం హ్రీం స్వరూపిణీ శ్రేష్ఠా త్రిషులోకేషుదుర్లభా
తవస్నేహాన్మయాఖ్యాతం నదేయం యస్య కస్యచిత్ 11
అథధ్యానం ప్రవక్ష్యామి నిశామయా పరాత్మికే
యస్య విజ్ఞానమాత్రేణ జీవన్ముక్తో భవిష్యతి. 12
నాగయజ్ఞోపవీతాంచ చంద్రార్థ కృతశేఖరామ్
జటాజూటంచసంచిత్య మహాకాళసమీపగామ్ 13
ఏవంన్యాసాదాయ స్సర్వే యే ప్రకుర్వంతి మానవాః
ప్రాప్నువంతిచతే మోక్షం సత్యం సత్యం వరాననే 14
యంత్రం శృణు పరందేవ్యా స్సర్వాభీష్ట ప్రదాయకమ్
గోప్యాద్గోప్యతరం గోప్యం గోప్యాద్గోప్యతరం మహత్ 15
త్రికోణం పంచకం చాష్ట కమలం భూపురాన్వితమ్
ముండపంక్తించ జ్వాలాంచ కాళీయంత్రం సుసిద్ధిదమ్ 16
మంత్రంతు పూర్వ కథితం ధారయస్వ సదాప్రియే
దేవ్యాదక్షిణకాళ్యాస్తు నామమాలాంనిశామయా 17

కాళీ దక్షిణకాళీ చ కృష్ణరూపా పరాత్మికా
ముండమాలా విశాలాక్షీ సృష్టిసంహారకారిణీ. 18

స్థితిరూపా మహామాయా యోగనిద్రా భగాత్మికా
భగసర్పిః పానరతా భగధ్యేయో భగాంగజా. 19

ఆద్యాసదా నవాఘోరా మహాతేజాః కరాళికా
ప్రేతవాహా సిద్ధిలక్ష్మీ రనిరుదా సరస్వతీ. 20

నామాన్యేతాని సుభగే యే పఠంతి దినే దినే
తేషాం దాసస్య దాసోహం సత్యం సత్యం మహేశ్వరి. 21

కాళీం కాళహరాందేవీం కంకాళీం బీజరూపిణీం
కాలరూపాం కాలాతీతాం కాళికాం దక్షిణాంభజే 22

కుండగోళప్రియాం దేవీం స్వయంభూతాం సుమప్రియాం
రతిప్రియాం మహారౌద్రీం కాళికాం ప్రణమామ్యహమ్ 23

దూతీప్రియాం మహాదూతీం ద్యూతీయోగేశ్వరీం పరాం
దూతీయోగోద్భవరతాం దూతీరూపాంనమామ్యహమ్ 24

క్రీం మంత్రేణ జలంజప్త్వా సప్తధా సేచనేనతు
సర్వరోగా వినశ్యంతి నాత్రకార్యా విచారణా 25

క్రీం స్వాహాం తైర్మహామంత్రై శ్చందనం సాధయేత్తతః
తిలకం క్రియతే ప్రాజ్ఞైర్లోకోవశ్యో భవేత్సదా 26

క్రీం హ్రూం హ్రీంమంత్రజాపేన చాక్షతం సప్తభిఃప్రియే
మహాభయ వినాశశ్చ జాయతే నాత్ర సంశయః 27

క్రీం ప్రీం ప్రూం స్వాహామంత్రేణశ్మశానేభస్మమంత్రయేత్ ।
శత్రోర్గృహే ప్రతిక్షిప్త్వా శత్రోర్మృత్యు ర్భవిష్యతి 28
ప్రూం ప్రీం క్రీం చేతి చోఉచ్చాటీ పుష్పం సంశోధ్య సప్తధా
రిపూణాం చైవ చోచ్చాటం నయత్యేవ నసంశయః 29
ఆకర్షణే చ క్రీం క్రీం క్రీం జప్త్వాక్షతం ప్రతిక్షిపేత్
సహస్ర యోజనస్థావ శీఘ్రమాగచ్ఛతి ప్రియే. 30
క్రీం క్రీం క్రీం ప్రూం ప్రూం ప్రీం ప్రీం చ కజ్జలం శోధితం తథా
తిలకేన జగన్మోహనః సప్తధా మంత్ర మాచరేత్ 31
హృదయం పరమేశాని సర్వపాప హారం పరమ్
అశ్వమేధాది యజ్ఞానాం కోటి కోటి గుణోత్తరమ్ 32
కన్యాదానాది దానానాం కోటి కోటి గుణం ఫలమ్
దూతీయాగాది యాగానాం కోటి కోటి ఫలం స్మృతమ్ 33
గంగాది సర్వతీర్థానాం ఫలం కోటి గుణం స్మృతమ్
ఏకదా పాఠమాత్రేణ సత్యం సత్యం మయోదితమ్ 34
కౌమారీ స్వేష్టరూపేణ పూజాం కృత్వా విధానతః
పఠేత్ స్తోత్రం మహేశాని జీవన్ముక్త స్స ఉచ్యతే. 35
రజస్వలా భగం దృష్ట్వా పఠేదేకాగ్ర మానసః
లభతే పరమం స్థానం దేవలోకే వరాననే 36
మహదుఃఖే మహారోగే మహాసంకటకే దినే
మహాభయే మహాఘోరే పఠేత్ స్తోత్రం మహోత్తమమ్. 37
సత్యం సత్యం పున స్సత్యం గోపయేన్మాతృజారవత్.

ఇతి శ్రీ కాళీ హృదయమ్ సమాప్తం

# శ్రీ మత్కాళీ కవచం

**భైరవ్యువాచ :**

కాళీపూజా శ్రుతా నాథ భావాశ్చ వివిధాః ప్రభో
ఇదానీం శ్రోతుమిచ్ఛామి కవచం పూర్వసూచితమ్ 1

త్వమేవస్రష్టా పాతా చ సంహర్తాచ త్వమేవహి
త్వమేవ శరణం నాథ త్రాహిమాం దుఃఖసంకటాత్ 2

**భైరవ ఉవాచ :**

రహస్యం శృణు వక్ష్యామి భైరవ ప్రాణవల్లభే
శ్రీజగన్మంగళం నామకవచం మంత్రవిగ్రహమ్ 3

పఠిత్వా ధారయిత్వా చ త్రైలోక్యం మోహయేతక్షణాత్
నారాయణోऽపి యద్ధృత్వా నారీ భూత్వా మహేశ్వరమ్ 4
యోగినం క్షోభోమనయద్యద్ధృత్వా చ రఘూత్తమః
పరితృప్తో జఘానైన రావణాది నిశాచరాన్ 5
యస్య ప్రసాదాదీశోऽహం త్రైలోక్య విజయీ విభుః
ధనాధిపః కుబేరోऽపి సురేశోऽభూచ్ఛచీ పతిః 6
ఏవంహి సకలాదేవా స్సర్వసిద్ధీశ్వరాః ప్రియే
శ్రీజగన్మంగళస్యాస్య కవచస్య ఋషిశ్శివః 7
ఛందోऽనుష్టు బ్దేవతాచ కాళికా దక్షకన్యకా
జగతాంమోహనే ధృష్టా విహితా భుక్తిముక్తిషు 8
యోషిదా కర్షణేచైవ వినియోగః ప్రకీర్తితః
శిరో మే కాళికాపాతు క్రీం కారైకాక్షరీ పరా. 9
క్రీం క్రీం క్రీం మే లలాటం చ కాళికా ఖడ్గధారిణీ
హూం హూం పాతు నేత్రయుగం హ్రీం హ్రీం పాతుశ్రుతీమమ 10
దక్షిణేకాళికా పాతు ఘ్రాణయుగ్మం మహేశ్వరీ
క్రీం క్రీం క్రీం రసనాంపాతు హూం హూం పాతు కపోలకమ్ 11
వదనం సకలంపాతు హ్రీం హ్రీం స్వాహా స్వరూపిణీ
ద్వాత్రింశత్యక్షరీ స్కంధౌ మహావిద్యా సుఖప్రదా 12
ఖడ్గముండధరా కాళీసర్వాంగ మభితోऽవతు
క్రీం హ్రూం హ్రీం త్ర్యక్షరీపాతు చాముండా హృదయంమమ 13
ఐం హూం ఓం ఐం స్తనద్వంద్వం హ్రీంఫట్ స్వాహాకకుత్స్థలమ్
అష్టాక్షరీ మహావిద్యా భుజౌపాతు సమాతృకా 14

క్రీం క్రీం ప్రూం ప్రూం ప్రీం ప్రీం కారీ పాతుషడక్షరీ మమ
క్రీం నాభిం మధ్యదేశం చ దక్షిణే కాళికాఽవతు. 15

క్రీం స్వాహా పాతు పృష్ఠం చ కాళికా సా దశాక్షరీ
క్రీం మే గుహ్యం సదాపాతు కాళికాజఘనం మమ 16

సప్తాక్షరీ మహావిద్యా సర్వతంత్రేషు గోపితా
హ్రీం హ్రీం దక్షిణేకాళికే హూం హూం పాతు కటిద్వయమ్ 17

కాళీ దశాక్షరీ విద్యా స్వాహా మా మూరు యుగ్మకమ్
ఓం క్రీం క్రీం మే స్వాహా పాతు కాళికా జానునీ సదా 18

కాళీ హృన్నామ విద్యేయం చతుర్వర్గ ఫలప్రదా
క్రీం హ్రీం హ్రీం పాతు సాగుల్ఫౌ దక్షిణే కాళికాఽవతు 19

క్రీం హ్రూం హ్రీం స్వాహా పదం పాతు చతుర్దశాక్షరీ మమ
ఖడ్గముండధరా కాళీ వరదాభయ ధారిణీ 20

విద్యాభిస్సా కలాభిస్సా సర్వాంగ మభితోఽవతు
కాళీ కపాలినీ కుల్లా కురుకుల్లా విరోధినీ. 21

విప్ర చిత్తా తథోగ్రోగ్రప్రభాదీప్తా ఘనత్విషా
నీలాఘూనా బలాకా చ మాత్రా ముద్రామితా చ మామ్ 22

ఏతా స్సర్వాఖడ్గధరా ముండమాలా విభూషణాః
రక్షంతు దిగ్విదిక్షు మాం బ్రాహ్మీ నారాయణీతథా 23

మాహేశ్వరీ చ చాముండా కౌమారీ చా పరాజితా
వారాహీ నారసింహీ చ సర్వాశ్చా మితభూషణాః 24

రక్షంతు స్వాయుధైర్దిక్షు విదిక్ష్వపిచ మాం సదా
ఇతితే కథితం దివ్యం కవచం పరమాద్భుతమ్ 25

శ్రీజగన్మంగళం నామ మహావిద్యౌఘ విగ్రహమ్
త్రైలోక్యాకర్షణం బ్రహ్మన్ కవచం మన్ముఖోదితమ్ 26

గురుపూజాం విధాయాదౌ విధివచ్చ పఠేత్తతః
కవచం త్రి స్సకృద్వా పి యావజ్జీవంచ వాపునః 27

ఏతచ్ఛృతార్ధమావృత్య త్రైలోక్య విజయీభవేత్
త్రైలోక్యం క్షోభయత్యేవ కవచస్య ప్రసాదతః 28

మహాకవి ర్భవేన్మాసా త్సర్వసిద్ధీశ్వరో భవేత్
పుష్పాంజలిం కాళికాయై మూలేనైవార్పయే త్సకృత్ 29

శతవర్ష సహస్రాణాం పూజాయాః ఫలమాప్నుయాత్
భూర్జేవిలిఖితం చైతత్ స్వర్ణస్థం ధారయే ధ్యది 30

విశాఖాయాం దక్షబాహౌ కంఠేవా ధారయేద్యది
త్రైలోక్యంమోహయేత్క్రోధాత్ త్రైలోక్యం చూర్ణయేతక్షణాత్ 31

పుత్రవాన్ ధనవాన్ శ్రీమాన్ నానావిద్యా నిధిర్భవేత్
బ్రహ్మాస్త్రాదీని శస్త్రాణి తద్గాత్ర స్పర్శనాత్తతః 32

నాశమాయాంతియానారీ వంధ్యావా మృతపుత్రిణీ
బహ్వాపత్యా జీవధవా భవతేవ్య నసంశయః 33

నదేయం పరశిష్యేభ్యో హ్యభక్తేభ్యో విశేషతః
శిష్యేభ్యో భక్తియుక్తేభ్యో హ్యన్యతామృత్యుమాప్నుయాత్ 34

స్పర్థాం విహాయ కమలా వాగ్దేవీ మందిరే శుభే
పౌత్రాన్తం స్థైర్యమాస్థాయ నివసత్యేవ నిశ్చితామ్ 35

ఇదం కవచ మజ్ఞాత్వా యో భజేత్కాళిదేవతామ్
శతలక్షణం ప్రజప్త్వాపి తస్యవిద్యా నసిద్ధ్యతి. 36

ఇతి శ్రీ మత్కాళీ కవచం సమాప్తం

# శ్రీ మహాకాళీ కవచం



ఓం శిరోమే కాళికా పాతుక్రీంకారైకాక్షరీ పరా
క్రీం క్రీం క్రీం మే లలాటం చ కాళికా ఖడ్గ ధారిణీ ॥ 1

హూం హూం పాతు నేత్రయుగ్మం హ్రీం హ్రీం పాతు శ్రుతీ మమ
దక్షిణే కాళికా పాతు ఘ్రాణ యుగ్మం మహేశ్వరీ ॥ 2

క్రీం క్రీం క్రీం రసనాం పాతు, హూం హూం పాతు కపోలమ్
వదనం సకలం పాతు హ్రీం హ్రీం స్వాహా స్వరూపిణీ ॥ 3

ద్వాత్రింశత్యక్షరీ స్కంధౌ మహావిద్యా సుఖప్రదా
ఖడ్గ ముండ ధరా కాళీ సర్వాంగమభితోఽవతు ॥ 4

క్రీం హ్రూం హ్రీం త్ర్యక్షరీ పాతు చాముండా హృదయం మమ
ఐం, హూం ఓం ఐం స్తనద్వంద్వం హ్రీంఫట్ స్వాహా కకుత్ స్థలమ్॥ 5

అష్టాక్షరీ మహావిద్యా భుజౌపాతు సమాతృకా
క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీంకారి పాతు షడక్షరీ మమ ॥ 6

క్రీం నాభి మధ్యదేశం దక్షిణే కాళికాఽవతు
క్రీం స్వాహా పాతు పృష్ఠం కాళికా సా దశాక్షరీ ॥ 7
క్రీం మే గుహ్యం సదా పాతు కాళికాయై నమస్తతః
సప్తాక్షరీ మహావిద్యా సర్వ తంత్రేషు గోపితా ॥ 8
హ్రీం హ్రీం దక్షిణే కాళీ హూం హూం పాతు కటిద్వయం
కాళీ దశాక్షరీ విద్యా స్వాహా పాతు ఊరుయుగ్మకమ్ ॥ 9
ఓం క్రీం క్రీం మే స్వాహా పాతు కాళికా జానునీ సదా
కాళీ హృన్నామ విద్యేయం చతుర్వర్గ ఫలప్రదా ॥ 10
క్రీం క్రీం హ్రీం పాతు గుల్ఫం దక్షిణే కాళికాఽవతు
క్రీం హూం హ్రీం స్వాహాపదం పాతు చతుర్దశాక్షరీ మమ ॥ 11
ఖడ్గ ముండ ధరా కాళీ వరదాభయధారిణీ
విద్యాభి స్సకలాభిస్సాపర్వాగమాభితోఽవతు ॥ 12
కాళీ కపాలినీ కుల్లా కురుకుల్లా విరోధినీ
విప్రచిత్తా తథోగ్రోగ్ర ప్రభాదీప్తా ఘన త్విషా ॥ 13
నీలాఘనా బలాకా చ మాత్రా ముద్రా మితప్రభా
ఏతాః సర్వాః ఖడ్గధరాః ముండమాలా విభూషణాః ॥ 14
రక్షంతు దిగ్విదిక్షు మాం బ్రాహ్మీ నారాయణీ తథా
మాహేశ్వరీ చ చాముండా కౌమారీ చాపరాజితా 15
వారాహీ, నారసింహీ చ, సర్వాశ్చా మిత భూషణాః
రక్షంతు స్వాయుధై ర్దిక్షు విదిక్షు మాం యథా తథా ॥ 16

ఇతి శ్రీ మహాకాళీ కవచం



# కాళీ (దక్షిణ కాళి) కవచం



(కాళీ కుల సర్వస్వం)



**భైరవ ఉవాచ :**

కాళికా యా మహావిద్యా కథితా భువి దుర్లభా ।
తథాపి హృదయే శల్యమస్తి దేవి కృపాం కురు । 1

కవచన్తు మహాదేవి కథయస్వానుకమ్పయా ।
యది నో కథ్యతే మాతర్విమ్ముచామి తదా తనుం । 2

**శ్రీదేవ్యువాచ :**

శ్కపి జాయతే వత్స తవ స్నేహాత్ ప్రకాశితం ।
న వక్తవ్యం న ద్రష్టవ్యమతిగుహ్యతరం మహత్ । 3

కాళికా జగతాం మాతా శోకదుఃఖవినాశినీ ।
విశేషతః కలియుగే మహాపాతకహారిణీ । 4

కాళి మే పురతః పాతు పృష్ఠతశ్చ కపాలినీ ।
కుల్లా మే దక్షిణే పాతు కురుకుల్లా తథోత్తరే । 5

విరోధినీ శిరః పాతు విప్రచిత్తా తు చక్షుషీ ।
ఉగ్రా మే నాసికాం పాతు కర్ణౌ చోగ్రప్రభా మతా । 6

వదనం పాతు మే దీప్తా నీలా చ చిబుకం సదా ।
ఘనా గ్రీవాం సదా పాతు బలాకా బాహుయుగ్మకం । 7

మాత్రా పాతు కరద్వన్ద్వం వక్షోముద్రా సదావతు ।
మితా పాతు స్తనద్వన్ద్వం యోనిమణ్డలదేవతా । 8

బ్రాహ్మీ మే జఠరం పాతు నాభిం నారాయణీ తథా ।
ఊరు మాహేశ్వరీ నిత్యం చాముణ్డా పాతు లిఙ్గకం । 9

కౌమారీ చ కటీం పాతు తథైవ జానుయుగ్మకం ।
అపరాజితా చ పాదౌ మే వారాహీ పాతు చ్గాలీన్ । 10

సన్ధిస్థానం నారసింహీ పత్రస్థా దేవతావతు ।
రక్షాహీనన్తు యత్స్థానం వర్జితం కవచేన తు । 11

తత్సర్వం రక్ష మే దేవి కాళికే ఘోరదక్షిణే ।
ఊర్ధ్వమధస్తథా దిక్షు పాతు దేవీ స్వయం వపుః । 12

హింస్రేభ్యః సర్వదా పాతు సాధకఞ్చ జలాధికాత్ ।
దక్షిణాకాళికా దేవీ వ్యాపకత్వే సదావతు । 13

ఇదం కవచమజ్ఞాత్వా యో జపేద్దేవదక్షిణాం ।
న పూజాఫలమాప్నోతి విఘ్నస్తస్య పదే పదే । 14

కవచేనావృతో నిత్యం యత్ర తత్రైవ గచ్ఛతి ।
తత్ర తత్రాభయం తస్య న క్షోభం విద్యతే క్వచిత్ । 15

ఇతి కాళీకుల సర్వస్వే కాళీకవచం అథవా శ్రీ దక్షిణ కాళి కవచం సమాప్తమ్



# త్రైలోక్య మోహన కాళి కవచం



## (రుద్రయామళ తంత్రే)

శ్రీగణేశాయ నమః ।

శ్రీదేవ్యువాచ ।

దేవదేవమహాదేవ సంసారప్రీతికారకః ।

సర్వవిద్యేశ్వరీం విద్యాం కాళికాం కథయాద్భుతామ్ ॥ 1

శ్రీశివ ఉవాచ ।

శృణుదేవి మహావిద్యాం సర్వవిద్యోత్తమోత్తమామ్ ।
సర్వేశ్వరీం మహావిద్యాం సర్వదేవప్రపూజితామ్ ॥ 2

యస్యాః కటాక్షమాత్రేణ త్రైలోక్యవిజయీహరః ।
బభూవకమలానాథో విభుబ్రహ్మా ప్రజాపతి ॥ 3

శచీస్వామీదేవనాథో యమోపిధర్మనాయకః ।
త్రైలోక్యపావనీగ్గ కమలా శ్రీర్హరిప్రియా ॥ 4

దినస్వామిరవిశ్చన్ద్రో నిశాపతిర్గ్రహేశ్వరః ।
జలాధిపతిర్వరుణః కుబేరోపిధనేశ్వరః ॥ 5

అవ్యాహతగతిర్వాయుర్గజాస్యోవిఘ్ననాయకః ।
వాగీశ్వరః సురాచార్యో ఉ_ఉ_ గురుః కవిః ॥ 6

ఏవం హి సర్వదేవాశ్చ సర్వసిద్ధీశ్వరాః ప్రియే ।
తస్యాస్తు కవచం దివ్యం మాతృజారం విభావయ ॥ 7

అస్య శ్రీదక్షిణకాళీకవచమన్త్రస్య భైరవ ఋషిః,
అనుష్టుప్ ఛన్దః, శ్మశానకాళీ దేవతా,
ధర్మార్థకామమోక్షార్థే జపే వినియోగః ।
లలాటం పాతు చక్రీం మే హరేణారాధితం సదా ।
నేత్రేమే రక్షతు క్రీం క్రీం విష్ణునా సేవితా పురా ॥ 8

క్రీం హూం హ్రీం నాసికాం పాతు బ్రహ్మణా సేవితా పురా ।
క్రీం క్రీం క్రీం వదనం పాతు శక్రేణారాధితా సదా ॥ 9

క్రీం స్వాహా శ్రవణం పాతు యమేనైవప్రపూజితా ।
క్రీం హూం హ్రీం స్వాహా రసనా గ్గయాసేవితావతు ॥ 10

దన్తప్క్ సదా పాతు ఓం క్రీం హూం హ్రీం స్వాహా మమ ।
భుక్తిముక్తి ప్రదా కాళీ శ్రియా నిత్యం సుసేవితా ॥ 11

ఓష్టాధరం సదా పాతు క్రీం క్రీం క్రీం హూం హూం
హ్రీం హ్రీం మమ సర్వసిద్ధిప్రదాయికా ॥ 12

కణ్ఠం పాతు మహాకాళీ ఓం క్రీం హ్రీం మే స్వాహా
మమ చన్ద్రేణారాధితా చతుర్వర్గఫలప్రదా ॥ 13

హస్తయుగ్మం సదా పాతు క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం స్వాహా
సౌఖ్యదా మోక్షదా కాళీ వరుణేనైవసేవితా ॥ 14

ఓం క్రీం హూం హ్రీం ఫట్ స్వాహా హృదయం పాతు సర్వదా ।
సర్వసమ్పత్ప్రదా కాళీ కుబేరేణోపసేవితా ॥ 15

ఐం హ్రీం ఓం ఐం హూం ఫట్ స్వాహా హస్తయుగ్మం సదావతు ।
వాయునోపాసితాకాళీ యశోబల సుఖప్రదా ॥ 16

క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం ఫట్ పాతు జఠరం మమ ।
సర్వసిద్ధిప్రదా కాళీ గణనాథేన సేవితా ॥ 17

క్రీం దక్షిణే కాళికే హ్రీం స్వాహా నాభిం మమావతు ।
సిద్ధిబుద్ధికరీ కాళీ గురుణా సేవితా పురా ॥ 18

లిఙ్గం పాతు సదా హూఀ హూఀ దక్షిణే కాళికే హ్రీం ।
శుక్రేణరాధితా కాళీ త్రైలోక్యజయదాయినీ ॥ 19

పాత్వణ్డ కోశం క్రీం క్రీం దక్షిణే కాళికే హ్రీం హ్రీం స్వాహా ।
ధరయా సేవితా విద్యా సర్వరత్న ప్రదాయినీ ॥ 20

పాతుం గుదం క్రీం క్రీం దక్షిణే కాళికే హ్రీం స్వాహా ।
ద్వాదశీచమహావిద్యా రాఘవేణార్చితా సదా ॥ 21

జానునీ పాతు ఓం క్రీం క్రీం దక్షిణే కాళికే స్వాహా ।
ఏకాదశీ మహావిద్యా మేఘనాదేన సేవితా ॥ 22

క్రీం క్రీం దక్షిణే కాళికే హ్రీం హ్రీం స్వాహా జ్ఞవతు
ద్వాదశీచ మహావిద్యా ప్రహ్లాదేనచసేవితా ॥ 23

క్రీం హూఀ హ్రీం దక్షిణే కాళికే క్రీం హూఀ హ్రీం తథ్గాలీః
పాతు మే ద్వాదశీకాళీ క్షేత్రపాలేన సేవితా ॥ 24

క్రీం హూఀ హ్రీం దక్షిణే కాలికే క్రీం హూఀ హ్రీం స్వాహా
చ నఖాన్సర్వాత్సదా పాతు ష్చదశీత్ గ్రహేశ్వరీ ॥ 25

క్రీం క్రీం క్రీం హూఀ హూఀ హ్రీం హ్రీం దక్షిణే కాళికే
క్రీం క్రీం క్రీం మమ పృష్ఠే సదా పాతు షోడశీ పరమేశ్వరీ ॥ 26

క్రీం క్రీం క్రీం పాతు రోమాణి హూఀ హూఀ రక్షతు వర్మణి ।
మాంసం పాతు సదా హ్రీం హ్రీం రక్తం దక్షిణే కాళికే ॥ 27

క్రీం క్రీం క్రీం పాతు మే అస్థిమజ్జాం హూఁ హూఁ సదావతు ।
హ్రీం హ్రీం శుక్రం సదా పాతు రంధ్రం స్వాహా మమావతు ॥ 28

ద్వావింశత్యక్షరీ విద్యా సర్వలోకేషు దుర్లభా ।
మహావిద్యేశ్వరీ విద్యా సర్వతన్త్రేషు గోపితా ॥ 29

సూర్యవంశేన సోమేన రామేణజగ్నినా ।
జయన్తే న సుమన్తే న బలినానారదేన చ ॥ 30

బిభీషణేనబాణేన భృగుణాకశ్యపేన చ ।
కపిలేన వసిష్ఠేన ధౌమ్యేన త్రిపురేణ చ ॥ 31

మార్కణ్డయేన ధ్రువేణైవద్రోణేన సత్యభామయా ।
ఋష్యశఙ్గ్రున కర్ణేన భారద్వాజేన సంయుతా ॥ 32

సర్వేణారాధితా విద్యా జరామృత్యు వినాశినీ ।
పూర్ణవిద్యా మహాకాళీ విద్యారాజ్ఞీ ప్రకీర్తితా ॥ 33

కాళీ కపాలినీ కుల్లా కురుకుల్లా విరోధినీ ।
విప్రచిత్తా తథోగ్రప్రభా దీప్తా ఘనత్విషా ॥ 34

నీలా ఘనా బలాకా చ మాత్రా ముద్రామితాపి చ ।
ఏతాః సర్వా ఖడ్గధరా ముణ్డమాలా విభూషణా ॥ 35

హూఁ హూఁకారేట్టహాసేన సర్వత్ర పాతు మాం సదా ।
బ్రహ్మాణీ పాతు మాం పూర్వే ఆగ్నేయా వైష్ణవీ తథా ॥ 36

సంబంధించినవి. సౌమ్య శక్తులు శ్రీకులమునకు సంబంధించినవి. సౌమ్యశక్తులను సంప్రదాయబద్ధమైన దక్షిణాచార మార్గములో ఆరాధిస్తారు. ఉగ్రశక్తులను సంప్రదాయ విరుద్ధమైన వామాచార పద్ధతిలో ఆరాధిస్తారు. కొన్ని విద్యలు ఘోర, అఘోర రూపములలో సమయమును బట్టి ప్రకటితమైన వేళ వాటిని ఉభయ పద్ధతులలోను ఆరాధిస్తారు.

## ఎవరు గొప్ప?



దశ మహావిద్యలలో ఎవరికీ వారే గొప్పవారు. ఎవరికి వారే పరమ శక్తి వంతులు. ప్రసాద గుణ సంపన్నులు. ఎవరిని ఉపాసించినను ముక్తి ప్రసాదకులే. వీరు ప్రత్యేక దేవతలు కారు. జగన్మాతయగు ఆద్యాశక్తి యొక్క వివిధ రూపములు. కనుక ఎవరిని ఉపాసించినా భుక్తి ముక్తులను ఇవ్వగలరు. కాని వారివారి లక్షణములను బట్టి ఒక్కొక్క ప్రత్యేక వరమును అధికముగా ఇవ్వగలరు. కనుక జాతకమున గల ఒక్కొక్క దోషమునకు ఒక్కొక్క మహావిద్య ఉపాసన ఉత్తమము అని తెలియుచున్నది.

## సాత్త్విక, రాజసిక దేవతలు



రవి కుజులు రాజసిక గ్రహములు. కనుక త్రిపుర భైరవి, బగళాముఖి రాజసిక దేవతలు. వీరు ఉగ్రరూపులు. వీరి ఉపాసన కష్టతరము. ఇక బుధ చంద్రులు మిశ్రమ గ్రహములు. అనగా వారి స్థితిని బట్టి మంచీ చెడూ రెండూ చేయగలరు. కనుక మాతంగి, భువనేశ్వరి అనువారు వీరికి అధిదేవతలు. వీరి ఉపాసన సాత్వికమునకు, రాజసమునకు మధ్యస్తంగా ఉంటుంది. ఇక మిగిలినది శనీశ్వరులు. వీరికి కాళి అధిదేవత. రాహుకేతువులకు ఛిన్నమస్త, ధూమావతులు అధిదేవతలు. వీరి ఉపాసన బహు కష్టతరము. వివిధ ఆటంకములు, భయమును గొలిపే పరీక్షలతో కూడి ఉంటుంది. అంత మాత్రాన వీరిని తామసిక దేవతలు అనుట తప్పు.

## తత్వప్రకారము విభజన

ఈ దశ మహా విద్యల తత్వాన్ని చూస్తే, అవి ఇలా సూచిస్తాయి.

కాళీ, ఛిన్నమస్త – కాల పరిణామము.

తార, మాతంగి – వాక్కు, వ్యక్తావ్యక్తము.

త్రిపుర సుందరి, కమల – ఆనందము, సౌందర్యము.

భువనేశ్వరి, ధూమావతి – అంతరాళము, అతీత పరబ్రహ్మ శక్తి.

భైరవి, బగళాముఖి – శక్తి, గతి, స్థితి.

## దశమహావిద్యలను సామాన్యులు ఆరాధించవచ్చా?



దశ మహావిద్యలను నిరభ్యం తరంగా ఎవరైనా ఆరాధించవచ్చు. అమ్మను కొలవడానికి అందరూ అర్హులే. కానీ వామాచార పద్ధతు లలో దశ మహా విద్యలను ఆరా ధించదలచినవారు ముందుగా ఉపాసకులను, గురువులను దర్శించి విధి విధానాలను తెలుసుకోవడం మాత్రం తప్పనిసరి. ఈ పుస్తకములో అటువంటి వామాచార పద్ధతులు ఎక్కడా పేర్కొనలేదు.

ఈ దశ మహావిద్యల యొక్క స్తోత్రాలు, హృదయం, కవచం, అష్టోత్తరం, సహస్రనామము.. మొదలగు వాటిని పారాయణ చేయుటకు గురూపదేశంతో పనిలేదు. స్త్రీ పురుష, వయో భేదం లేకుండా అందరూ నిర్భయంగా ఏ సమయంలోనైనా పారాయణ చేసి ఆ ఆదిశక్తి అనుగ్రహాన్ని పొందవచ్చును.

## నాల్గవ మహావిద్య శ్రీ భువనేశ్వరీదేవి

దశ మహావిద్యలలో 4వ మహావిద్య శ్రీ భువనేశ్వరీదేవి. దశ మహావిద్యాధి దేవతలలో ముఖ్యంగా చెప్పుకోతగిన మాతగా భువనేశ్వరీ దేవిని అభివర్ణిస్తారు. భువనేశ్వరి అంటే సమస్త భువనములకు అధిదేవత అని అర్థం. ఈమెనే మహావిద్య అని కూడా పిలుస్తారు. ఈ దేవి సంపూర్ణ



సౌమ్యస్వరూపిణి. ఈ దేవిని ఉపాసించే సాధకుడికి మూడవ నేత్రం తెరుచుకుంటుంది. అంటే భూత భవిష్యత్ వర్తమానాలు తెలుసుకునే శక్తి లభిస్తుంది అంటారు.

ఈ దశమహావిద్యా మాతలకు సంబంధించిన జననం, అవతార రహస్యం, పూజా విధానాలు, అనుగ్రహం చూపే విధానాలు, ఉపాసనా మార్గాలు మొదలైన ఈ పుస్తకంలో పేర్కొన్న అనేక విషయాలు; ఆయా దేవతలకు సంబంధించిన స్తోత్రాలు, ప్రార్థనలు, ధ్యానాలు, కవచాలు, హృదయాలు, అష్టోత్తరాలు... మొదలైన అన్ని విషయాలకు సంబంధించిన విషయ సేకరణకు మాకు అనేక గ్రంథాలు, మాస, పక్ష, వార, దిన పత్రికలు, అంతర్జాలము ఎంతగానో సహకరించినది. ఈ విధముగా లభ్యమైన సమాచారమునకు తగిన పటములను జోడించి మీకు సంకలనముగా అందించాము. ఆయా మూల రచయితలకు, వ్యాసకర్తలకు పేరుపేరునా ధన్యవాదాలు తెలుపు కొంటున్నాము. తప్పులు దొర్లకుండా ఉండుటకు అనేక జాగ్రత్తలు తీసుకొన్నాము. అయినా అక్కడక్కడా కొన్ని అక్షర దోషాలు, భావ దోషాలు దొర్లి ఉండవచ్చును. సహృదయులైన పాఠకులు అలాంటి దోషాలను మా దృష్టికి తెచ్చినచో మా తరువాతి ముద్రణలో వీటిని తప్పక సరి చేసుకొనగలము.

మా పాఠకులు అందరికీ దశమహా విద్యలకు ఆదిదేవత అయిన మాత అనుగ్రహం కలగాలని, తద్వారా వారు తమ జీవితంలో అమృత స్థానాన్ని పొందాలని ఆశిస్తూ...

- నిత్య పబ్లికేషన్స్



# విషయసూచిక



# శ్రీ భువనేశ్వరీ దేవి



దశ మహావిద్యలలో **4వ మహావిద్య శ్రీ భువనేశ్వరీదేవి.** ఉదయించే సూర్యుడిలాంటి కాంతితో ప్రకాశించే ఈ దేవికి భాద్రపద శుక్లపక్ష అష్టమీ తిథి ప్రీతిపాత్రమైనది. ఈ దేవి సంపూర్ణ సౌమ్యస్వరూపిణి. ఈ దేవిని

ఉపాసించే సాధకుడికి మూడవ నేత్రం తెరుచుకుంటుంది. అంటే భూత భవిష్యత్ వర్తమానాలు తెలుసుకునే శక్తి లభిస్తుంది అంటారు. అంతేకాదు, రాజ్యధికారాన్ని సమస్త సిద్ధుల్ని సకల సుఖభోగాల్ని ఈదేవి అనుగ్రహంతో సాధకులు పొందవచ్చు. దశమహావిద్యాధి దేవతలలో ముఖ్యంగా చెప్పుకోదగినది భువనేశ్వరీదేవినే అంటారు. ఈమెనే మహావిద్య అని కూడా పిలుస్తారు.

## సమస్త భువనాలకు అధిదేవత

భువనేశ్వరి అంటే సమస్త భువనములకు అధిదేవత అని అర్థం. త్రిభువనములు అంటే భూః అంటే భూమి, భువః అంటే ఆకాశం, సువః స్వర్గము ఈ మూడింటిని ఏలే తల్లి అని అర్థం. ఈమెకే శ్రీ రాజరాజేశ్వరీ దేవి అనే పేరు కూడా ఉంది.



## అమ్మవారి జననం

ప్రాణతోషిణి గ్రంథంలో అమ్మవారి పుట్టుకకు సంబంధించి ఒక కథ చెప్పబడివుంది. ప్రళయంలో మునిగిన ఈ సృష్టిని తిరిగి మళ్ళీ పుట్టించడానికి బ్రహ్మ తిరిగి సృష్టి చేయనారంభించాడు. సృష్టిలో తాను కోరుకున్న ప్రతీ వస్తువునీ, ప్రతీ ప్రాణినీ బ్రహ్మ సృజించాడు. కానీ ప్రాణులలో క్రియా శక్తిని మాత్రం నింపలేకపోయాడు. అందుకోసం బ్రహ్మ ఆ జగన్మాత కోసం ఘోరతపస్సు చేసాడు. బ్రహ్మ తపస్సుకు మెచ్చిన జగన్మాత ఒక చేత పాశంతో, మరో చేత అంకుశంతో,

వరదాభయ ముద్రలతో, అరుణవర్ణంలో, కమలాసనయై బ్రహ్మ ఎదుట ప్రత్యక్షమైంది. అపై బ్రహ్మచే స్తుతింపబడిన జగన్మాత ఆయన కోరిక మేరకు ఈ సృష్టిలోని అణువణువులో క్రియా శక్తిగా ప్రవేశించింది.

## అమ్మవారికి ఇష్టమైన నైవేద్యం

శ్రీభువనేశ్వరి దేవికి నేతి అన్నాన్ని నైవేద్యంగా పెట్టి ఆ ప్రసాదాన్ని సుమంగళులకు వడ్డిస్తే ఆ ఇంట్లో సుఖం, శాంతి, ప్రశాంతత, సంతోషం, అష్టైశ్వర్యాలు చేకూరుతాయి అని నమ్మకము. అంతేకాక ఈ దేవికి పాయసం అంటే కూడా ఎంతో ప్రీతి. పాయసాన్న ప్రీతమానస అయిన ఈ దేవికి పాయసాన్ని నివేదిస్తే ఎంతో సంతోషిస్తుంది.

## పదునాలుగు భువనాలకు అధీశ్వరి

భువనేశ్వరి అంటే ఈ చతుర్ధశ భువనాలకీ అధీశ్వరి. పధ్నాలుగు భువనాల్లోని చరాచర జీవరాసులన్నీ ఈ దేవి ఆధీనంలోనే ఉంటాయి. ఈ మహా విద్య పరమశాంతి రూపిణీ. మూల ప్రకృతి రెండో నామాన్ని భువనేశీ అంటారు. భువనేశీ అనగా భువనేశ్వరీ. ఈ సృష్టిలోని అన్ని రూపాలూ మూల ప్రకృతి శ్రీ భువనేశ్వరీ దేవివే.

## విశ్వం సృష్టి, క్రియ, లయలకు కారకురాలు

బ్రహ్మదేవుడు విశ్వసృష్టికై తపస్సు చేయగా పార్వతీదేవి బ్రహ్మ తపస్సుకు మెచ్చి విశ్వసృష్టికై భూదేవిగా అవతరించింది. విశ్వం యొక్క సృష్టి, క్రియ మరియు లయ కారకురాలు భువనేశ్వరి దేవి. ఈమె శరీరము ఎరుపు వర్ణంలో ఉంటుంది. ఈమెకు మూడు నేత్రాలు మరియు నాలుగు

హస్తాలు ఉన్నాయి. ఈమె చేతులలో పాశము, అంకుశము మిగిలిన చేతులతో భయం తొలగిస్తూ స్వేచ్ఛను ప్రసాదిస్తూ అభయ ముద్రతో ఉంటుంది.

## శాకాంబరిగా అవతరణ



పూర్వం దుర్గమాసురుడు క్రూరుడై, అభేద్య వరాలు పొంది సమస్త సృష్టిలోని ప్రాణులను, దేవతలను బాధించసాగాడు. వాడి ప్రకోపం వలన భూమిపై జలధారలు ఎండిపోయి కరువు ఏర్పడింది. ఎంతో మంది తమ ప్రాణాలు విడిచారు. అప్పుడు ఋషులు, దేవతలు హిమాలయాలకు బయలుదేరి అమ్మవారికై ప్రార్థించారు. కారుణ్యమూర్తి అయిన మాత వెంటనే వారి ఎదుట ప్రత్యక్షమైంది. వారి కష్టాలను విన్న మాత తన సహస్ర అశ్రుధారలతో భూమిపై నదులను ప్రవహింపచేసి దుర్గమాసురుడి వలన ఏర్పడిన క్షామాన్ని తరిమికొట్టింది. వెంటనే భూమిపైన జీవకళ ఉట్టిపడింది. అమ్మ స్వయంగా తన చేతులతో శాకములను, కందాది మూలాలను సృష్టించింది. అందువల్లనే అమ్మవారికి 'శాకంబరి' మరియు శతాక్షి అనే పేర్లు కూడా కలవు. అప్పుడు భువనేశ్వరి దేవి బాణములు, పాశము, అంకుశము మొదలైన ఆయుధాలు ధరించి దుర్గమాసురుడిని సంహరించింది.

## శాంతిని కోరుకునేవారికి భువనేశ్వరి

నిత్య జీవితములో పరిపూర్ణమైన శాంతిని కోరుకునే వారు శ్రీ భువనేశ్వరీ దేవిని ఉపాసించాలి. శ్రీ భువనేశ్వరీ దేవికి రాత్రి సిద్ధరాత్రి కాగా, త్రయంబకుడు శివుడుగా, పరమేశ్వరుడు భైరవుడుగా, త్రైలోక్య మోహిని యక్షిణిగా ఉంటారు.

## కాళికి, భువనేశ్వరికీ భేదము లేదు



బృహన్నీలతంత్రంలో అమ్మవారికి ఉన్న మూడు నేత్రాలు సృష్టి, స్థితి, లయలకు ప్రతీకలని వివరించబడింది. సృష్టిలో అవ్యక్తరూపంలో భువనేశ్వరి దేవి ఉంటే, వ్యక్తంగా కాళీ మాత ఉంటుంది. అందుకే ఇద్దరికీ భేదమే లేదు.

## అదితి రూపంలో భువనేశ్వరి

భువనం అంటే లోకం. ఈ లోకానికి సృష్టికర్త భువనేశ్వరి. ఈ సృష్టి మొత్తం భువనేశ్వరీ అవతారమే. ఈమెనే అదితి అని కూడా అంటారు. అ+దితి అంటే ఖండం కానిదని అర్థం. ఈ అదితి దేవతలందరికీ మాతృమూర్తి.

## పరమ శాంతి స్వరూపిణి

సమస్త భువనాలకు అధీశ్వరియైన ఈ దేవత ఉదయించే సూర్యుని వలె ప్రకాశిస్తుంటుంది. కిరీటం మీద చంద్రకళ, మూడు కన్నులు, చిరునవ్వు ఆమెకు అలంకారాలు. ఈమె పరమ శాంతి స్వరూపిణి

"పరమాం శాంతిం కామయ మానో భువనేశ్వరీ ముపాసీత". సర్వజీవులు అంతిమంగా కోరేది శాంతి శృంగార వీరాది సమస్త రసాలు స్థాయి భావమును చేరుకోవాలంటే సుప్రకాశానంద చిన్మయమైన శమ స్థితిని పొందాలి. ఆ శమములో ఆనందముంది. ఆ ఆనందం ప్రేమకు లక్షణం. ఆమె సమస్త విశ్వాన్ని ప్రేమతో చూస్తూ ఉంటుంది.

## భువనేశ్వరీదేవి సృష్టి పరిపాలనకు ప్రతీక

దశమహావిద్యల వరుస క్రమాన్ని గనక మనం పరిశీలిస్తే అంతమే ఆరంభం అని తెలిపే కాళీమాత రూపం సృష్టి బీజానికి ప్రతీక ఐతే, తారా మాత ప్రారంభానికి ప్రతీక. షోడశిమాత నిర్మాణానికి ప్రతీక ఐతే, భువనేశ్వరి దేవి సృష్టి పరిపాలనకు ప్రతీక. ఈ సృష్టి పరిణామక్రమమే ముందుకు సాగుతూ కమలా దేవి వద్ద పూర్ణత్వాన్ని అందుకుంటుంది.

## ఇంద్రియ విజయాన్ని కలిగించే మాత

దయామయమైన ఆమె చూపుల వల్ల భక్తులు కుబేరునితో సమానమైన సంపదలను పొందుతారు. త్రిమూర్తులు ఆమె చేతనే సృష్టించబడినారు. బ్రహ్మకు సృష్టి శక్తిని, విష్ణువునకు స్థితి శక్తిని, మహేశ్వరునకు సంహారశక్తిని ఆమె ప్రసాదించింది. త్రిమూర్తులకు అతీతమైన ఒక మహాశక్తిగా భువనేశ్వరిని భావించవలసి ఉంటుంది. తనను ఉపాసించే వారికి ఆమె ఇంద్రియ విజయాన్ని ప్రసాదిస్తుంది. జీవులలోని కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు అనే ఏనుగును అంకుశంతో లొంగతీసుకొన్నట్లుగా వాటిని లొంగదీసి శాంతిని ప్రసాదిస్తుంది. హ్రీంకార బీజ రూపిణిగా, మహామాయగా, శక్తిగా, ఏకాక్షరిగాని, త్ర్యక్షరిగాని,

స్వీకరించి సంప్రదాయ క్రమంలో సాధన చేస్తే ఆ సాధకునకు భువనేశ్వరీ కరుణ తప్పక కలుగుతుంది.

## అండ పిండ బ్రహ్మాండాలకు అధిదేవత



శివశక్త్యాత్మకమైన 'హ్రీం' మంత్రాక్షరాలన్నింటికి తలమానికమైనది. పరమేశ్వరికి అత్యంత ప్రియమైన బీజమిది. జగత్ అంతయూ ఆమె హిరణ్య గర్భంలో ఇమిడినట్లే, తంత్ర మంత్రం సూక్ష్మాలన్నీ హ్రీం బీజంలోనే ఉన్నాయి. ఇది త్రిపుటలకు అధిష్టానం. అండ పిండ బ్రహ్మాండాలకి ఆశ్రయం.

## హృల్లేఖా మంత్ర ప్రభావం

చతుర్ధశభువనాధీశ్వరి అయిన భువనేశ్వరీ దేవి, దేవీ భాగవతంలో హిమవంతుడికి యోగవిద్యను బోధిస్తూ తనను ఏ విధంగా ధ్యానించాలో ఇలా చెబుతుంది.

**హకారః స్థూలదేహః స్యాద్రకారః సూక్ష్మ దేహకః**
**ఈకారః కారణాత్మా సౌ హ్రీం కారో హం తురీయకమ్**

ఓ హిమవంతా మూడు అక్షరాలతో కూడిన నా దివ్య బీజాన్ని నీవు ధ్యానించాలి. నా స్థూలదేహమైన 'హ' కారాన్ని, నా సూక్ష్మ దేహమైన 'ర' కారాన్ని, నా కారణ దేహమైన 'ఈ' కారాన్ని కలిపి 'హ్రీం' అనే ప్రణవ బీజంతో నన్ను ఉపాసించాలి. నాకు చేసే ప్రతి పూజా ఈ హృల్లేఖా మంత్రంతోనే చేయాలి.

**హృల్లేఖా దర్పణే నిత్యమహం తత్రప్రతిబింబితా**
**తస్మాత్ హృల్లేఖయా దత్తం సర్వమంత్రైః సమర్పితమ్**

హృల్లేఖ అంటే సర్వ మంత్రాలకూ నాయిక వంటిది. మంత్ర మహా రాజ్ఞి అయిన హ్రీం అనే ఆ మంత్ర దర్పణం (అద్దం) లో నేను ప్రతి నిత్యం ప్రతిబింబించి ఉంటాను. అందుకే నాకు సమర్పించే పూజ, జపం, తపం అన్ని హృల్లేఖా మంత్రంతో సమర్పిస్తే అది సకల మంత్రాలతో సమర్పించినట్టవుతుంది.

అందుచేత ఓ హిమవంతా నిత్యం హ్రీం బీజంతో భువనేశ్వరి అయిన నన్ను పూజిస్తూ, ఉపాసిస్తూ ఉండేవారికి లోకంలో దుర్లభమైనది ఏదీ ఉండదు. వారు శరీరం విడిచాక నా దివ్య చింతామణి గృహానికి చేరుకుంటారు అని స్వయంగా చెప్పింది కనుక అత్యంత మహిమోపేతమైన ఈ భువనేశ్వరీ మహావిద్యని నియమపూరితంగా ఉపాసించి కృతార్థులు కావచ్చు.

## సుభద్రాదేవి అవతారంలో భువనేశ్వరి



పూరీలోని జగన్నాథ ఆలయంలో కొలువైన సుభద్రాదేవిని భువనేశ్వరి దేవి అవతారంగా కొలవడం అక్కడి సంప్రదాయం. ఈ లోకాలన్నింటిని కాపాడేది ఆ తల్లే. దశమహావిద్యలలో కాళీ మాత మరియు భువనేశ్వరిదేవి అతి ముఖ్యమహా విద్యలు. నారద పాంచరాత్రంలో అమ్మవారి వైభవం గురించి అత్యంత రమణీయంగా చెప్పబడి ఉంది. షోడశిమాతకి మరియు భువనేశ్వరి దేవికి సారూప్యత ఎక్కువ. మహా నిర్వాణతంత్రం ప్రకారం ఏడు కోట్ల మంది మహామంత్రిణులు ఈమె సేవలో సదా ఉంటారు.

## శ్రీవిద్యకు సారథి



శ్రీ లలితా సహస్రనామంలో కొన్ని కొన్ని నామాలను ఒక సమూహంగా చెప్పటం జరిగింది. దీనికి ఒక ప్రత్యేకమైన విశేషత ఉంది. ఈ ప్రకారంగా వేయి నామాలలో అనేకానేక విశేషాలు పొందుపరచబడ్డాయి. ఉదాహరణకు మొదటి ఐదు నామాలలో పరమేశ్వరి ప్రాదుర్భావాన్ని వివరిస్తే, ఆ తదుపరి ఆ తల్లి స్వరూపాన్ని, మరోచోట జగన్మాత సూక్ష్మ రూపాన్ని వర్ణించారు. అదే పంచదశి మహా మంత్రం. ఇంకోచోట శ్రీ చక్రాన్ని వివరించారు. మరి కొన్ని నామాలలో ఆ పరదేవత యొక్క అర్చనా విధానాలను, ఆచారాలను, చతుష్షష్టిపూజా విశేషాలను, షట్చక్రా లను వివరించారు. అవస్థా పంచకము, చంద్ర విద్య, భానువిద్య, భువనేశ్వరి విద్య, కాత్యాయనీ విద్య, వాగ్వాదినీ విద్య, శివదూతి విద్య, గాయత్రీ మంత్రం, ఆత్మ విద్య... ఈ విధంగా అనేకానేక అంశాలను లలితా సహస్రంలో పొందుపరచబడినవి. ఒక్క లలితా సహస్రాన్ని పూర్తిగా పరిశీలిస్తే శ్రీ విద్య తెలుస్తుంది. అందుకే లలితా సహస్రము శ్రీ విద్యకు సారథి వంటిది.

## హ్రీంకార కోశాసిలతా

1 నుండి 10 అక్షరములు గల మంత్రాలను బీజ మంత్రాలు అంటారు. 11 నుంచి 21 వరకు అక్షరాలు గల వాటిని మంత్రములుగా వ్యవహరిస్తారు. 21 మించి అక్షరములు గల వాటిని మాల మంత్రాలు అంటారు. ఖడ్గములు అంటే స్తుతి వచనాలు అని అర్థం. అందుకే 21 మించిన అక్షరాలు ఉన్నందునే ఖడ్గమాలగా వ్యవహరిస్తాం. లలితా త్రిశతిలో మూడవ హ్రీంకారాన్ని గురించి చెప్పేటప్పుడు పరమేశ్వరి హ్రీంకార కోశాసిలతా అని స్తుతించబడింది. అసి అంటే ఖడ్గము. అసిలతా అంటే ఖడ్గధారి. హ్రీంకారమనే కోశానికి పరమేశ్వరి ఖడ్గధారి. హ్రీంకారమనే కోశంలోనే ఆమె ఖడ్గము (కత్తి). తన భక్తులకు కలిగే రాగ ద్వేషాలను, అరిషడ్వర్గ వైరులను, బాధలను, దుఃఖాలను పరమేశ్వరి తన ఖడ్గంతో ఛేదిస్తుంది, తొలగిస్తుంది. అందుకే ఆ తల్లిని శ్రీ దేవి ఖడ్గమాలతో స్తుతిస్తాము.

## భువనేశ్వరీ శక్తి వర్ణనాతీతం

భువనేశ్వరీ దేవికి ఉన్న శక్తి వర్ణణాతీతం. ఈ సృష్టి దాని స్థితి మరియు లయం కావటం అనే కార్యాలు ఈమె యొక్క శక్తికి నిదర్శనాలు. చిరునవ్వులు చిందించే ముఖంతో ఆమె భక్తులకు వరాలు ఇస్తూ ఉంటుంది. ఈమెను పూజించేవారికి సమస్త భయాలు తొలగిపోతాయి. భువనాన్ని ఏలే శక్తిగల భువనేశ్వరీదేవి కలువ పువ్వులో రాజసంగా లోకాన్ని శాసిస్తూ కూర్చుని ఉంటుంది. ఈమె మహిమలను అడ్డుకునే శక్తి నవగ్రహాలకు గానీ, త్రిమూర్తులకు గానీ లేదు అని చెబుతారు.

## పార్వతే భువనేశ్వరి



భువనేశ్వరి అనగా పార్వతీ దేవి. కాళి, తార, త్రిపుర సుందరీల ప్రకాశమునకు భువనేశ్వరి తెర వంటిది. దశమహావిద్యలు వామ, కౌళ సంప్రదాయములకు చెందినవి. వామ, కౌళములు సిద్ధపురుషులకే గాని సామాన్యులకు కాదు. పరమ దేవతా అనుగ్రహము పరిపూర్ణంగా పొందా లనుకుంటే సాంప్రదాయ పరంపరాగతంగా వస్తున్న ఆ దేవి యంత్ర, మంత్ర, తంత్ర, పూజా కల్పానాసారము విధి విధానం తెలుసుకొని అర్చించి దేవీ కృపకు పాత్రులు కావలసి ఉంటుంది.

## ఏడుకోట్ల మహామంత్రాలచే ఆరాధింపబడే దేవత

ఈ దేవిని ఏడుకోట్ల మహా మంత్రాలు ఆరాధిస్తుంటాయి. ఈ విశ్వాన్ని సృష్టించాలనే అభిలాషతో బ్రహ్మ క్రియా శక్తిని ఆహ్వానిస్తూ తీవ్రమైన తపస్సు చేశారు. ఆ తపస్సుకు మెచ్చిన పరమేశ్వరి భూదేవి రూపంలో ప్రత్యక్షమైంది. విశ్వానికే అధిదేవత కాబట్టే భువనేశ్వరీ అని పిలుస్తారు. అవ్యక్తం నుండి వ్యక్తమైన బ్రహ్మాండ రూపం, చైతన్య స్వరూపమే భువనేశ్వరీ దేవి.



## కుబేరునితో సమానమైన సంపదలు





దయామయమైన భువనేశ్వరీమాత చూపుల వల్ల భక్తులు కుబేరునితో సమానమైన సంపదలను పొందుతారు. భువనానికి అధినాయికగా ఈమెను పేర్కొంటారు. ఈ దేవతను పూజించిన వారికి సమస్త భయాలు తొలగి పోతాయి. సకల భువనాలకు భువనేశ్వరీ దేవి అధి దేవత. సకల సృష్టి అమ్మ రూపంలో ఇమిడి ఉంటుంది.



## భువనేశ్వరీ గాయిత్రి మంత్రం



ఓమ్ నారాయణైచ విద్మహే భువనేశ్వయై ధీమహి తన్నో దేవీ ప్రచోదయాత్!!



## భువనేశ్వరీ మంత్రసాధకులకు తిరుగులేదు



శ్రీ భువనేశ్వరి దేవి గురించి, వివిధ రకాలైన భువనేశ్వరీ మంత్రాలు గురించి, వాటి సాధనా పద్దతుల గురించి, శ్రీ భువనేశ్వరి అష్టోత్తర, సహస్రనామాలు, కవచ హృదయ స్తోత్రాలు సాధన చేస్తే ఆ సాధకుడికి జ్ఞాన నేత్రం అంటే మూడోకన్ను తెరుచుకుంటుంది. అంతేకాదు, రాజ్యాధికారాన్ని, సమస్త సిద్దుల్ని సకల సుఖభోగాల్ని ఈ దేవి అను గ్రహంతో సాధకులు పొందవచ్చు అని అంటారు.

## సంతానాధిదేవత

సంతానం కొరకై భువనేశ్వరి దేవి ఆరాధన అత్యంత ఫలప్రదమైనది. రుద్రయామల అను గ్రంథంలో అమ్మవారి కవచము, నీలసరస్వతి తంత్రంలో అమ్మవారి హృదయము మరియు సహస్రనామాలు సంకలనం చేయబడి ఉన్నాయి.

## త్రిమూర్తులను స్త్రీ రూపాలుగా మర్చిన మాత

దేవీ భాగవతం తృతీయ స్కంధంలో శ్రీ భువనేశ్వరీదేవి రూపం అత్యంత మనోహరంగా వర్ణించబడింది. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు యోగమాయను స్తుతించి ఆదేవి అనుగ్రహంతో ఒక దివ్య విమానాన్ని ఎక్కి పర్య టిస్తూ, క్షీర సముద్రం మధ్యలో ఉన్న ఒక సుందర ద్వీపంలో ఉన్న భువనేశ్వరీ దేవిని దర్శించారు.



వారు దర్శించిన భువనేశ్వరీ దేవి రూపం ఎర్రని వస్త్రాలు, ఎర్రని మాలలు ధరించి, ఎర్ర చందనాన్ని అలముకొని, కళ్ళు పెద్దగా, విశాలంగా ఎర్రగా చేసి ఉన్నది. కోటి విద్యుత్ రేఖల కాంతితో వెలిగిపోతూ, సూర్యబింబం లాగా ప్రకాశిస్తుంది. అత్యంత సుందర వదనంతో, పాశాంకుశాలు

ధరించి, వరద అభయ హస్తాలు చూపుతూ, చిరునవ్వులు చిందిస్తూ ఉంటుంది. సర్వాలంకార భూషణాలు ధరించిన ఆ మూర్తిని పక్షి బృందాలు హ్రీం హ్రీం అని హ్రీంకార జపం చేస్తూ సేవిస్తున్నాయి. ఆమె చుట్టూ ఉన్న సేవికలు అమ్మా ! భువనేశ్వరీ, హృల్లేఖా అంటూ ఆమె దివ్య నామాన్ని జపం చేస్తున్నారు. అనంగ కుసుమా మొదలైన దేవతలందరూ ఆమె చుట్టూ కూర్చొని పూజిస్తుండగా, షట్కోణ యంత్రం మీద కూర్చొని భువనేశ్వరీ దేవి వారికి దర్శనమిస్తుంది.

ఆ దివ్య మంగళ స్వరూపాన్ని దర్శించిన త్రిమూర్తులలో విష్ణుమూర్తి "ఈ దివ్యమూర్తి అందానికి కారణమైన భగవతి. ఈమే మహావిద్య, ఈ తల్లే మహామాయ. ఈ దేవే పూర్ణ ప్రకృతి స్వరూపం. ఎప్పటికీ నాశనం లేని మహాశక్తే ఈ భువనేశ్వరి" అని ఆ తల్లి దివ్య స్వరూపాన్ని వర్ణిస్తాడు.

ఈ విధంగా భువనేశ్వరీ లోకానికి చేరిన త్రిమూర్తులు విమానం దిగి ఆ తల్లి లోకంలో అడుగు పెట్టిన వెంటనే కరుణారస దృష్టితో స్త్రీలుగా మారిపోతారు. ఆ స్త్రీ రూపాలతోనే భువనేశ్వరీదేవి దివ్య పాదాల్ని దర్శించి, ఆ తల్లి కాలిగోటిలోనే బ్రహ్మాండాల్ని, చతుర్దశ భువనాలను చూసి ఆనందంతో ఆశ్చర్యంతో భువనేశ్వరీ మాతను ప్రస్తుతిస్తారు. వారి స్తుతి విన్న భువనేశ్వరీ మాత వారిని కరుణించి, వారికి భార్యలను ప్రసాదించి, సృష్టి, స్థితి, లయ కార్యక్రమాలను నిర్వహించమని ఆదేశించి వారిని అచ్చటనుండి పంపుతుంది.

ఈ విధంగా దేవీభాగవతంలో భువనేశ్వరీదేవి త్రిమూర్తులకన్నా అధికమైన దేవతగా, సాక్షాత్తు వారిచేతనే మహామాయగా, మహా విద్యగా కీర్తించబడి దర్శినమిస్తుంది.

## ఆకాశానికి అధిదేవత



ఆకాశానికి ఆధిదేవత భువనేశ్వరి అని తంత్ర గ్రంథాలు వర్ణిస్తాయి. భువనేశ్వరీ దేవి నాద శరీరం హ్రీంకారం. అందుకే హ్రీంకారాన్ని శక్తి బీజంగా, భువనేశ్వరీ బీజంగా పరిగణిస్తారు. దీనినే తాంత్రిక ప్రణవం (ఓం) అని, హృల్లేఖ అని కూడా అంటారు. ఈ దేవిని మహా మాయగా, ఈమె బీజం హ్రీం కారాన్ని మాయాబీజంగా సంభావిస్తారు.

## ప్రపంచ సృష్టికర్త భువనేశ్వరి

భువనం అంటే ప్రపంచం. ఈ ప్రపంచానికి సృష్టికర్త భువనేశ్వరి. ఈ సృష్టి మొత్తం భువనేశ్వరీ అవతారమే అని చెబుతారు. రాత్రికి అధిష్ఠాతృ దేవతగా భువనేశ్వరీదేవి ఉంటుంది. ఈ సృష్టిలోని అన్ని రూపాలూ మూల ప్రకృతి శ్రీ భువనేశ్వరీ దేవియే.

## వామాదేవిగా శ్రీ భువనేశ్వరీ మాత

ఈ దేవి సమస్త లోకాలను వమనం (వాంతి) చేసుకొన్నది కాబట్టి వామా అని, ఈ దేవికున్న శివమయతత్వం వల్ల జ్యేష్ఠా లేక కర్మ నియంత్రిణి అని జీవులను దండించే సామర్థ్యం ఉండటం వలన రౌద్రి అని వ్యవహరిస్తారు.




# దేహంలో జ్ఞానశక్తే భువనేశ్వరి



పరమాత్మే వాక్, మన:, ప్రాణ మయుడు. ఈ మూడు శక్తులు సూర్యుడిలో ఉంటాయి. సూర్యుడిలోనే షోడశకళ పరిపూర్ణ పురుషుడు వికాసంతో దర్శనమిస్తాడు. ఈ మూడు పురుషులే ఈ మూడు భువనములు. మూడు భువనాలను సృష్టించి రక్షించి సంహరించే పరమాత్మ శక్తినే భువనేశ్వరీ అంటారు. త్రిపురేశ్వరీ, త్రిపుర సుందరీ అన్నట్లుగానే త్రిభువనేశ్వరీ భువనేశ్వరీ అంటారు. ఈ భువనేశ్వరిని త్రికరణ శుద్ధిగా అనగా శరీరం, మనస్సు, వాక్కులతో ఆరాధిస్తే ఆరోగ్యం, ఆనందం, బలం, సమృద్ధిగా కలుగుతాయి. మనకున్న మూడు భువనాలు అన్నమయం, మనోమయం, ప్రాణమయం. అన్నం ఆరోగ్యానికి, మనస్సు ఆనందానికి, ప్రాణం బలానికి ప్రతీకలు. లోతుగా పరిశీలించినా భువనం లేదా పురము అనగా మన శరీరమే. ఈ శరీరాన్ని ఇంద్రియాలను, ఇతర అవయవాలు శాసించేది బుద్ధే. అనగా జ్ఞానశక్తి. ఆ శక్తే భువనేశ్వరీ. బుద్ధికి జ్ఞాన శక్తి, శరీరానికి క్రియా శక్తి, మనస్సుకు ఇచ్ఛాశక్తి ఈ శక్తులకు ఈశ్వరీ త్రిపురేశ్వరీ. భువనేశ్వరిని సేవిస్తే మంచి కోరికలు కలిగి మంచి పనులు తలపెడతారు. అమ్మను సేవిస్తే పరమాత్మ జీవాత్మ కున్న సంబంధం ఇహపర లోకాల జ్ఞానం కలుగుతుంది. ఈవిధంగా మంచి కోరికలు కలిగి మంచి కార్యాలు తలపెట్టాలంటే భువనేశ్వరీ దేవిని ఆరాధించి తరించాలి.

## త్రికరణ శుద్ధిగా పూజించినవారికే అమ్మ దర్శనం



శ్రీ మహాలక్ష్మి శ్రీ మహాసరస్వతి, శ్రీ మహాపార్వతి, త్రిశక్తిస్వరూపిణి, సర్వ శక్తిరూపిణిగా, మహాశక్తి స్వరూపిణిగా భువనేశ్వరీమాత దర్శనమిస్తుంది. అమ్మ యొక్క మంత్రము "హ్రీం" తో అమ్మ వారి ఆరాధన వలన భక్తులకు సౌభాగ్యము కలుగును, విద్య, జ్ఞాన సంపద, ఆయురా రోగ్యములు, ధన, కనక, వస్తు వాహనాది, సమృద్ధి కొరకు, పుత్ర పౌత్రాభివృద్ధి కొరకు, సర్వాపదానివారణార్థం, సకలకార్య విఘ్ననివారణార్థం, సత్సంతాన సిధ్యర్థం, ఇష్టకామ్యార్థ సిధ్యర్థం సకల ఐశ్వర్యముల కొరకు ఈ భువనేశ్వరీ మాతను పూజించాలి. దేవి దర్శనము, అత్యంత దుర్లభమయినదే కానీ ఆ దేవిని త్రికరణ శుద్ధిగా పూజ చేసి అమ్మవారి మూలమంత్రమును సాధన చేసినవారికి అమ్మదర్శన భాగ్యము లభించును అని నమ్మకము.

## భువనేశ్వరీ ఉపాసకులకు సర్వ వైభవాలు

భక్తితో సాధన చేస్తే శరీరంలో అణువణువునా దేవీ వైభవమే కనిపిస్తుంది. రైతన్నలకు పాడిపంటలు, సకల సౌభాగ్యములు ఇచ్చేతల్లి భువనేశ్వరీ దేవి. ఆ భువనేశ్వరీ దేవీ ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తుల సంయుక్త రూపము. అందువలన భువనేశ్వరీ ఉపాసకులు సర్వ వైభవములు పొందగలరు.

## భువనేశ్వరీ దేవి స్తోత్ర సంప్రీత



చరాచర సృష్టికి ఆధార భూతమైన సర్వశక్తి సమన్విత అయిన భువనేశ్వరీ దేవి స్తోత్ర సంప్రీత, ఆశ్రిత కల్పవల్లి, స్మరణ మాత్రముననే తన కరుణను కురిపించే కన్నతల్లి, దశదిశలా వ్యాపించి సర్వశక్తి స్వరూపిణిగా విరాజిల్లే మహామహిమాన్విత మాతయే భువనేశ్వరీదేవి, సకల చరాచర సృష్టికి మూలపుటమ్మ ఓంకార స్వరూపిణి, జగత్ అంతా హ్రీంకారం, విశ్వమంతా శ్రీకారం, సర్వ మహిమలకు మూలధారియై భువనేశ్వరీదేవి విలసిల్లుతుంది.

## శ్రీ భువనేశ్వరి దేవి మంత్ర జప సాధన

ఇష్టదైవం నామాన్ని కానీ, మంత్రాన్ని కానీ, ఒక క్రమపద్ధతిలో భక్తిగా జపించే విధానమే జపం. జపంలో "జ" కారం మరో జన్మ లేకుండా (జన్మవిచ్ఛేదన) చేస్తుంది. "ప" కారం పాపాలను నశింప చేస్తుంది. పలికిన వెంటనే ఫలితం ఇస్తుంది కాబట్టి పూజ కన్నా జపానికి ఎక్కువ ప్రాముఖ్యత ఉంది. లింగ పురాణం ప్రకారం జపం చేయడం వల్ల యక్ష రాక్షస పిశాచాది భయంకర గ్రహాల బాధలు తొలిగిపోయి సుఖశాంతులు కలుగుతాయి. జపం చేయడం వల్ల మానసిక ఉత్తేజం కలుగుతుంది.

## జపాలలోని వివిధ రకాలు

జపం మూడు రకాలుగా చేస్తారు. మొదటిది వాచికం అంటే సమీపంలోని వారికి వినపడేటట్లు జపించడం. రెండోది ఉపాంశువు అంటే పెదవులను కదిలిస్తూ ఎవ్వరికీ వినపడకుండా చేయడం, మూడోది మానసికం అంటే మనసులో జపించడం. మూడో పద్ధతిలో చేసే జపం ఎక్కువ ఫలితాన్ని ఇస్తుందని శాస్త్రాలు చెబుతున్నాయి.

## భువనేశ్వరీ మంత్రం



మంత్ర మహార్ణవం, మంత్ర మహోదధి వంటి గ్రంథాలలో వివిధ దేవతా మంత్రాలని ఏ విధంగా జపం చేయాలి? ఏ మాల ఉపయోగించాలి? ఏ ఆసనం మీద కూర్చోవాలి? ఏ సమయంలో చేయాలి? ఎలాంటి వస్త్రాల్ని ధరించాలి? పురశ్చరణ ఎలా చేయాలి? అనే విషయాలు వివరించబడ్డాయి. ఆ గ్రంథాలలో చెప్పిన విధంగా శ్రీ భువనేశ్వరీ మంత్రాన్ని పురశ్చరణా పూర్వకంగా జపించినచో మంత్రసిద్ధి జరుగుతుంది అంటారు. ఆ మూల మంత్రంతో స్వయంగా చేసే జపం సత్ఫలితాన్నిస్తుంది అని భావన.




## పురశ్చరణ పద్ధతిలో భువనేశ్వరీ ఉపాసన



ఏ మంత్రాన్నైనా శాస్త్రోక్తంగా ఒక నియమిత పద్ధతిలో సాధన చేసే విధానాన్ని పురశ్చరణ అంటారు. పురశ్చరణలో పంచాంగాలు.. జపము, హోమము, తర్పణము, మార్జనం, బ్రహ్మణ భోజనం. ఈ 5 విధాలైన కర్మతో శ్రీ భువనేశ్వరీ దేవిని ఉపాసించినచో అమ్మ కరుణ లభించ గలదని అంటారు. పురశ్చరణ లేని మంత్రం కూడా నిరర్ధకమైంది కాబట్టి శ్రీ భువనేశ్వరీ దేవి మంత్రాన్ని పురశ్చరణ పూర్వకంగా ఉపాసిస్తేనే ఆ దేవత అనుగ్రహం మనకు లభిస్తుంది అని అంటారు.




## ఎన్నిసార్లు పురశ్చరణ చేయాలి?

సాధారణంగా ఏ మంత్రానికైనా ఒక లక్ష సార్లు (108 సంఖ్య గల మాలతో 1000 మాలలు) మూల మంత్రాన్ని జపం చేయాలి.

అందులో పదో వంతు అనగా 10,000 సార్లు ఆ మూల మంత్రంతో హోమం చేయాలి.

హోమ సంఖ్యలో పదో వంతు అనగా 1000 సార్లు ఆ మూల మంత్రంతో తర్పణ చేయాలి.

తర్పణ సంఖ్యలో పదో వంతు అనగా 100 సార్లు మూల మంత్రంతో మార్జన లేదా అభిషేకం చేయాలి.

అందులో పదో వంతు అనగా.. పది మంది బ్రహ్మణులకు భోజనం పెట్టాలి.

పై ఐదు కార్యాలతో మంత్ర పురశ్చరణ పూర్తవుతుంది.

## శుద్ధ అష్టమి నుంచి పూర్ణిమ వరకు

శ్రీ భువనేశ్వరీ మంత్రాన్ని పురశ్చరణా పూర్వకంగా అనుష్టానం చేయాలనుకునే సాధకులు శుద్ధ అష్టమి నుంచి పూర్ణిమ వరకు జపం చేస్తే సత్వర ఫలితం లభిస్తుంది. సాధారణంగా సాత్విక దేవతలందరికీ ఈ తిథులు అత్యంత ప్రీతికరమైనవి అని అంటారు.

## జపానికి అనుకూల ప్రదేశాలు



జపం ఎక్కడ చేయాలి? ఏ ప్రదేశాలు శుభం అనే విషయానికి వస్తే.. పుణ్యక్షేత్రం, తీర్థప్రదేశం, దేవాలయాలు, నదీ తీరం, గుహ, పర్వతాగ్రం, తీర్థ ప్రదేశాలు, సాగర సంగమ స్థలాలు, పవిత్ర వనాలు, ఉద్యానవనాలు, సముద్ర తీరాలు, స్వగృహాలు.. ఈ ప్రదేశాలను ముఖ్యంగా చెప్పుకోవచ్చు. అంటే ప్రదేశాలలో ఎక్కడైనా జపం చేయవచ్చు. అయితే దశ మహావిద్యలు కొలువున్న అత్యంత శక్తివంతమైన స్థలాలు కూడా గురువుల సలహా మేర ఎంచుకొన్నచో ఉత్తమ ఫలితాలు లభించగలవని భావన.

## భువనేశ్వరీ మంత్ర జపానికి ఆసనం ముఖ్యం

నిత్యం ఒక శుభ స్థానంలో కూర్చుని జపం చేయాలి. అయితే, శ్రీ భువనేశ్వరీ మంత్రం జపం చేయడానికి ఆసనం ముఖ్యం. శ్రీ భువనేశ్వరీ దేవికి ప్రీతికరమైన రంగు ఎరుపు కనుక ఎరుపు రంగులో ఉండే ఆసనాన్ని ఉపయోగించాలి. దర్భాసనం మీద ఎర్రని రంగు గల చిత్రాసనాన్ని వేసుకుని కూడా జపం చేయవచ్చు.

## వ్యాపారాదులలో అభివృద్ధికై భువనేశ్వరీ ధ్యానం

**జ్యోతిర్మాలాం త్రిణేత్రాం వివిధ మణిలసత్ కుండలాం పద్మసంస్థామ్**
**ఆద్యాం పాశాంకుశాభాం అభయవరకరాం భావయేత్ భువనేశీమ్**



ప్రతినిత్యం శ్రీ భువనేశ్వరీ అమ్మవారిని దర్శిస్తూ ధ్యాన శ్లోకాన్ని పఠించిన వ్యాపార సంబంధమైన దోషములు తొలగునని శాస్త్రవచనము. ప్రతి గృహము యందు లేదా వ్యాపారస్థలముల యందు ఈ మూర్తిని తూర్పు దిశలో పడమర ముఖముగా ఉంచి ఆరాధించిన త్వరితముగా వ్యాపారాదులలో అభివృద్ధి, ప్రజల మన్నన, సేవకుల అనుకూల సహకారములు కలుగునని నమ్మకము.

## భువనేశ్వరీ ఆలయాలు

శ్రీలంకలోని నైనాతివులో, తమిళనాడులోని పుదుక్కొట్టైలో, ఒడిషా లోని కటక్‌లో, గుజరాత్‌లోని గోందల్‌లో మరియు హిమాచల్ ప్రదేశ్‌లోని కులు జిల్లాలో భువనేశ్వరీ అమ్మవారి ఆలయాలు ఉన్నవి.

# శ్రీ భువనేశ్వరీ స్తోత్రం



అథానందమయీం సాక్షాచ్ఛబ్దబ్రహ్మస్వరూపిణీం
ఈడే సకలసంపత్త్యై జగత్కారణమంబికాం ॥ ॥ 1 ॥

విద్యామశేషజననీమరవిందయోనే-
ర్విష్ణోశ్శివస్యచవపుః ప్రతిపాదయిత్రీం
సృష్టిస్థితిక్షయకరీం జగతాం త్రయాణాం
స్తోష్యేగిరావిమలయాప్యహమంబికే త్వాం ॥ ॥ 2 ॥

పృథ్వ్యా జలేన శిఖినా మరుతాంబరేణ
హోత్రేందునా దినకరేణ చ మూర్తిభాజః
దేవస్య మన్మథరిపోః పరశక్తిమత్తా
హేతుస్త్వమేవ ఖలు పర్వతరాజపుత్రి ॥ ॥ 3 ॥

త్రిస్రోతసస్సకలదేవసమర్చితాయా
వైశిష్ట్యకారణమవైమి తదేవ మాతః
త్వత్పాదపంకజ పరాగ పవిత్రితాసు
శంభోర్జటాసు సతతం పరివర్తనం యత్ ॥ ॥ 4 ॥

ఆనందయేత్కుముదినీమధిపః కళానా-
న్నాన్యామినఃకమలినీ మథనేతరాంవా
ఏకస్యమోదనవిధౌ పరమేకమీష్టే
త్వం తు ప్రపంచమభినందయసి స్వదృష్ట్యా ॥ ॥ 5 ॥

అద్యాప్యశేషజగతాం నవయౌవనాసి
శైలాధిరాజతనయాప్యతి కోమలాసి
త్రయ్యాః ప్రసూరపి తయానసమీక్షితాసి
ధ్యేయాసి గౌరి మనసోనపథి స్థితాసి ॥ ॥ 6 ॥

ఆసాద్య జన్మ మనుజేషు చిరాద్దురాపం
తత్రాపిపాటవమవాస్య నిజేంద్రియాణాం
నాభ్యర్చయంతి జగతాం జనయిత్రి యేత్వాం
నిశ్రేణికాగ్రమధిరుహ్య పునః పతంతి ॥ ॥ 7 ॥

కర్పూరచూర్ణహిమవారివిలోడితేన
యే చందనేన కుసుమైశ్చ సుజాతగంధైః
ఆరాధయంతిహి భవాని సముత్సుకాస్త్వాం
తేఖల్వఖండభువనాధిభువః ప్రథంతే ॥ ॥ 8 ॥

ఆవిశ్యమధ్యపదవీం ప్రథమేసరోజే
సుప్తాహిరాజసదృశీం విరచయ్యవిశ్వం
విద్యుల్లతావలయవిభ్రమముద్వహంతీ
పద్మానిపంచ విదలయ్య సమశ్ను వానా ॥ ॥ 9 ॥

తన్నిర్గతామృతరసైరభిషిచ్యగాత్రం
మార్గేణ తే నవిలయం పునరప్యవాప్తా
యేషాంహృది స్ఫురసిజాతు నతేభవేయు-
ర్మాతర్మహేశ్వర కుటుంబిని గర్భభాజః ॥ ॥ 10 ॥

ఆలంబికుండలభరామభిరామవక్త్రాం
ఆపీవరస్తనతటీం తను వృత్తమధ్యాం
చింతాక్షసూత్రకలశాలిఖితాఢ్యహాసాం
ఆవర్తయామిమనసా తవ గౌరిమూర్తిమ్ ॥ ॥ 11 ॥

ఆస్థాయయోగమవిజిత్య చ వైరిషట్కం
ఆబధ్యచేంద్రియగణం మనసి ప్రసన్నే
పాశాంకుశాభయవరాఢ్యకరాం సువక్త్రాం
ఆలోకయంతి భువనేశ్వరి యోగినస్త్వామ్ ॥ ॥ 12 ॥

ఉత్తప్తహాటకనిభాం కరిభిశ్చతుర్భిః
ఆవృత్తితామృత ఘటైరభిషిచ్యమానా
హస్తద్వయేన నళినే రుచిరే వహంతీ
పద్మాపిసాభయకరా భవసి త్వమేవ ॥ ॥ 13 ॥

అష్టాభిరుగ్రవివిధాయుధవాహినీభిర్-
దోర్వల్లరీభిరధిరుహ్య మృగాధివాసం
దూర్వాదళద్యుతి రమాత్య విపక్షపక్షాన్
న్యక్కుర్వతీ త్వమసి దేవి భవాని దుర్గే ॥ ॥ 14 ॥

ఆవిర్నిదాఘ జలశీకరశోభివక్త్రాం
గుంజాఫలేన పరికల్పితహారయష్టిం
రత్నాంశుకామసితకాంతిమలంకృతాం త్వాం
ఆద్యాం పుళిందతరుణీమసకృన్నమామి ॥ ॥ 15 ॥

హంసైర్గతిః క్వణితనూపుర దూరదృష్టే
మూర్తేరివాప్తవచనైరనుగమ్యమానౌ
పద్మావివోర్ధ్వముఖరూఢ సుజాత నాళౌ
శ్రీకంఠపత్ని శిరసైవ దధే తవాంఘ్రీ ॥ ॥ 16 ॥

ద్వాభ్యాం సమీక్షితుమతృప్తిమతేవదృగ్భ్యాం
ఉత్పాద్యతాత్రినయనం వృషకేతనేన
సాంద్రానురాగభవనేన నిరీక్ష్యమాణే
జంఘే ఉభే అపి భవాని తవానతోస్మి ॥ ॥ 17 ॥

ఊరూ స్మరామి జితహస్తి కరావలేపౌ
స్థౌల్యేనమార్దవతయా పరిభూతరంభౌ
శ్రేణీభరస్య సహనౌ పరికల్ప్యదత్తా
స్తంభావివాంగవయసా తవ మధ్యమేన ॥ ॥ 18 ॥

శ్రోణ్యాస్తనౌచ యుగపత్ప్రథయిష్యతోచ్చైః
బాల్యాత్పరేణవయసాపరి కృష్ణసారః
రోమావళీవిలసితేన విభావ్యమూర్తిం
మధ్యం తవ స్ఫురతు మే హృదయస్య మధ్యే ॥ ॥ 19 ॥

సఖ్యాస్స్మరస్య హరనేత్ర హుతాశభీరోః
లావణ్యవారిభరితం నవయౌవనేన
ఆపాద్య దత్తమివ పల్లవమప్రవిష్టం
నాభింకదాపి తవదేవి న విస్మరేయమ్ ॥ ॥ 20 ॥

ఈశోపి గేహపిశునం భసితం దధానే
కాశ్మీరకర్దమ మను స్తన పంకజేన
స్నానోత్థితస్య కరిణః క్షణలక్షఫేనౌ
సిందూరితా స్మరయతః స మదస్య కుంభౌ ॥ ॥ 21 ॥

కంఠాతిరిక్త గళదుజ్జ్వల కాంతిధారా
శోభౌ భుజౌ నిజరిపోర్మకరధ్వజేన
కంఠగ్రహాయ రచితౌ కిల దీర్ఘపాశౌ
మాతర్మమ స్మృతిపథం నవిలజ్జయేతామ్ ॥ ॥ 22 ॥

నాత్యాయతం రుచిరకంబువిలాస చౌర్యం
భూషాభరేణ వివిధేన విరాజమానం
కంఠం మనోహరగుణం గిరిరాజకన్యే
సంచిన్త్యతృప్తి ముపయామి కదాపి నాహమ్ ॥ ॥ 23 ॥

అత్యాయతాక్షమభిజాతలలాటపట్టం
మందస్మితేన దర పుల్లకపోలరేఖం
బింబాధరం ఖలు సమున్నతదీర్ఘనాసం
యత్తేస్మరత్య సకృతంబ స ఏవజాతః ॥ ॥ 24 ॥

ఆవిస్త్వయార కరలేఖమనల్ప గంధ
పుష్పోపరిభ్రమదలి వ్రజనిర్విశేషం
యశ్చేతసా కలయతే తవ కేశపాశం
తస్య త్వయం గలతి దేవి పురాణపాశః ॥ ॥ 25 ॥

శ్రుతి సురచితపాకం ధీమతాం స్తోత్రమేతత్
పఠతియ ఇహమర్త్యో నిత్యమార్ద్రాంతరాత్మా
స భవతి పదముచ్చైస్సంపదాం పాదనమ్ర
క్షితిపముకుటలక్ష్మీర్లక్షణానాంచిరాయ ॥ ॥ 26 ॥

॥ ఇతి శ్రీభువనేశ్వరీ స్తోత్రం ॥

# విష్ణుకృత శ్రీ భువనేశ్వరి స్తుతి



నమోదేవ్యై ప్రకృత్యై చ విధాత్రై సతతం నమః ।
కళ్యాణై కామదాయై చ వృద్ధ్యై సిద్ధ్యై నమో నమః ॥ 1

సచ్చిదానంద రూపిణ్యై సంసారారణయే నమః ।
పంచ కృత్య విధాత్ర్యైతే భువనేశ్యై నమో నమః ॥ 2

సర్వాధిష్ఠాన రూపాయై కూటస్థాయై నమో నమః ।
అర్థ మాత్రార్థ భూతాయై నమో నమః ॥ 3

జ్ఞాతం మయాఽ_ఖిలమిదంత్వయి సన్నివిష్టం ।
తతోఽ_స్య సంభవలయావపి మాతరద్య ।
శక్తిశ్చలేఽ_స్య కరణే వితత ప్రభావా ॥
జ్ఞాతాఽ_ధునా సకలలోక మయీతి నూనమ్ ॥ 4

విస్తార్య సర్వమఖిలం సదసద్వికారమ్ ।
సందర్శయస్య వికలాపురుషాయకాలే ।
తత్త్వైశ్చ షోడశభి రేవ చ సప్తభిశ్చ ॥
భాసీంద్రజాల మివనః కిల రంజనాయ ॥ 5

నత్వామృతే కిమపి వస్తుగతం విభాతి ।
వ్యాప్యైవ సర్వమఖిలం త్వమవస్థితాఽ_సి ।
శక్తింవినా వ్యవహృతే పురుషోఽ_ప్యశక్తో ।
బంభణ్యతే జనని బుద్ధిమతా జనేన ॥ 6

ప్రీణాతివిశ్వ మఖిలం సతతం ప్రభావైః ।
స్వైస్తేజసా చ సకలం ప్రకీటీకరోషి ।
అత్స్యేవ దేవి తరసాకిల కల్పకాలే ।
కోవేద దేవి చరితం తవవైభవస్య ॥ 7

# వేదగర్భం శ్రీభువనేశ్వరీస్తోత్రం

## అథవా శ్రీభువనేశ్వరీమహాస్తోత్రం




శ్రీగణేశాయ నమః ॥

**ధ్యానం**

ఓం చంచన్మౌక్తికహేమమండనయుతా మాతాఽతిరక్తాంబరా

తన్వంగీ నయనత్రయాతిరుచిరా బాలార్కవద్భాసురా ।

యా దివ్యాంకుశపాశభూషితకరా దేవీ సదా భీతిహా

చిత్తస్థా భువనేశ్వరీ భవతు నః సేయం ముదః సర్వదా ॥

కర్ణస్వర్ణవిలోలకుడలధరామాపీనవక్షోరుహాం

ముక్తాహారవిభూషణాం పరిలసద్ధమ్మిల్లసన్మల్లికాం ।

లీలాలోలితలోచనాం శశిముఖీమాబద్ధకాంచీస్రజం

దీవ్యంతీం భువనేశ్వరీమనుదినం వందామహే మాతరం ॥

ఐందవ్యా కలయావతంసితశిరోవిస్తారినాదాత్మకం
తద్రూపం జనని స్మరామి పరమం సన్మాత్రమేకం తవ ।
యత్రోదేతి పరాభిధా భగవతీ భాసాం హి తాసాం పదం
పశ్యంతీ తనుమధ్యమా విహరతి స్వైరం చ సా వైఖరీ ॥ ॥ 1 ॥

ఆదిక్షాంతవిలాసలాలసతయా తాసాం తురీయా తు యా
క్రోడీకృత్య జగత్త్రయం విజయతే వేదాదివిద్యామయీ ।
తాం వాచం మయి సంప్రసాదయ సుధాకల్లోలకోలాహల-
క్రీడాకర్ణనవర్ణనీయకవితాసామ్రాజ్యసిద్ధిప్రదాం ॥ ॥ 2 ॥

కల్పాదౌ కమలాసనోఽపి కలయా విద్ధః కయాచిత్కిల
త్వాం ధ్యాత్వాంకురయాంచకార చతురో వేదాంశ్చ విద్యాశ్చ తాః ।
తన్మాత్రర్లలితే ప్రసీద సరలం సారస్వతం దేహి మే
యస్యామోదముదీరయంతి పులకైరంతర్గతా దేవతాః ॥ ॥ 3 ॥

మాతర్దేహభృతామహో ధృతిమయీ నాదైకరేఖామయీ
సా త్వం ప్రాణమయీ హుతాశనమయీ బిందుప్రతిష్ఠామయీ ।
తేన త్వాం భువనేశ్వరీం విజయినీం ధ్యాయామి జాయాం విభో-
స్త్వత్కారుణ్యవికాశిపుణ్యమతయః ఖేలంతు మే సూక్తయః ॥ ॥ 4 ॥

త్వామశ్వత్థదలానుకారమధురామాధారబద్ధోదరాం
సంసేవే భువనేశ్వరీమనుదినం వాగ్దేవతామేవ తాం ।
తన్మే శారదకౌముదీపరిచయోదంచత్సుధాసాగర-
స్వైరోజ్జాగరవీచివిభ్రమజితో దీవ్యంతు దివ్యా గిరః ॥ ॥ 5 ॥

లేఖప్రస్తుతవేద్యవస్తుసురభిశ్రీపుస్తకోత్తంసితో
మాతః స్వస్తికృదస్తు మే తవ కరో వామోఽభిరామః శ్రియా ।
సద్యో విద్రుమకందలీసరలతాసందోహసాంద్రాంగులిర్ముద్రాం
బోధమయీం దధత్తదపరోఽప్యాస్తామపాస్తభ్రమః ॥ ॥ 6 ॥

మాతః పాతకజాలమూలదలనక్రీడాకఠోరా దృశః
కారుణ్యామృతకోమలాస్తవ మయి స్ఫూర్జంతు సిద్ధ్యర్జితాః ।
ఆభిః స్వాభిమతప్రబంధలహరీసాకూతకౌతూహలాఽ-
ఽచాంతస్వాంతచతుర్ముఖోచితగుణోద్గారాం కరిష్యే గిరం ॥ ॥ 7 ॥

త్వామాధారచతుర్దలాంబుజగతాం వాగ్బీజగర్భే యజే
ప్రత్యావృత్తిభిరాదిభిః కుసుమితాం మాయాలతామున్నతాం ।
చూడామూలపవిత్రపత్రకమలప్రేంఖోలఖేలత్సుధా-
కల్లోలాసు కుచక్రచంక్రమచమత్కారైకలోకోత్తరాం ॥ ॥ 8 ॥

సోఽహం త్వత్కరుణాకటాక్షశరణః పంచాధ్వసంచారతః
ప్రత్యాహృత్య మనో వసామి రసనాలింగం మమాలింగతు ।
శ్రీసర్వజ్ఞవిభూషణీకృతకలానిఃస్యంద్రమానామృత-
స్వచ్ఛందస్ఫటికాద్రిసాంద్రితపయః శోభావతీ భారతీ ॥ ॥ 9 ॥

మాతర్మాతృకయా విదర్భితమిదం గర్భీకృతానాహత-
స్వచ్ఛంద్రధ్వనిపేయమధ్వనిరతం చంద్రార్కనిద్రాగిరౌ ।
సంసేవే విపరీతరీతిరచనోచ్చారాదకారావధి-
స్వాధీనామృతసింధుబంధురమహో మాయామయం తే మహః ॥10 ॥

తస్మాన్నందనచారుచందనతరుచ్ఛాయాసు పుష్పాసవ-
స్వైరాస్వాదనమోదమానమనసాముద్దామవామభ్రువాం ।
వీణాసంగితరంగితస్వరచమత్కారోఽపి సారోజితో
యేన స్యాదిహ దేహి మే తదభితః సంచారి సారస్వతం ॥ ॥ 11 ॥

ఆధారే హృదయే శిఖాపరిసరే సంధాయ మేధామయీం
త్రేధాబీజతనూమనూనకరుణాపీయూషకల్లోలినీం ।
త్వాం మాతర్జపతో నిరంకుశనిజాద్వైతామృతాస్వాదన-
ప్రజ్ఞాంభశ్చులుకైః స్ఫురంతు పులకైరంగాని తుంగాని మే ॥ ॥ 12 ॥

వాణీబీజమిదం జపామి పరమం తత్కామరాజాభిధం
మాతః సాంతపరం విసర్గసహితౌకారోత్తరం తేన మే ।
దీర్ఘాందోలితమౌలికీలితమణిప్రారబ్ధనీరాజనైర్ధీరైః
పీతరసా నిరంతరమసౌ వాగ్జృభతామద్భుతా ॥ ॥ 13 ॥

చూడాచంద్రకలానిరతరగలత్పీయూషబిందుశ్రియా
సందేహోచితమక్షసూత్రవలయం యా బిభ్రతీ నిర్భరం ।
అంతర్మంత్రమయం స్వమేవ జపసి ప్రత్యక్షవృత్త్యక్షరం
సా త్వం దక్షిణపాణినాంబ వితర శ్రేయాంసి భూయాంసి మే ॥14 ॥

బద్ధ్వా స్వస్తికమాసనం సితరుచిచ్ఛేదావదాతచ్ఛవి-
శ్రేణిశ్రీసుభగం భవిష్ణుసతతవ్యాజృంభమాణేఽమ్బుజే ।
దీవ్యంతీమధివామజాను రుచిరన్యస్తేన హస్తేన తాం
నిత్యం పుస్తకధారణప్రణయినీం సేవే గిరామీశ్వరీం ॥ ॥ 15 ॥

తన్మే విశ్వపథీనపీనవిలసన్నిఃసీమసారస్వత-
స్రోతోవీచివిచిత్రభంగిసుభగా విభ్రాజతాం భారతీ ।
యామాకర్ణ్య విఘూర్ణమానమనసః ప్రేంఖోలితైమీలిభి-
ర్మీలద్భిర్నయనాంచలైః సుమనసో నిందేయురిందోః కలాం ॥॥ 16 ॥

ఆదౌ వాగ్భవమిందుబిందుమధురం ఝాంతే చ కామాత్మకం
యోగాంతే కషయోస్తృతీయమితి తే బీజత్రయం ధ్యాయతాం ।
సార్ధం మాతృకయా విలోమవిషమం సంధాయ బంధచ్ఛిదా
వాచాంతర్గతయా మహేశ్వరి మయా మాత్రాశతం జప్యతే ॥॥ 17 ॥

తత్సారస్వతసార్వభౌమపదవీ సద్యో మమ ద్యోతతాం
యత్రాజ్ఞావిహితైర్మహాకవిశతైః స్ఫీతాం గిరం చుంబతాం ।
చైత్రోన్మీలితకేలికోకిలకుహూకారావతారంచిత-
శ్లాఘాసంచితపంచమశ్రుతిసమాహారోఽపి భారోపమః ॥ ॥ 18 ॥

వాగ్బీజం భువనేశ్వరీం వద వదేత్యుచ్చార్య వాగ్వాదిని
స్వాహావర్ణవిశీర్ణపాతకభరాం ధ్యాయామి నిత్యాం గిరం ।
వీణాపుస్తకమక్షసూత్రవలయం వ్యాజృంభమంభోరుహం
బిభ్రాణామరుణాశుభిః కరతలైరావిర్భవద్విభ్రమాం ॥ ॥ 19 ॥

తం మాతః కృపయా తరంగయతరాం విద్యాధిపత్యం మయి
జ్యోత్స్నాసౌరభచౌరకీర్తికవితాసేవ్యైకసింహాసనం ।
కాలాజ్ఞాదిశివావసానభవనప్రాగ్భారకుక్షింభరి
ప్రజ్ఞాంభఃపరిపాకపీవరపరానందప్రతిష్ఠాస్పదం ॥ ॥ 20 ॥

లేఖాభిస్తుహినద్యుతేరివ కృతం వాగ్బీజముచ్చైః స్ఫుర-
త్తారాకారకరాలబిందు పరితో మాయాత్రిధాఽఽవేష్టితం ।
పూర్ణేందోరుదరే తదేతదఖిలం పీయూషగౌరాక్షరం
స్రోతఃసంభ్రమసంభృతం స్మరతి యో జిహ్వాంచలే నిశ్చలః ॥॥ 21 ॥

తస్య త్వత్కరుణాకటాక్షకణికాసంక్రాంతిమాత్రాదపి
స్వాంతే శాంతిముపైతి దీర్ఘజడతా జాగ్రద్వికారాగ్రణీః ।
తస్మాదాశు జగత్త్రయాద్భుతరసాద్వైతప్రతీతిప్రదం
సౌరభ్యం పరమభ్యుదేతి వ వనాంభోజే గిరాం విభ్రమైః ॥ ॥ 22 ॥

ఆద్యో మౌలిరథాపరో ముఖమిఈ నేత్రే చ కర్ణావుఊ
నాసావంశపుటే ఋౠ తదనుజౌ వర్ణౌ కపోలద్వయం ।
దంతాశ్చోర్ధ్వమధస్తథోష్ఠయుగలం సంధ్యక్షరాణి క్రమా-
జ్జిహ్వామూలముదగ్రబిందురపి చ గ్రీవా విసర్గీ స్వరః ॥ ॥ 23 ॥

కాదిర్దక్షిణతో భుజస్తదపరో వర్గశ్చ వామో భుజ-
స్థాదిస్తాదిరనుక్రమేణ చరణౌ కుక్షిద్వయం తే పఫౌ ।
వంశః పృష్ఠభవోఽథ నాభిహృదయే బాదిత్రయం ధాతవో
యాద్యాః సప్త సమీరణశ్చ సపరః క్షః క్రోధ ఇత్యంబికే ॥ ॥ 24 ॥

ఏవం వర్ణమయం వపుస్తవ శివే లోకత్రయవ్యాపకం
యోఽహంభావనయా భజత్యవయవేష్వారోపితైరక్షరైః ।
మూర్తీభూయ దినావసానకమలాకారైః శిరఃశాయిభిస్తం
విద్యాః సముపాసతే కరతలైర్దృష్టిప్రసాదోత్సుకాః ॥ ॥ 25 ॥

యే జానంతి యజంతి సంతతమభిధ్యాయంతి గాయంతి వా
తేషామాస్యముపాస్యతే మృదుపదన్యాసైర్విలాసైర్గిరాం ।
కించ క్రీడతి భూర్భువఃస్వరభితః శ్రీచందనస్యందినీ
కీర్తిః కార్తికరాత్రికైరవసమా సౌభాగ్యశోభాకరీ ॥ ॥ 26 ॥

మాయాబీజవిదర్భితం పునరిదం శ్రీకూర్మచక్రోదితం
దీపామ్నాయవిదో జపంతి ఖలు యే తేషాం నరేంద్రాః సదా ।
సేవంతే చరణౌ కిరీటవలభీవిశ్రాంతరత్నాంకుర-
జ్యోత్స్నామేదురమేదినీతలరజోమిశ్రాంగరాగశ్రియః ॥ ॥ 27 ॥

శ్రీబీజం సకలాక్షరాదిషు పునః క్రోధాక్షరాంతే భవేదేవం
యో భజతేఽమ్బ తే తనుమిమాం తస్యాగ్రతో జాగ్రతీ ।
లక్ష్మీః సిందురదానగంధలహరీలోలాంధపుష్పంధయ-
శ్రేణీబంధురశృంఖలానియమితేవాపైతి నైవ క్వచిత్ ॥ ॥ 28 ॥

యస్త్వాం విద్రుమపల్లవద్రవమయీం లేఖామివాలోహితా-
మాత్మానం పరితః స్ఫురత్త్రివలయాం మాయామభిధ్యాయతి ।
తస్మై నిందితవందనేందుకదలీకాంతారహారస్రజో
నిఃశ్వాసభ్రమబాష్పదాహగహనా మూర్ఛంతి తాస్తాః స్త్రియః ॥॥ 29 ॥

మాతః శ్రీభగమాలినీత్యభిధయా దివ్యాగమోత్తంసితాం
త్వామానందమయీమనుస్మరతి యస్తం నామ వామభ్రువః ।
బాహుస్వస్తికపీడితైః స్తనతటైర్దైన్యాంచితైశ్చాటుభి-
ర్నీరంధ్రైః పులకాంకితైర్ముకులితైర్ధ్యాయంతి నేత్రాంచలైః ॥ ॥ 30 ॥

యస్త్వాం ధ్యాయతి రాగసాగరతరత్సిందూరనౌకాంతర-
స్ఫైర్యోజ్జాగరపద్మరాగనలినీపుష్పాసనాధ్యాసినీం ।
బాలాదిత్యసపత్నరత్నరచితప్రత్యంగభూషారుచి-
శ్రేణీసమ్మిలితాంగరాగవసనాస్తస్య స్మరంత్యంగనాః ॥ ॥ 31 ॥

కర్పూరం కుముదాకరం కమలినీపత్రం కలాకౌశలం
కూజత్కోకిలకామినీకులకుహూకల్లోలకోలాహలం ।
శంకంతే ప్రలయానలం స్మరమహాపస్మారవేగాతురాః
కంపంతే నిపతంతి హంత న గిరం ముంచంతి శోచంతి చ ॥ ॥ 32 ॥

శ్రీమృత్యుంజయనామధేయభగవచ్చైతన్యచంద్రాత్మికే
హ్రీంకారి ప్రథమాతమాంసి దలయ త్వం హంససంజీవిని ।
జీవం ప్రాణవిజృంభమాణహృదయగ్రంథిస్థితం మే కురు
త్వాం సేవే నిజబోధలాభరభసా స్వాహాభుజామీశ్వరీం ॥ ॥ 33 ॥

ఏవం త్వామమృతేశ్వరీమనుదినం రాకానిశాకాముకస్యాంతః
సంతతభాసమానవపుషం సాక్షాద్యజంతే తు యే ।
తే మృత్యోః కవలీకృతత్రిభువనా భోగస్య మౌలౌ పదం
దత్వా భోగమహోదధౌ నిరవధి క్రీడంతి తైస్తైః సుఖైః ॥ ॥ 34 ॥

జాగ్రద్బోధసుధామయూఖనిచయైరాప్లావ్య సర్వా దిశో
యస్యాః కాపి కలా కలంకరహితా షట్చక్రమాక్రామతి ।
దైన్యధ్వాంతవిదారణైకచతురా వాచం పరాం తన్వతీ
సా నిత్యా భువనేశ్వరీ విహరతాం హంసీవ మన్మానసే ॥ ॥ 35 ॥

త్వం మాతాపితరౌ త్వమేవ సుహృదస్త్వ భ్రాతరస్త్వం సఖా
త్వం విద్యా త్వముదారకీర్తిచరితం త్వం భాగ్యమత్యద్భుతం ।
కిం భూయః సకలం త్వమీహితమితి జ్ఞాత్వా కృపాకోమలే
శ్రీవిశ్వేశ్వరి సంప్రసీద శరణం మాతః పరం నాస్తి మే ॥ ॥ 36 ॥

శ్రీసిద్ధనాథ ఇతి కోఽపి యుగే చతుర్థే
ప్రాదుర్బభూవ కరుణావరుణాలయోఽస్మిన్ ।
శ్రీశంభురిత్యభిధయా స మయి ప్రసన్నం
చేతశ్చకార సకలాగమచక్రవర్తీ ॥ ॥ 37 ॥

తస్యాజ్ఞయా పరిణతాన్వయసిద్ధవిద్యా-
భేదాస్పదైః స్తుతిపదైర్వచసాం విలాసైః ।
తస్మాదనేన భువనేశ్వరి వేదగర్భం
సద్యః ప్రసీద వదనే మమ సన్నిధేహి ॥ ॥ 38 ॥

యేషాం పరం న కులదైవతమంబికే త్వం
తేషాం గిరా మమ గిరో న భవంతు మిశ్రాః ।
తైస్తు క్షణం పరిచితే విషయేఽపి వాసో
మా భూత్కదాచిదితి సంతతమర్థయే త్వాం ॥ ॥ 39 ॥

శ్రీశంభునాథ కరుణాకర సిద్ధనాథ
శ్రీసిద్ధనాథ కరుణాకర శంభునాథ ।
సర్వాపరాధమలినేఽపి మయి ప్రసన్నం
చేతః కురుష్వ శరణం మమ నాన్యదస్తి ॥ ॥ 40 ॥

ఇత్థం ప్రతిక్షణముదశ్రువిలోచనస్య
పృథ్వీధరస్య పురతః స్ఫుటమావిరాసీత్ ।
దత్వా వరం భగవతీ హృదయం ప్రవిష్టా
శాస్త్రైః స్వయం నవనవైశ్చ ముఖేఽవతీర్ణా ॥ ॥ 41 ॥

వాక్సిద్ధిమేవమతులామవలోక్య నాథః
శ్రీశంభురస్య మహతీమపి తాం ప్రతిష్ఠాం ।
స్వస్మిన్పదే త్రిభువనాగమవంద్యవిద్యా-
సింహాసనైకరుచిరే సుచిరం చకార ॥ ॥ 42 ॥

భూమౌ శయ్యా వచసి నియమః కామినీభ్యో నివృత్తిః
ప్రాతర్జాతీవిటపసమిధా దంతజిహ్వావిశుద్ధిః ।
పత్రావల్యాం మధురమశనం బ్రహ్మవృక్షస్య పుష్పైః
పూజాహోమౌ కుసుమవసనాలేపనాన్యుజ్జ్వలాని ॥ ॥ 43 ॥

ఇత్థం మాసత్రయమవికలం యో వ్రతస్థః ప్రభాతే
మధ్యాహ్నే వాఽస్తమితసమయే కీర్తయేదేకచిత్తః ।
తస్యోల్లాసైః సకలభువనాశ్చర్యభూతైః ప్రభూతైర్విద్యాః
సర్వాః సపది వదనే శంభునాథప్రసాదాత్ ॥ ॥ 44 ॥

వ్రతేన హీనోఽప్యనవాప్తమంత్రః శ్రద్ధావిశుద్ధోఽనుదినం జపేద్యః ।
తస్యాపి వర్షాదనవద్యసద్యః కవిత్వహృద్యాః ప్రభవంతి విద్యాః ॥ 45 ॥

కోఽప్యచింత్యప్రభావోఽస్య స్తోత్రస్య ప్రత్యయావహః ।
శ్రీశంభోరాజ్ఞయా సర్వాః సిద్ధయోఽస్మిన్ప్రతిష్ఠితాః ॥ ॥ 46 ॥

ఇతి శ్రీ సకలాగమాచార్యచక్రవర్తిశ్రీపృథ్వీధరాచార్య విరచితం
వేదగర్భం శ్రీభువనేశ్వరీస్తోత్రం అథవా శ్రీభువనేశ్వరీమహాస్తోత్రం సంపూర్ణం ।

# శ్రీభువనేశ్వరీధ్యానం



ఉద్యదినద్యుతిమిందుకిరీటాం తుంగకుచాం నయనత్రయయుక్తాం ।
స్మేరముఖీం వరదాంకుశపాశాభీతికరాం ప్రభజే భువనేశ్వరీం ॥ 1

సిందూరారుణవిగ్రహాం త్రినయనాం మాణిక్యమౌలిస్ఫురత్
తారానాయకశేఖరాం స్మితముఖీమాపీనవక్షోరుహాం ।
పాణిభ్యామలిపూర్ణరత్నచషకం రక్తోత్పలం బిభ్రతీం
సౌమ్యాం రత్నఘటస్థరక్తచరణాం వందే పరామంబికాం ॥ 2

ఇతి శ్రీభువనేశ్వరీధ్యానం

# శ్రీభువనేశ్వరీ పంజర స్తోత్రం



ఇదం శ్రీ భువనేశ్వర్యాః పంజరం భువి దుర్లభం ।
యేన సంరక్షితో మర్త్యో వాణైః శస్త్రైర్న బాధ్యతే ॥ ॥ 1 ॥

జ్వరమారీపశువ్యాఘ్రకృత్యాచౌరాద్యుపద్రవైః ।
నద్యంబుధరణీవిద్యుత్కృశానుభుజగారిభిః ॥ ॥ 2 ॥

సౌభాగ్యారోగ్యసంపత్తికీర్తికాంతియశోఽర్థదం ॥ ॥ 3 ॥

ఓం క్రోం శ్రీంహ్రీంఐం సౌః పూర్వేఽధిష్ఠాయ
మాం పాహి చక్రిణి భువనేశ్వరి ।

యోగవిద్యే మహామాయే యోగినీగణసేవితే ।
కృష్ణవర్ణే మహద్భూతే బృహత్కర్ణే భయంకరి ॥

దేవదేవి! మహాదేవి! మమ శత్రూన్ వినాశయ ।
ఉత్తిష్ఠ పురుషే కిం స్వపిషి భయం మేం సముపస్థితం ॥

యది శక్యమశక్యం తన్మే భగవతి! శమయ స్వాహా ।
త్రైలోక్యమోహిన్యై విద్మహే విశ్వజనన్యై ధీమహి
తన్నః శక్తిః ప్రచోదయాత్ ॥ ॥ 1 ॥

మమాగ్నేయాం స్థితా పాహి గదినీభువనేశ్వరి ।
యోగవిద్యే మహామాయే యోగినీగణసేవితే ॥

కృష్ణవర్ణే మహద్భూతే లంబకర్ణే భయంకరి ।
దేవదేవి! మహాదేవి! మమ శత్రున్ వినాశయ ।
ఉత్తిష్ఠ పురుషే కిం స్వపిషి భయం మేం సముపస్థితం ।
యది శక్యమశక్యం వా తన్మే భగవతి శమయ స్వాహా ॥

త్రైలోక్యమోహిన్యై విద్మహే విశ్వజనన్యై ధీమహి
తన్నః శక్తిః ప్రచోదయాత్ ॥ ॥ 2 ॥

యామ్యేఽధిష్ఠాయ మాం పాహి శంఖినీభువనేశ్వరి ।
యోగవిద్యే మహామాయే యోగినీగణసేవితే ॥

కృష్ణవర్ణే మహద్భూతే లంబకర్ణే భయంకరి ।
దేవదేవి! మహాదేవి! మమ శత్రున్ వినాశయ ।
ఉత్తిష్ఠ పురుషే కిం స్వపిషి భయం మేం సముపస్థితం ।
యది శక్యమశక్యం వా తన్మే భగవతి శమయ స్వాహా ॥

త్రైలోక్యమోహిన్యై విద్మహే విశ్వజనన్యై ధీమహి
తన్నః శక్తిః ప్రచోదయాత్ ॥ ॥ 3 ॥

నైరృత్యే మాం స్థితా పాహి ఖడ్గినీభువనేశ్వరి ।
యోగవిద్యే మహామాయే యోగినీగణసేవితే ॥

కృష్ణవర్ణే మహద్భూతే లంబకర్ణే భయంకరి ।
దేవదేవి! మహాదేవి! మమ శత్రున్ వినాశయ ।
ఉత్తిష్ఠ పురుషే కిం స్వపిషి భయం మేం సముపస్థితం ।
యది శక్యమశక్యం వా తన్మే భగవతి శమయ స్వాహా ॥

త్రైలోక్యమోహిన్యై విద్మహే విశ్వజనన్యై ధీమహి
తన్నః శక్తిః ప్రచోదయాత్ ॥ ॥ 4 ॥

పశ్చిమే మాం స్థితా పాహి పాశినీభువనేశ్వరి ।
యోగవిద్యే మహామాయే యోగినీగణసేవితే ॥

కృష్ణవర్ణే మహద్భూతే లంబకర్ణే భయంకరి ।
దేవదేవి! మహాదేవి! మమ శత్రున్ వినాశయ ।
ఉత్తిష్ఠ పురుషే కిం స్వపిషి భయం మేం సముపస్థితం ।
యది శక్యమశక్యం వా తన్మే భగవతి శమయ స్వాహా ॥

త్రైలోక్యమోహిన్యై విద్మహే విశ్వజనన్యై ధీమహి
తన్నః శక్తిః ప్రచోదయాత్ ॥ ॥ 5 ॥

వాయవ్యే మాం స్థితా పాహి శక్తినీభువనేశ్వరి ।
యోగవిద్యే మహామాయే యోగినీగణసేవితే ॥

కృష్ణవర్ణే మహద్భూతే లంబకర్ణే భయంకరి ।
దేవదేవి! మహాదేవి! మమ శత్రున్ వినాశయ ।
ఉత్తిష్ఠ పురుషే కిం స్వపిషి భయం మేం సముపస్థితం ।
యది శక్యమశక్యం వా తన్మే భగవతి శమయ స్వాహా ॥

త్రైలోక్యమోహిన్యై విద్మహే విశ్వజనన్యై ధీమహి
తన్నః శక్తిః ప్రచోదయాత్ ॥ ॥ 6 ॥

సౌమ్యేఽధిష్ఠాయ మాం పాహి చాపినీభువనేశ్వరి ।
యోగవిద్యే మహామాయే యోగినీగణసేవితే ॥

కృష్ణవర్ణే మహద్భూతే లంబకర్ణే భయంకరి ।
దేవదేవి! మహాదేవి! మమ శత్రున్ వినాశయ ।
ఉత్తిష్ఠ పురుషే కిం స్వపిషి భయం మేం సముపస్థితం ।
యది శక్యమశక్యం వా తన్మే భగవతి శమయ స్వాహా ॥

త్రైలోక్యమోహిన్యై విద్మహే విశ్వజనన్యై ధీమహి
తన్నః శక్తిః ప్రచోదయాత్ ॥ ॥ 7 ॥

ఈశేఽధిష్ఠాయ మాం పాహి శూలినీభువనేశ్వరి ।
యోగవిద్యే మహామాయే యోగినీగణసేవితే ॥

కృష్ణవర్ణే మహద్భూతే లంబకర్ణే భయంకరి ।
దేవదేవి! మహాదేవి! మమ శత్రున్ వినాశయ ।
ఉత్తిష్ఠ పురుషే కిం స్వపిషి భయం మేం సముపస్థితం ।
యది శక్యమశక్యం వా తన్మే భగవతి శమయ స్వాహా ॥

త్రైలోక్యమోహిన్యై విద్మహే విశ్వజనన్యై ధీమహి
తన్నః శక్తిః ప్రచోదయాత్ ॥ ॥ 8 ॥

ఊర్ధ్వేఽధిష్ఠాయ మాం పాహి పద్మినీభువనేశ్వరి ।
యోగవిద్యే మహామాయే యోగినీగణసేవితే ॥

కృష్ణవర్ణే మహద్భూతే లంబకర్ణే భయంకరి ।
దేవదేవి! మహాదేవి! మమ శత్రున్ వినాశయ ।
ఉత్తిష్ఠ పురుషే కిం స్వపిషి భయం మేం సముపస్థితం ।
యది శక్యమశక్యం వా తన్మే భగవతి శమయ స్వాహా ॥

త్రైలోక్యమోహిన్యై విద్మహే విశ్వజనన్యై ధీమహి
తన్నః శక్తిః ప్రచోదయాత్ ॥ ॥ 9 ॥

అధస్తాన్మాం స్థితా పాహి వాణినీభువనేశ్వరి ।
యోగవిద్యే మహామాయే యోగినీగణసేవితే ॥

కృష్ణవర్ణే మహద్భూతే లంబకర్ణే భయంకరి ।
దేవదేవి! మహాదేవి! మమ శత్రున్ వినాశయ ।
ఉత్తిష్ఠ పురుషే కిం స్వపిషి భయం మేం సముపస్థితం ।
యది శక్యమశక్యం వా తన్మే భగవతి శమయ స్వాహా ॥

త్రైలోక్యమోహిన్యై విద్మహే విశ్వజనన్యై ధీమహి
తన్నః శక్తిః ప్రచోదయాత్ ॥ ॥ 10 ॥

అగ్రతో మాం సదా పాహి సాంకుశే భువనేశ్వరి ।
యోగవిద్యే మహామాయే యోగినీగణసేవితే

కృష్ణవర్ణే మహద్భూతే లంబకర్ణే భయంకరి ।
దేవదేవి! మహాదేవి! మమ శత్రున్ వినాశయ ।
ఉత్తిష్ఠ పురుషే కిం స్వపిషి భయం మేం సముపస్థితం ।
యది శక్యమశక్యం వా తన్మే భగవతి శమయ స్వాహా ॥

త్రైలోక్యమోహిన్యై విద్మహే విశ్వజనన్యై ధీమహి
తన్నః శక్తిః ప్రచోదయాత్ ॥ ॥ 11 ॥

పృష్ఠతో మాం స్థితా పాహి వరదే భువనేశ్వరి ।
యోగవిద్యే మహామాయే యోగినీగణసేవితే ॥

కృష్ణవర్ణే మహద్భూతే లంబకర్ణే భయంకరి ।
దేవదేవి! మహాదేవి! మమ శత్రున్ వినాశయ ।
ఉత్తిష్ఠ పురుషే కిం స్వపిషి భయం మేం సముపస్థితం ।
యది శక్యమశక్యం వా తన్మే భగవతి శమయ స్వాహా ॥

త్రైలోక్యమోహిన్యై విద్మహే విశ్వజనన్యై ధీమహి
తన్నః శక్తిః ప్రచోదయాత్ ॥ ॥ 12 ॥

సర్వతో మాం సదా పాహి సాయుధే భువనేశ్వరి ।
యోగవిద్యే మహామాయే యోగినీగణసేవితే ॥

కృష్ణవర్ణే మహద్భూతే లంబకర్ణే భయంకరి ।
దేవదేవి! మహాదేవి! మమ శత్రున్ వినాశయ ।
ఉత్తిష్ఠ పురుషే కిం స్వపిషి భయం మేం సముపస్థితం ।
యది శక్యమశక్యం వా తన్మే భగవతి శమయ స్వాహా ॥

త్రైలోక్యమోహిన్యై విద్మహే విశ్వజనన్యై ధీమహి
తన్నః శక్తిః ప్రచోదయాత్ ॥ ॥ 13 ॥

**ఫలశ్రుతిః**

ప్రోక్తా దిఙ్మనవో దేవి! చతుర్దశ శుభప్రదాః ।
ఏతత్ పంజరమాఖ్యాతం సర్వరక్షాకరం నృణాం ॥

గోపనీయం ప్రయత్నేన స్వయోనిరివ పార్వతి ।
న భక్తాయ ప్రదాతవ్యం నాశిష్యాయ కదాచన ॥

సిద్ధికామో మహాదేవి! గోపయేన్మాతృజారవత్ ।
భయకాలే హోమకాలే పూజాకాలే విశేషతః ॥

దీపస్యారంభకాలే వై యః కుర్యాత్ పంజరం సుధీః ।
సర్వాన్ కామానవాప్నోతి ప్రత్యూహైర్నాభిభూయతే ॥

రణే రాజకులే ద్యూతే సర్వత్ర విజయీ భవేత్ ।
కృత్యారోగపిశాచాద్యైర్న కదాచిత్ ప్రబాధ్యతే ॥

ప్రాతఃకాలే చ మధ్యాహ్నే సంధ్యాయామర్ధరాత్రకే ।
యః కుర్యాత్ పంజరం మర్త్యో దేవీం ధ్యాత్వా సమాహితః ॥

కాలమృత్యుమపి ప్రాప్తం జయేదత్ర న సంశయః ।
బ్రహ్మాస్త్రాదీని శస్త్రాణి తద్గాత్రం న లగంతి చ ॥
పుత్రవాన్ ధనవాఽఽల్లోకే యశస్వీ జాయతే నరః ॥

ఇతి శ్రీభువనేశ్వరీపంజరస్తోత్రం సంపూర్ణం ।

# శ్రీ భువనేశ్వరి హృదయ స్తోత్రం



**దేవ్యువాచ :**

భగవాన్ బ్రూహితత్స్తోత్రం సర్వకామ ప్రసాదనమ్ ।
యస్య శ్రవణ మాత్రేణ నాన్యచ్ఛ్రోతమ్యమిష్యతే ॥

యదిమేఽను గ్రహఃకార్యః ప్రీతిశ్చాపి మమోపరి ।
తదిదం కథయ బ్రహ్మన్ విమలం యన్మహీతలే ॥

**ఈశ్వర ఉవాచ :**

శృణుదేవి ప్రవక్ష్యామి సర్వకామ ప్రసాధనమ్ ।
హృదయం భువనేశ్వర్యాః స్తోత్రమస్తి యశోప్రదమ్ ॥

ఓం అస్య శ్రీభువనేశ్వరీ హృదయ స్తోత్ర మంత్రస్య శక్తి ఋషిః, గాయత్రీ ఛ్ఛందః, భువనేశ్వరీ దేవతా, **హకారో** బీజం **ఈకారః** శక్తిః **రేఫ** కీలకం, సకల మనోవాంఛిత సిద్ధ్యర్థే పాఠే వినియోగః.

ఓం **హ్రీం** హృదయాయ నమః, ఓం **శ్రీం** శిరసే స్వాహా, ఓం **ఐం** శిఖాయై వషట్, ఓం **హ్రీం** కవచాయ హుం, ఓం **శ్రీం** నేత్రత్రయా యౌషట్,

ఓం **ఐం** అస్త్రాయ ఫట్ - ఇతి హృదయాదిన్యాసః - ఏవం కరన్యాసః.

**ధ్యానమ్ :**

ధ్యాయేద్బ్రహ్మాదికానాం కృతజని జననీం యోగినీం యోగయోనిమ్।
దేవీనాం జీవనాయోజ్జ్వలిత జయపరజ్యోతిరూగ్రహాం గధాత్రీమ్ ॥

శంఖం చక్రం చ బాణం ధనురపి దధతీం దోశ్చతుష్కాంబుజాతైః
మాయామాద్యాం విశిష్టాంభవ భవభువనాం భూభువా భార భూమిమ్ ॥

యదాజ్ఞయేదం గగనాద్యశేషం సృజత్యజః శ్రీపతిరౌరసంవా ।
బిభర్తి సంహాతి భవస్తదంతే భజామహే శ్రీ భువనేశ్వరీం తాం ॥ 1

జగజ్జనానందకరీం జయాభ్యాం యశస్వినీం యంత్ర సుయజ్ఞయోనిం ।
జితామితా మిత్ర కృత ప్రపంచాం భజాం ॥ 2

హరౌప్రసుప్తే భువనత్రయాంతే అవాతరన్నాభిజ పద్మజన్మా ।
విధిస్తతోన్థే విదధార యత్పదం భజాం ॥ 3

న విద్యతేక్వాపి తుజన్మయస్యానవా స్థితిః శాంతతి కేహ యస్యాః ।
నవానిరోథేఽ ఖిల కర్మయస్యా భజాం ॥ 4

కటాక్ష మోక్షాచరణోగ్రచిత్తా నివేశితార్ణా కరుణార్ద్ర చిత్తా ।
సుభయేహ్యేతి సమీప్సితంయా భజాం ॥ 5

యతో జగజ్జన్మ బభూవ యోనేస్తదేవ మధ్యే ప్రతిపాతియావా ।
తదత్తి యాంతోఽ ఖిలముగ్ర కాళీ భజాం ॥ 6

సుషుప్తికాలే జనమధ్యయంత్యా యయాజనః స్వప్నమవైతి కించిత్ ।
ప్రబుద్ధయతే జాగ్రతి జీవ ఏషభజాం ॥ 7

దయాస్ఫురత్కోర కటాక్ష లాభాన్నైకత్ర యస్యాః ఫలభంతి సిద్ధాః ।
కవిత్వమీశిత్వ మపి స్వతంత్రా భజాం ॥ 8

లసన్ముఖాంభోరూహముస్ఫురంతే హృదిప్రణిధ్యాయ దిశి స్ఫురంతః।
యస్యాః కృపార్ద్రం ప్రవికాశయంతి భజాం ॥ 9

యదానురాగాను గతాలి చిత్రాశ్చిరంతన ప్రేమపరీప్లుతాంగాః ।
సునిర్భయాః సంతి ప్రమాద్య యస్యాః భజాం ॥ 10

హరిర్విరించిః హరఈశితారః పురోఽవతిష్ఠంతి ప్రపన్నభృంగాః ।
యస్యాః సమిచ్ఛంతి సదానుకూల్యం భజాం ॥ 11

మనుం యదీయం హరమగ్ని సంస్థం తతశ్చ వావశృతి చందసక్తమ్ ।
జపంతి యేస్యుర్ష్టి సువందితాస్తే భజాం ॥ 12

ప్రసీదతు ప్రేమరసార్ద్ర చిత్తా సదాహి సా శ్రీ భువనేశ్వరీమ్ ।
కృపాకటాక్షేణ కుబేరకల్పా భవంతి యస్యాః పదభక్తి భాజః ॥ 13

ముదా సుపాఠ్యం భువనేశ్వరీయంసదాసతాం స్తోత్రమిదం సుసేవ్యం ।
సుఖప్రదం స్యాత్కలికల్మషఘ్నం సుశృణ్వతాం సంపఠతాం ప్రశస్యమ్ ॥ 14

ఏతాత్తు హృదయం స్తోత్రం పఠేద్యస్తు సమాహితః ।
భవేత్తస్యేష్టదా దేవిప్రసన్నా భువనేశ్వరీ ॥ 15

దదాతి ధనమాయుష్యం పుణ్యం పుణ్యమతింతథా ।
నైష్ఠికీం దైవభక్తిం చ గురుభక్తిం విశేషతః ॥ 16

పూర్ణిమాయాం చతుర్దశ్యాం కుజవారే విశేషతః ।
పఠనీయమిదం స్తోత్రం దేవసద్మని యత్నతః ॥ 17

యత్రకుత్రాపి పాఠేన స్తోత్రస్యాస్యఫలం భవేత్ ।
సర్వస్థానేషు దేవేశ్యాః పూతదేహః సదా పఠేత్ ॥ 18

ఇతి నీల సరస్వతీ తంత్రే భువనేశ్వరీ పటలే శ్రీ దేవేశ్వర సంవాదే
శ్రీ భువనేశ్వరీ దేవి హృదయస్తోత్రం సమాప్తమ్

# శ్రీ భువనేశ్వరి కవచం - 1



**శ్రీ దేవ్యువాచ :**

భువనేశ్యాశ్చదేవేశ యాయావిద్యాః ప్రకాశితాః,

శ్రుతాశ్చాధిగతా స్సర్వాఃశ్రోతు మిచ్ఛామి సాంప్రతం 1

**ఈశ్వర ఉవాచ:**

త్రైలోక్యమంగళం నామ కవచం యత్పురోదితం

శృణుపార్వతి వక్ష్యామి సావధానా వధారయ 2

త్రైలోక్యమంగళంనామ కవచం మంత్రవిగ్రహం,
సిద్ధవిద్యామయం దేవి సర్వైశ్వర్య ప్రదాయకం 3

పఠనాద్ధారణాన్మర్త్యః త్రైలోక్యైశ్వర్యభాగ్భవేత్
త్రైలోక్య మంగళస్యాస్యకవచస్య ఋషిశ్శివః 4

ఛందోవిరాట్ జగద్ధాత్రీ దేవతా భువనేశ్వరీ
ధర్మార్థ కామమోక్షేషు వినియోగః ప్రకీర్తితః 5

హ్రీం బీజమ్మే శిరఃపాతు భువనేశీ లలాటకం
ఐంపాతు దక్షనేత్రమ్మే హ్రీంపాయాద్వామలోచనమ్ 6

శ్రీంపాతు దక్షకర్ణమ్మే త్రివర్ణాఖ్యా మహేశ్వరీ
వామకర్ణం సదాపాతు ఐం ఘ్రాణం పాతుమేసదా 7

హ్రీం పాతువదనం దేవీ ఐం పాతు రసనాం మమ
వాక్పుటంచ త్రివర్ణాత్మాకంఠం పాతు పరాంబికా 8

శ్రీంస్కంధౌపాతునియతం హ్రీం భుజౌపాతుసర్వదా
క్లీం కరౌ త్రిపుటేశానీ త్రిపుటైశ్వర్యదాయినీ 9

ఓంపాతు హృదయం హ్రీమ్మే మధ్యదేశం సదావతు,
క్రౌంపాతునాభిదేశం సా త్ర్యక్షరీ భువనేశ్వరీ 10

సర్వబీజ ప్రదా పృష్ఠం పాతు సర్వవశంకరీ
హ్రీంపాతు గుదదేశంమే నమోభగవతీ కటిం 11

మాహేశ్వరీసదాపాతు సక్థినీ జానుయుగ్మకం,
అన్నపూర్ణాసదాపాతు స్వాహాపాతు పదద్వయం 12

సప్తదశాక్షరీ పాయా దన్న పూర్ణాత్మికా పరా,
తారంమాయా రమాకామః షోడశార్ణాతతఃపరం 13

శిరస్థాసర్వదాపాతు వింశత్యర్ణాత్మికాపరా,
తారం దుర్గేయుగం రక్షేత్ స్వాహేతి చ దశాక్షరీ 14

జయదుర్గాఘనశ్యామా పాతుమాం పూర్వతోముదా,
మాయాబీజాదికాచైషా దశార్ణాచపరాతథా 15

ఉత్తప్తకాంచనాభాసా జయదుర్గాననేవతు
తారంహ్రీం దుంచ దుర్గాయా నమోஉష్టార్ణాత్మికాపరా 15

శంఖచక్రధనుర్బాణ ధరామాం దక్షిణేஉవతు,
మహిషామర్ధినిస్వాహా వసువర్ణాత్మికాపరా 17

నైర్రుత్యాం సర్వదాపాతు మహిషాసురనాశినీ,
మాయాపద్మావతీస్వాహా సప్తార్ణాపరికీర్తితా 18

పద్మావతీపద్మసంస్థా పశ్చిమేమాం సదావతు
పాశాంకుశపుటేమాయే హ్రీం పరమేశ్వరి స్వాహా 19

త్రయోదశార్ణా తారాద్యా అశ్వారూఢాననేవతు,
సరస్వతీ పంచశరే నిత్యక్లిన్నే మదద్రవే 20

స్వాహారవ్యక్షరీవిద్యా మా ముత్తరేసదావతు,
తారంమాయాతుకవచం ఖేర క్షేత్సతతం వధూః 21

హ్రూం క్షం హ్రీం ఫట్ మహావిద్యా ద్వాదశార్ణాఖిలపదా,
త్వరితాష్టాశ్రిభిః పాయాచ్ఛివకోణే సదాచమాం 22

ఐం క్లీం సౌః సాతతో బాలా మూమూర్ధ్వ దేశతోవతు
బిన్ద్వన్తా భైరవీబాలా భూమౌ చ మాం సదావతు 23

ఇతితే కథితం పుణ్యం త్రైలోక్యం మంగళంపరం,
సారం సారతరంపుణ్యం మహావిద్యౌఘవిగ్రహమ్ 24

అస్యాపి పఠనాత్సద్యః కుబేరోఽపి ధనేశ్వరః
ఇంద్రాద్యాస్సకలాదేవాః పఠనాద్ధారణాద్యతః 25

సర్వసిద్ధీశ్వరాస్సంతః సర్వైశ్వర్యమవాప్నుయుః,
పుష్పాంజల్యష్టకందత్వా మూలేనైవ పఠేత్సకృత్ 26

సంవత్సరకృతాయాస్తు పూజాయాః ఫలమాప్నుయాత్
ప్రీతిమన్యోన్యతః కృత్వా కమలానిశ్చలా గృహే 27

వాణీచ నివసేద్వక్త్రే సత్యం సత్యం నసంశయః,
యోధారయతి పుణ్యాత్మా త్రైలోక్యమంగళాభిధం 28

కవచం పరమం పుణ్యం సోఽపి పుణ్యవతాం వరః,
సర్వైశ్వర్యయుతో భూత్వాత్రైలోక్య విజయీభవేత్ 29

పురుషోదక్షిణే బాహౌ నారీ వామభుజేతథా,
బహుపుత్రవతీ భూత్వా వంధ్యాపిల్లభతే సుతం 30

బ్రహ్మాస్త్రాదీనిశస్త్రాణి నైవకృంతంతి తజ్జనం
ఏతత్కవచ మజ్ఞాత్వా యోజపేద్భువనేశ్వరీం
దారిద్ర్యం పరమం ప్రాప్య సోచిరాన్మృత్యుమాప్నుయాత్ 31

ఇతి శ్రీ రుద్రయామళే దేవీశ్వర సంవాదే త్రైలోక్యమంగళం నామ
శ్రీ భువనేశ్వరీ కవచ సమాప్తం

# శ్రీ భువనేశ్వరీ మహావిద్యా కవచం-2



## ధ్యానం

ఉద్యద్దినద్యుతి మిందు కిరీటాం తుంగకుచాం నయనత్రయయుక్తాం
స్మేరముఖీం వరదాంకుశ పాశాం భీతికరాం ప్రభజే భువనేశీం॥ 1

బ్రహ్మరూపే సదానందే పరానంద స్వరూపిణి
ద్రుతసిద్ధి ప్రదే దేవి నారాయణి నమోస్తుతే ॥ 2

శౌరిశ్చకాస్తి హృదయేషు శరీర భాజాం తస్యాపి దేవి హృదయం త్వమను ప్రవిష్టా
పద్మే తవాపి హృదయే ప్రథతే ద మేయం త్వమేవ జాగ్ర దఖిలాతిశయం శ్రయామః ॥ 3

## కవచం

హ్రీం బీజం మే శిరః పాతు భువనేశీ లలాటకమ్
ఐం పాతు దక్ష నేత్ర మేం హ్రీం పాతు వామలోచనం ॥ 1

శ్రీం పాతుదక్షకర్ణం మే త్రివర్ణాత్మా మహేశ్వరీ
వామ కర్ణం సదా పాతు ఐం ఘ్రాణం పాతుమే సదా ॥ 2

దేహస్థా దేహరూపాచ దేహధ్యేయా సుదేహికా
నాడీరూపా మహీరూపా నాడీస్థాన నివాసినీ ॥ 105

ఇంగలా పింగలా చైవ సుషుమ్నా మధ్యవాసినీ
సదా శివ ప్రియకరీ మూల ప్రకృతి రూపధృక్ ॥ 106

అమృతేశీ మహాకాళీ శృంగారాంగ నివాసినీ
ఉత్పత్తి స్థితి సంహార ప్రలయాపద వాసినీ ॥ 107

మహాప్రళయ యుక్తా చ సృష్టి సంహార కారిణీ
స్వధా స్వాహా హవ్యవాహా హవ్యా హవ్యప్రియా సదా ॥ 108

హవ్యస్థా హవ్యభక్షా చ హవ్యదేహా సముద్భవా
హవ్యక్రీడా కామధేను స్వరూపా రూపసంభవా ॥ 109

సురభీ నందినీ పుణ్యా యజ్ఞాంగీ యజ్ఞసంభవా
యజ్ఞస్థా యజ్ఞదేహా చ యోనిజా యోనివాసినీ ॥ 110

అయోనిజా సతీసత్యా అసతీ కుటీలాతనుః
అహల్యా గౌతమీ గమ్యా విదేహా దేహనాశినీ ॥ 111

గాంధారీ ద్రౌపదీ దూతీ శివప్రియా త్రయోదశీ
పంచదశీ పౌర్ణమాసీ చతుర్దశీ చ పంచమీ ॥ 112

షష్ఠీ చ నవమీ చైవ అష్టమీ దశమీ తథా
ఏకాదశీ ద్వాదశీ చ ద్వారరూపీ భయప్రదా ॥ 113

సంక్రాంతిః సామరూపా చ కులీనా కులనాశినీ
కులకాంతా కృశా కుంభా కుంభదేహా వివర్ధినీ ॥ 114

వినీతా కులవత్యర్థా అంతరీ చానుగా వృషా
నదీ సాగరదా శాంతిః శాంతిరూపా సుశాంతికా ॥ 115

ఆశాతృష్ణా క్షుదా క్షోభా క్షోభరూప నివాసినీ
గంగాసాగరగా కాంతిః శ్రుతిస్మృతి ర్ధృతిర్మహీ ॥ 116

దివారాత్రిః పంచభూత దేహాచైవ సుదేహకా
తండులా ఛిన్నమస్తా చ నాగయజ్ఞోపవీతినీ ॥ 117

వర్ణినీ డాకినీ శక్తిః కురుకుళ్ళా సుకుళ్ళకా
ప్రత్యంగిరాఽపరాదేవీ అజితాజయ దాయినీ ॥ 118

జయా చ విజయా చైవ మహిషాసుర ఘాతినీ
మధుకైటభహంత్రీ చ చండ ముండ వినాశినీ ॥ 119

నిశుంభ శుంభహననీ రక్తబీజ క్షయంకరీ
కాళీ కాశీ నివాసా చ మధురా పార్వతీ పరా ॥ 120

అపర్ణా చండికా దేవీ మృడానీచాంబికా కళా
శుక్లా కృష్ణా వర్ణ్యవర్ణా శరదిందు కళాకృతిః ॥ 121

రుక్మిణీ రాధికాచైవ భైరవ్యాః పరికీర్తితమ్
అష్టాదిక సహస్రంతు దేవ్యా నామాను కీర్తనాత్ ॥ 122

మహాపాతకయుక్తోపి ముచ్యతే నాత్ర సంశయః
బ్రహ్మహత్యా సురాపానం స్తేయం గుర్వంగనాగమః ॥ 123

మహాపాతక కోట్యస్తు తథా చైవోప పాతకాః
స్తోత్రేణ భైరవోక్తేన సర్వం నశ్యతి తక్షణాత్ ॥ 124

సర్వంవా శ్లోకమేకంవా పఠనాత్స్మరణాదపి
పఠేద్వా పాఠయేద్వాపి సద్యో ముచ్యేత బంధనాత్ ॥ 125

రాజద్వారే రణేదుర్గే సంకటే గిరిదుర్గమే
ప్రాంతరే పర్వతే వాపి నౌకాయాంవా మహేశ్వరి ॥ 126

వహ్ని దుర్లభయే ప్రాప్తే సింహవ్యాఘ్ర భయాకులే
పఠనా త్స్మరణా న్మర్త్యో ముచ్యతే సర్వ సంకటాత్ ॥ 127

అపుత్రో లభతే పుత్రం దరిద్రో ధనవాన్ భవేత్
సర్వశాస్త్ర పరోవిప్రః సర్వ యజ్ఞఫలం లభేత్ ॥ 128

అగ్నిర్వాయుజల స్తంభ గతిస్తంభం వివస్వతః
మారణే ద్వేషణే చైవ తథోచ్చాటే మహేశ్వరి ॥ 129

గోరోచనా కుంకుమేన లిఖేత్ స్తోత్ర మనన్యధీః
గురుణా వైష్ణవైర్వాపి సర్వయజ్ఞ ఫలం లభేత్ ॥ 130

వశీకరణ మత్రైవ జాయంతే సర్వసిద్ధయః
ప్రాతఃకాలే శుచిర్భూత్వా మధ్యాహ్నే చ నిశామజే ॥ 131

పఠేద్వా పాఠయేద్వాపి సర్వయజ్ఞ ఫలం లభేత్
వాదీ మూకో భవే ద్దుష్టో రాజా చ సేవకో యథా ॥ 132

ఆదిత్య మంగళ దినే గురోశ్చాపి మహేశ్వరి
గోరోచనా కుంకుమేన లిఖేత్ స్తోత్ర మనన్యధీః
ధృత్వాసువర్ణ మధ్యస్థం సర్వాన్ కామా నవాప్నుయాత్ ॥ 133

స్త్రీణాం వామకరే ధార్యం పుమాన్ దక్షకరే తథా
ఆదిత్య మంగళ దినే గురౌవాపి మహేశ్వరి ॥ 134

శనైశ్చరేలిఖే ద్వాపి సర్వసిద్ధిం లభేద్ధ్రువమ్
ప్రాతరేవ శ్మశానేవా నిశాయా మర్థ రాత్రకే ॥ 135

పూన్యాగారే చ దేవేశీ లిఖేద్యత్నేన సాధకః
సింహరాశౌగురు గతే కర్కటస్థే దివాకరే ॥ 136

మీనరాశౌ గురు గతే లిఖేద్యత్నేన సాధకః
స్వస్వలాభగం దృష్ట్వా తత్రస్థో విలిఖేత్ సదా ॥ 137

సుగంధి కుసుమైః శుక్రైః సుగంధి గంధ చందనైః
మృగనాభి మృగమదైర్వా విలిఖేద్యత్న పూర్వకమ్ ॥ 138

లిఖిత్వా చ పఠిత్వా చ ధురయేచ్చాప్యనన్యధీః
కుమారీం పూజయిత్వా చ నారీ శ్చాపి ప్రపూజయేత్ ॥ 139

పూజయిత్వా చ కుసుమైః గంధచందన వస్త్రకైః
సింధూర రక్త కుసుమైః పూజయేత్ భక్తి యోగతః ॥ 140

అధవా పూజయే ద్దేవీ కుమారీ ర్ధశనాన్యధీః
సర్వాభీష్టఫలం తత్ర లభతే తత్క్షణాదపి ॥ 141

నాత్ర సిద్ధ్యాద్యపేక్షాస్తి నవామిత్రారి దూషణమ్
నవిచార్య చ దేవేశి జపమాత్రేణ సిద్ధిదమ్ ॥ 142

సర్వదా సర్వకాలేషు షట్ సాహస్ర ప్రమాణతః
బలిందత్వా విధానేన ప్రత్యహం పూజయే చ్ఛివామ్ ॥ 143

స్వయంభూ కుసుమైః పుష్పైర్బలిదానం దివానిశమ్
పూజయే త్పార్వతీం దేవీం భైరవీం త్రిపురాత్మికాం ॥ 144

బ్రాహ్మణాన్ భోజయే న్నిత్యం దశకం ద్వాదశం తథా
అనేన విధినా దేవీ బాలాన్నిత్యం ప్రపూజయేత్ ॥ 145

మాసమేకం పఠేద్యస్తు త్రిసంధ్యాం విధినామునా
అపుత్రో లభతే పుత్రం నిర్ధనో ధనవాన్ భవేత్ ॥ 146

సదా చానేన విధినా తథా మాస త్రయేణ చ
కృతకార్యం భవే ద్దేవి తథా మాసచతుష్టయే ॥ 147

దీర్ఘరోగా త్ప్రముచ్యేత పంచమే కవిరాడ్భవేత్
సర్వైశ్వర్యం లభేద్దేవి మాసషట్కే తథైవ చ ॥ 148

సప్తమే ఖేచరత్వం చ అష్టమే చ బృహద్ద్యుతిః
నవతో సర్వసిద్ధిస్యాత్ దశమే లోకపూజితః ॥ 149

ఏకాదశే రాజవశ్యో ద్వాదశేతు పురందరః
వారమేకం పఠేద్యస్తు ప్రాప్నోతి పూజనే ఫలమ్ ॥ 150

సమగ్రం శ్లోకమేకంవా యఃపఠే త్ప్రయత శ్శుచిః
సపూజాఫలమాప్నోతి భైరవేన చ భాషితమ్ ॥ 151

ఆయుష్మత్ప్రీతి యోగే చ బ్రహ్మైంద్రే చ విశేషతః
పంచమ్యాం చ తథా షష్ఠ్యాం యత్ర కుత్రాపి తిష్ఠతి ॥ 152

శంకా న విద్యతే తత్ర న చ మాయాది దూషణమ్
వారమేకం పఠేన్మర్త్యో ముచ్యతే సర్వసంకటాత్ ॥ 153

కిమన్యద్బహునా దేవి సర్వాభీష్ట ఫలం లభేత్
ఇతి శ్రీ విశ్వసారే మహాభైరవ విరచితం
శ్రీమత్త్రిపురభైరవీ సహస్రనామ స్తోత్రం సమాప్తం ॥

ఇతి శ్రీ శక్తి ప్రమోదే శ్రీ త్రిపుర భైరవీ సహస్రనామ స్తోత్రం సమాప్తం

దశ మహావిద్యలలో 6వ మహావిద్య

# శ్రీ ఛిన్నమస్తా దేవి



నిత్ర పబ్లికేషన్స్

# దశ మహావిద్యలలో 6వ మహావిద్య

# శ్రీ ఛిన్నమస్తా దేవి



నిత్ర పబ్లికేషన్స్

# దశమహావిద్యలు

విద్య అంటే సరైన జ్ఞానం. మన చుట్టూ ఉన్న మాయను పటా పంచలు చేసి సత్యాన్ని చూడగల శక్తినిచ్చేది మహా విద్య. జ్ఞాన స్వరూపిణి అయిన శక్తి ధరించిన పది రూపాలే దశ మహా విద్యలు. తంత్ర శాస్త్రంలో శక్తి ఉపాసనను విద్య అంటారు.

మంత్ర శాస్త్రంలో పురుష దేవతా మంత్రాలని మంత్రాలని, దేవీ మంత్రాలని విద్యలని అనడం పరిపాటి. ఈ పది దేవీ శక్తులని దశావతారలతో కొందరు పోల్చారు. వీటిని బ్రహ్మ విద్యలుగా గుర్తించి, దేవతా శక్తులుగా పూజించి సాధకులు అనుగ్రహాన్ని పొందారు, శక్తివంతులయ్యారు.

అజ్ఞానం పాపానికి కారణమౌతుంది. పాపం దుఃఖానికి కారణం. జ్ఞానం స్వేచ్ఛనిస్తుంది. పరమానందాన్ని కలిగిస్తుంది. అటువంటి జ్ఞానాన్ని అమ్మవారు పది అవతారాలలో ప్రసాదిస్తుంది. ఆ అవతారాలనే దశ మహా విద్యలన్నారు.

## అవతార రహస్యం



సృష్టి స్థితిలయకారిణి అయిన అమ్మ శ్రీఆదిశక్తి. మహామాత, మహాదేవి అయినటువంటి ఈ ఆదిపరాశక్తి ఈ బ్రహ్మాండం అంతా వ్యాపించి వుంది. జగన్మాత ధరించిన అవతారాలు ఎన్నో ఉన్నట్టుగా వివిధ పురాణాలు పేర్కొంటున్నాయి. లోక రక్షణకు, భక్తుల కోరిక మేర, రాక్షససంహారానికి మరియు లోకోద్ధరణకు ఆమె ఎన్నో రూపాలలో అవతరించింది, ఎన్నో లీలలనూ ప్రదర్శించింది. వాటిల్లో ప్రముఖమైనవి శ్రీదేవి యొక్క "దశమహావిద్యలు".

తంత్ర శాస్త్రంలో ప్రప్రథమంగా చెప్పుకోదగినవి దశమహావిద్యలు. దశ మహావిద్యలు అని పేర్కొనబడిన మంత్ర విద్యలకు 10 మంది దేవతలు అధిపతులుగా ఉన్నారు.

కలియుగంలో అత్యంత శీఘ్రంగా అనుగ్రహాన్నిచ్చేవి దశ మహా విద్యలు అని చెబుతారు. ఈ దేవతల మూలమంత్రాలను జపహోమ విధానం ద్వారా ఉపాసిస్తే సాధకులు తమ కామ్యాల్ని సులభంగా పొందగలరు అని విశ్వాసము.

## దేవీభాగవతం ప్రకారం దశమహావిద్యలు



పరమ శివుని భార్య అయిన సతీదేవి తండ్రి దక్షప్రజాపతి తల పెట్టిన యజ్ఞానికి వెళ్ళుటకు నిర్ణయించుకుని పరమ శివునితో చెప్పగా, శివుడు దక్షప్రజాపతి ఆంతర్యము తెలుసుకొనినవాడై పిలుపు లేని చోటుకు వెళ్ళ రాదని వారించెను. వెంటనే సతీదేవి కోపంతో పరమ శివునికి తన నిజ రూపమైన ఆదిపరాశక్తి అవతారము దాల్చి మహా శివుని ముందు తన శక్తితో 10 అవతారాలతో 10 వైపులా (ఎనిమిది దిక్కులు, పైన క్రింద (భూమి, ఆకాశము) మొత్తం పది దిక్కులు) శివుని అడ్డుకుంది. ఈ 10 అవతారాలే దశ మహావిద్యలుగా ప్రసిద్ధి పొందాయి.

ప్రతి అవతారమునకు ఒక పేరు, కథ, లక్షణము మరియు మంత్రము ఉన్నది. ఈ అవతారాలలో అమ్మవారు ఒక వైపు భయంకర రూపంతో కనిపిస్తూనే మరోవైపు అందమైన శక్తి స్వరూపిణిగా సర్వ విద్యలకు అధినాయకిగా చెప్పబడినది.

## దశమహావిద్యల ఆవిర్భావం



శ్రీ ఆదిశక్తి అవతారాలు భూలోకంలో ఎన్నో ఉన్నట్లుగా వివిధ పురాణాలు పేర్కొంటు న్నాయి. ఇలా జగన్మాత ధరిం చిన అన్ని రూపాల్లో "దశ మహావిద్యలు" అనే పది రూపాలు ఎంతో విభిన్నమైనవిగా, విశిష్ట మైనవిగా లోకంలో ప్రసిద్ధి పొందాయి. పూర్వం దుర్గాదేవి లోకాలని కాపాడాలని దేవతల్ని ఉద్ధరించా లని దుర్గముడితో యుద్ధానికి ఉపక్రమించింది. దేవీ దుర్గముల మధ్య భయంకరంగా యుద్ధం కొనసాగుతున్న సమయంలో దేవీ శరీరం నుంచి ఒక్కసారిగా ఈ దశమహావిద్యలు ఆవిర్భవించాయని చెబుతారు.

## చింతామణి ద్వీప నివాసిని

శ్రీదేవి భాగవతంలోని 12వ స్కంధంలో ఆదిపరాశక్తి కొలువుండే మణిద్వీపంలోని నవరత్న ప్రాకారంలో ఈ దశమహావిద్యలన్నీ కొలువుదీరి ఉంటాయని చెప్పటం జరిగింది. దీనిని బట్టి చింతామణి ద్వీప నివాసిని అయిన ఆదిపరాశాక్తికి అత్యంత సమీపంలో నివసించే ఈ మహాశక్తులే దశమహావిద్యలని తెలుస్తుంది. అందుకే ఈ మహావిద్యలకి ఇంత గొప్ప ప్రాముఖ్యత లోకంలో కలిగింది.

## శాక్త తంత్రములో ముఖ్యమైన విద్యలు

శాక్తతంత్రములో ఎందరు దేవతలున్నా ముఖ్యముగా ఉపాసింపబడే వారు దశమహావిద్యలు. అచింత్యము, అవ్యక్తము అయిన చైతన్యమును ఈశ్వరుడు అంటుంది తంత్రము. అదే చైతన్యము కదలికను పొంది త్రిగుణాత్మికగా మారి సృష్టిస్థితిలయములను చేస్తున్నపుడు శక్తి అవుతుంది. ఆ శక్తి ప్రపంచమును నడిపించుటకు పది రూపాలుగా ఉంటుంది. ఆ పదిరకములైన శక్తులే దశమహా విద్యలు.

## దశ మహావిద్యా దేవతలు



కాళి, తార, షోడశి, భువనేశ్వరి, భైరవి, ఛిన్నమస్త, ధూమవతి, భగళా ముఖి, మాతంగి, కమలాత్మిక అన బడువారే దశ మహావిద్యలు. వీరు కేవలము బాహ్య ప్రపంచము నందే గాక అంతర్ ప్రంచమున కూడా అధివసించి ఉంటారు. కనబడే బాహ్య ప్రపంచముగాని, కనపడని ఆంతరిక ప్రపంచముగాని వీరి ఆధీనములోనే నడుస్తూ ఉంటాయి. వీరిని సాధనామార్గమున దర్శించ వచ్చు. వీరి అనుగ్రహమును పొందవచ్చు. దానితో ప్రపంచమున అసాధ్యములైన కార్యములు సాధించవచ్చు. వీరు శక్తులు. అనగా శక్తి శరీరము కలిగిన చైతన్య పుంజములు.

## ప్రతి అవతారమునకు ఒక ప్రత్యేకత



దశమహావిద్యలు పేరుకు తగ్గట్టుగ అపారమైన జ్ఞాన మూర్తులుగా తెలుపబడ్డారు. ప్రతి ఒక అవతారము ఒక ప్రత్యేకతను కలిగి ఉంది. ఆధ్యాత్మికతను సంతరించుకున్నవారికి ఈ దశమహావిద్యలు ఎంతో ప్రేమ, ధైర్యము, జ్ఞానముతో కనిపిస్తాయి. తాంత్రికులకు ఆరాధ్య దేవతలుగా ఈ పది మంది దేవతలు ప్రాముఖ్యం చెంది ఉన్నారు. వీరిలో మొదటి ఐదుగురు దేవతలు ఉగ్రదేవతలుగా గుర్తించబడ్డారు. కానీ వారు నిజానికి దయామయులుగా ఉంటారు. మిగిలిన ఐదుగురు దేవతలు శాంత స్వరూపులుగా కనిపిస్తారు. దశమహావిద్యలు అని పేర్కొనబడిన పది మంది ఆదిపరాశక్తి అంశల యొక్క కథలు, మంత్రాలు మరియు ఆ దేవతల యొక్క స్వరూపాల గురించి నియమ బద్ధంగ పఠించినపుడు ఆయా మంత్రాల యొక్క అధిష్టాన దేవతలయిన దశమహావిద్యలు అనుగ్రహిస్తాయి అని చెబుతారు.

## ఐహిక లాభమునకే ఉపాసన

జగన్మాత భుక్తిముక్తి ప్రదాయిని. అనగా ఐహిక లాభములను ఆముష్మిక లాభములను కూడా సమముగా ప్రసాదించగలదు. ఎక్కువగా మానవులు ఈ శక్తులను ఐహికలాభముల కోసమే ఉపాసించటం కనిపిస్తుంది.

## జాతకములోని చెడులను నిర్మూలించే మాత

జాతకములో బలం లేకపోవటం పూర్వజన్మల చెడుకర్మ వల్ల కలుగుతుంది. దానిని పోగొట్టుకొని సుఖశాంతులతో జీవితం గడపవలె నని ప్రతివానికీ ఉంటుంది. దానికి దైవబలం తప్పనిసరిగా కావాలి. దశమహావిద్యల ఉపాసనద్వారా జాతకములోని చెడును నిర్మూలించు కోవటం సాధ్యం అవుతుంది. శక్తి అనుగ్రహం వల్ల పూర్వకర్మల చెడు ప్రభావం భస్మీపటలం అవుతుంది. కనుక దోషాన్ని బట్టి ఏ దేవతా ఉపాసన అవసరమో చూచుకొని దానిని ఆచరించడం ద్వారా సుఖ శాంతులతో కూడిన జీవితాన్ని పొందవచ్చు అని దశమహావిద్యల ఉపాసకులు చెబుతారు.

## సృష్టి రహస్యానికి ప్రతీకలు

సత్తు అసత్తు తానైన, అవ్యక్తమైన పరమేశి తత్త్వము పదివిధములైన నామరూపములుగా వ్యక్తపరచు లీలయే దశమహాశక్తులు. ఇవి సృష్టి



రహస్యానికి ప్రతీకలు. నానాత్వ ఏకత్వరూపములు అమ్మ స్వేచ్ఛా లీలలు. పరమేశ్వరి సంకల్ప ప్రతీకలు. స్థూల-సూక్ష్మ అండ-పిండ-బ్రహ్మాండ పరిపాలనలో అమ్మకు సహాయపడు అదృష్ట-అద్భుత శక్తులు. నవగ్రహాధి దేవతలుగా, నానా రూపధారులుగా, కఠినత కారుణ్యము రూప స్వభావ ములుగా కొన్ని శక్తులు, మనోహరత మాధుర్యము మూర్తీభవించిన మాతృస్వరూపములుగా మరికొన్ని శక్తులు, ఘోర-అఘోర రూపములను సమయ సందర్భములను అనుసరించి ధరించుచున్న దయార్ద్రశక్తులే దశ మహావిద్యలు. సత్వగుణసంపన్నమైన ఆధ్యాత్మిక భావనయే ఆదిపరాశక్తి. తల్లి ధర్మపరిరక్షణకై పరిసరాలను తానే సృష్టించుకొని, వానికి అనుగుణముగా ఉండే రూపములో అయిన ప్రకటనమే దశమహాశక్తుల ఆవిర్భావము.

## దశావతారాలే మహావిద్యలుగా భావన



నారాయణుని దశావతారములే దశమహావిద్యలుగా భావిస్తారు. స్త్రీ పురుష భేదము మన చర్మ చక్షువులకు మాత్రమే. మాయ తొలగిన కన్నులకు మాధవ తత్త్వము అర్థమవుతుంది. పంచ భూత, పంచేంద్రియ పరిరక్షణ బాధ్యతా నిర్వాహకమూర్తులు ఈ దశ మహావిద్యలు. సూక్ష్మరూపములో పరిశీలిస్తే ఈ దశమహావిద్యలు మానవ దేహమున వివిధ చక్రములను కుండలినీ శక్తిద్వారా వ్యాపింపచేయుచూ, శక్తివంతము చేయుచున్నదన్న మాట యోగసాధకులు అంగీకరించినదే.

## అంతర్యాగము, బహిర్యాగము

అంతర్ముఖ సమారాధ్యా, బహిర్ముఖ సుదుర్లభ అయిన తల్లిని చక్రములు, యంత్రములు, విగ్రహరూపములలో ఆరాధిస్తే బహిర్యాగము అంటారు. మన శరీర చక్రములుగా భావించి, నీవారసూక మాత్రమైన తల్లిని గుర్తించి చేసే ఆరాధనను అంతర్యాగము అంటారు.

## ఉగ్ర శక్తులు, సౌమ్య శక్తులు

దశ మహాశక్తులలో కొన్ని ఉగ్ర తత్త్వము కలవి. మరికొన్ని సౌమ్య తత్త్వము కలవి (ఘోర–అఘోర). ఉగ్రతత్త్వ శక్తులు కాళి కులమునకు

సంబంధించినవి. సౌమ్య శక్తులు శ్రీకులమునకు సంబంధించినవి. సౌమ్యశక్తులను సంప్రదాయబద్ధమైన దక్షిణాచార మార్గములో ఆరాధిస్తారు. ఉగ్రశక్తులను సంప్రదాయ విరుద్ధమైన వామాచార పద్ధతిలో ఆరాధిస్తారు. కొన్ని విద్యలు ఘోర, అఘోర రూపములలో సమయమును బట్టి ప్రకటితమైన వేళ వాటిని ఉభయ పద్ధతులలోను ఆరాధిస్తారు.

## ఎవరు గొప్ప?



దశ మహావిద్యలలో ఎవరికీ వారే గొప్పవారు. ఎవరికి వారే పరమ శక్తి వంతులు. ప్రసాద గుణ సంపన్నులు. ఎవరిని ఉపాసించి నను ముక్తి ప్రసాదకులే. వీరు ప్రత్యేక దేవతలు కారు. జగన్మాతయగు ఆద్యాశక్తి యొక్క వివిధ రూపములు. కనుక ఎవరిని ఉపాసించినా భుక్తి ముక్తులను ఇవ్వగలరు. కాని వారివారి లక్షణములను బట్టి ఒక్కొక్క ప్రత్యేక వరమును అధికముగా ఇవ్వగలరు. కనుక జాతకమున గల ఒక్కొక్క దోషమునకు ఒక్కొక్క మహావిద్య ఉపాసన ఉత్తమము అని తెలియుచున్నది.

## సాత్త్విక, రాజసిక దేవతలు



రవి కుజులు రాజసిక గ్రహములు. కనుక త్రిపుర భైరవి, బగళాముఖి రాజసిక దేవతలు. వీరు ఉగ్రరూపులు. వీరి ఉపాసన కష్టతరము. ఇక బుధ చంద్రులు మిశ్రమ గ్రహములు. అనగా వారి స్థితిని బట్టి మంచీ చెడూ రెండూ చేయగలరు. కనుక మాతంగి, భువనేశ్వరి అనువారు వీరికి అధిదేవతలు. వీరి ఉపాసన సాత్వికమునకు, రాజసమునకు మధ్యస్తంగా ఉంటుంది. ఇక మిగిలినది శనీశ్వరులు. వీరికి కాళి అధిదేవత. రాహుకేతువులకు ఛిన్నమస్త, ధూమావతులు అధిదేవతలు. వీరి ఉపాసన బహు కష్టతరము. వివిధ ఆటంకములు, భయమును గొలిపే పరీక్షలతో కూడి ఉంటుంది. అంత మాత్రాన వీరిని తామసిక దేవతలు అనుట తప్పు.

## తత్వప్రకారము విభజన

ఈ దశ మహా విద్యల తత్వాన్ని చూస్తే, అవి ఇలా సూచిస్తాయి.

కాళీ, ఛిన్నమస్త – కాల పరిణామము.

తార, మాతంగి – వాక్కు, వ్యక్తావ్యక్తము.

త్రిపుర సుందరి, కమల – ఆనందము, సౌందర్యము.

భువనేశ్వరి, ధూమావతి – అంతరాళము, అతీత పరబ్రహ్మ శక్తి.

భైరవి, బగళాముఖి – శక్తి, గతి, స్థితి.

## దశమహావిద్యలను సామాన్యులు ఆరాధించవచ్చా?



దశ మహావిద్యలను నిరభ్యంతరంగా ఎవరైనా ఆరాధించవచ్చు. అమ్మను కొలవడానికి అందరూ అర్హులే. కానీ వామాచార పద్ధతులలో దశ మహా విద్యలను ఆరాధించదలచినవారు ముందుగా ఉపాసకులను, గురువులను దర్శించి విధి విధానాలను తెలుసుకోవడం మాత్రం తప్పనిసరి. ఈ పుస్తకములో అటువంటి వామాచార పద్ధతులు ఎక్కడా పేర్కొనలేదు.

ఈ దశ మహావిద్యల యొక్క స్తోత్రాలు, హృదయం, కవచం, అష్టోత్తరం, సహస్రనామము.. మొదలగు వాటిని పారాయణ చేయుటకు గురూపదేశంతో పనిలేదు. స్త్రీ పురుష, వయో భేదం లేకుండా అందరూ నిర్భయంగా ఏ సమయంలోనైనా పారాయణ చేసి ఆ ఆదిశక్తి అనుగ్రహాన్ని పొందవచ్చును.

## ఆరవ మహావిద్య శ్రీ ఛిన్నమస్త దేవి

దశ మహావిద్యలలో 6వ మహావిద్య శ్రీ ఛిన్నమస్తాదేవి. దుర్గాదేవి తాంత్రిక స్వరూపమే ఈ ఛిన్నమస్తా అవతారం. ఛిన్నమస్తా దేవిని శక్తి యొక్క రౌద్ర రూపంగా కొలుస్తారు. ఛిన్న అనగా ఖండించబడిన మస్త అనగా శిరస్సు అని అర్ధం. అనగా "ఖండింపబడిన శిరస్సు" అని అర్థం.



ఛిన్నమస్త ప్రాణదాత మరియు ప్రాణహర్త. ఈమెను లైంగిక వాంఛపై స్వీయ నియంత్రణకు చిహ్నంగా లైంగిక శక్తిస్వరూపిణిగా భావిస్తారు. ఛిన్నమస్త నగ్న రూపంలో చుట్టూ పరుచుకున్న కురులతో నలుపు మరియు రుధిర వర్ణ దేహం కలిగి ఉంటుంది. ఆమె పదహారేళ్ళ ప్రాయంలో నిండైన వక్షం కలిగిన బాలికగా, హృదయం వద్ద నీలి కలువ కలిగి ఉంటుంది.

ఈ దశమహావిద్యా మాతలకు సంబంధించిన జననం, అవతార రహస్యం, పూజా విధానాలు, అనుగ్రహం చూపే విధానాలు, ఉపాసనా మార్గాలు మొదలైన ఈ పుస్తకంలో పేర్కొన్న అనేక విషయాలు; ఆయా దేవతలకు సంబంధించిన స్తోత్రాలు, ప్రార్థనలు, ధ్యానాలు, కవచాలు, హృదయాలు, అష్టోత్తరాలు... మొదలైన అన్ని విషయాలకు సంబంధించిన విషయసేకరణకు మాకు అనేక గ్రంథాలు, మాస, పక్ష, వార, దిన పత్రికలు, అంతర్జాలము ఎంతగానో సహకరించినది. ఈ విధముగా లభ్యమైన సమాచారమునకు తగిన పటములను జోడించి మీకు సంకలనముగా అందించాము. ఆయా మూల రచయితలకు, వ్యాసకర్తలకు పేరు పేరునా ధన్యవాదాలు తెలుపుకొంటున్నాము. తప్పులు దొర్లకుండా ఉండుటకు అనేక జాగ్రత్తలు తీసుకొన్నాము. అయినా అక్కడక్కడా కొన్ని అక్షర దోషాలు, భావ దోషాలు దొర్లి ఉండవచ్చును. సహృదయులైన పాఠకులు అలాంటి దోషాలను మా దృష్టికి తెచ్చినచో మా తరువాతి ముద్రణలో వీటిని తప్పక సరిచేసుకొనగలము.

మా పాఠకులు అందరికీ దశమహా విద్యలకు ఆదిదేవత అయిన మాత అనుగ్రహం కలగాలని, తద్వారా వారు తమ జీవితంలో అమృత స్థానాన్ని పొందాలని ఆశిస్తూ...

- నిత్య పబ్లికేషన్స్



# విషయసూచిక



# శ్రీ ఛిన్నమస్తా దేవి

**దశ మహావిద్యలలో 6వ మహావిద్య శ్రీ ఛిన్నమస్తాదేవి.** దుర్గాదేవి తాంత్రిక స్వరూపమే ఈ ఛిన్నమస్తా అవతారం. ఈమెనే ప్రచండ చండిక, వజ్ర వైరోచినీ అని కూడా పిలుస్తారు. ఉత్తర భారతదేశంలో చింతపుర్ణీ



అని పిలుస్తారు. వైశాఖ మాసం శుక్లపక్ష చతుర్థి తిథి ఈ దేవికి ప్రీతి పాత్రమైంది. శాక్తేయ సంప్రదాయంలో ఛిన్నమస్తాదేవికీ ఎంతో ప్రశస్తి వుంది. ఈ మాతను నాడి త్రయ రూపిణిగా భావిస్తారు. ఈ దేవిని నిష్టతో ఉపాసిస్తే సరస్వతీసిద్ధి, శత్రువిజయం, రాజ్యప్రాప్తి, పూర్వజన్మ పాపాలనుంచి విముక్తి లభిస్తుంది. అంతేకాదు, ఎటువంటి కార్యాలనైనా అవలీలగా సాధించే శక్తి ఈ దేవి ప్రసాదిస్తుంది అని నమ్ముతారు.

తాంత్రిక బౌద్ధ మతంలో ఈమెను ఛిన్నముండ అని పిలుస్తారు. ఛిన్నమస్తా దేవిని శక్తి యొక్క రౌద్ర రూపంగా కొలుస్తారు. ఛిన్న అనగా ఖండించబడిన మస్త అనగా శిరస్సు అని అర్ధం. అనగా "ఖండింపబడిన శిరస్సు" అని అర్ధం. ఈ హిందూ ఆధ్యాత్మిక అమ్మవారు భీతికరమైన ప్రతిరూపంతో చిత్రీకరింపబడినది. ఆమె జన్మదినాన్ని "ఛిన్నమస్త జయంతి"గా జరుపుకుంటారు. ఇది ప్రతి సంవత్సరం వైశాఖ మాసంలో శుక్లపక్ష చతుర్ధశి నాడు వస్తుంది.

హిందూమతంలో ఉన్న దేవతలలోకెల్ల అత్యంత ఉగ్రరూపంతో ఉండే దేవతలలో ఛిన్నమస్త ఒకరు. స్వీయ శిరచ్ఛేదం చేసుకున్న ఈమె ఒక శక్తిపీఠ దేవత. ఛిన్నమస్త ప్రాణదాత మరియు ప్రాణహర్త. మహా విద్యలలో ఒక దేవతగా కొలువబడే ఈమెను లైంగిక వాంఛపై స్వీయ నియంత్రణకు చిహ్నంగా లైంగిక శక్తిస్వరూపిణిగా భావిస్తారు.

ఈ దేవత యొక్క రూపము అనేక లక్షణాలను సూచిస్తుంది. అవి శృంగారం, మరణం, సృష్టి, వినాశనం మరియు పునఃసృష్టి. పురాణాల ప్రకారం ఆమె తన మాతృభావనలతో చేసిన త్యాగానికి, తన లైంగిక ఆధిపత్య ధోరణికి మరియు స్వీయ వినాశకారక రౌద్రానికి ప్రతీక. ఆమె

తీరు రౌద్రం మరియు బీభత్సంతో కూడుకుని వుంటుంది. కనుక ఆమెను అన్ని చోట్ల పూజించరు. ఆమెకు సంబంధించిన దేవాలయాలు ఎక్కువగా ఉత్తరభారతం మరియు నేపాల్‌లో ఉంటాయి. ఆమెను హిందువులు మరియు బౌద్ధమతం వారు పూజిస్తారు. బౌద్ధ మతంలో ఈమెను ఛిన్న ముండ అని పిలిచే దేవత ఛిన్నమస్తను పోలి ఉంటుంది. ఛిన్నముండ, వజ్రయోగిని పేరుతో టిబెట్‌కు చెందిన బౌద్ధమతం వారు కొలిచే ఖండిత శిరస్సు కలిగిన దేవత.

## ఛిన్నమస్త రూపం



ఛిన్నమస్త నగ్నరూపంలో చుట్టూ పరుచుకున్న కురులతో నలుపు మరియు రుధిర వర్ణ దేహం కలిగి ఉంటుంది. ఆమె పదహారేళ్ళ ప్రాయంలో నిండైన వక్షం కలిగిన బాలికగా, హృదయం వద్ద నీలి కలువ కలిగి ఉంటుంది. ఛిన్నమస్త ఒక నగ్న జంటపై నిలబడి ఉంటుంది. ఆ జంటను శృంగార దేవదంపతులైన రతిమన్మధులుగా చెప్తారు. ఛిన్నమస్త జంధ్యంగా సర్పాన్ని ధరించి, మెడలో మహాకాళి వలే కపాలాలు, ఎముకలతో కూడిన దండను ధరించి ఉంటుంది. ఆమె ఖండిత కంఠం నుండి చిమ్ముతున్న రక్తధారలను, ఆమె సేవకురాళ్ళయిన జయ మరియు విజయ నోట్లోకి ప్రవహిస్తుంటాయి. ఆమె ఎడమచేతిలో ఆమె కపాలంతోనే చేసిన భిక్ష పాత్ర, కుడిచేతిలో ఆమె తన శిరస్సు ఖండించడానికి ఉపయోగించిన ఖడ్గం ఉంటాయి.

## కుడి ఎడమల ఎరుపు, నలుపు

డాకిని ఎడమ వైపున నల్లగా ఉంటుంది, వర్ణిని కుడి వైపున ఎరుపు రంగులో ఉంది. చిన్నమస్తా, మధ్యలో, తెల్లగా ఉంటుంది. నలుపు, ఎరుపు మరియు తెలుపు మూడు గుణాలు లేదా ప్రాథమిక సార్వత్రిక శక్తులను సూచిస్తాయి. చిన్నమస్తా యొక్క తెల్లదనం ద్వారా సూచించబడే సత్వ గుణాలలో ఎత్తైనది. అయితే ఈ మూడింటినీ ప్రకృతికి చెందినవి. ప్రకృతి యొక్క అన్ని భౌతిక స్థితి యొక్క సూత్రం. విశ్వం యొక్క గొప్ప ప్రదర్శనగా వైవిధ్యీకరణ శక్తి ఏర్పడుతుంది.

## రక్త ధారలకు అర్థం



చిన్నమస్తా మెడ నుండి వెలువడే రక్తం అన్ని జీవితాలను నిలబెట్టే జీవిత శక్తి (ప్రాణ) లేదా విశ్వశక్తిని సూచిస్తుంది. ఛిన్నమస్తా మెడ నుండి వెలువడే మూడు ధారలలో మధ్యదారా ప్రవాహం చిన్నమస్తా సొంత నోటిలోకి ప్రవహిస్తుంది. ఆమె ఉనికి స్వయం సిద్ధమని మరొకరిపై ఆధారపడి ఉండదు అనే అర్థాన్ని సూచిస్తుంది. ఆమె పరిచారకుల నోటిలోకి ప్రవహించే మిగిలిన రెండు రక్త ప్రవాహాలు అన్ని జీవులలోని ప్రాణశక్తి ప్రవాహాన్ని సూచిస్తాయి అని చెబుతారు.

## లింగపురాణం ప్రకారం అమ్మవారి కథ




ఛిన్నమస్త అమ్మవారికి ఇద్దరు సహచారికలు ఉంటారు. ఒక్కరి పేరు జయ మరొకరి పేరు విజయ (ఈ పేర్లు ప్రాంతం బట్టి మారుతుంటాయి) రాక్షసులను చంపడానికి అమ్మవారు కాళికా రూపాన్ని ధరించి అసురసంహారం చేస్తున్నపుడు ఈ సహచారికలు కూడా అమ్మవారికి సహాయంగా యోగిని శక్తిని ఆవాహన చేసి యుద్ధంలో సహాయం చేస్తారు. ఆలా అమ్మవారు యుద్ధం ముగించుకొని సాత్విక రూపాన్ని ధరించి మీకు ఏ వరం కావాలో కోరుకోమని యోగినులకు అడుగగా వారు యుద్ధంలో రాక్షస సంహారం చేస్తూ రక్తం తాగుతూ ఉన్నాం కానీ మాకు ఇంకా దాహంగా ఉంది. మా రక్తదాహాన్ని తీర్చమని అమ్మవారిని వేడుకొనగా అమ్మవారు కపాల మాల రక్తవర్ణ దేహంతో స్త్రీ పురుష మిధునం పై వస్త్రరహితంగా ఉంటూ తన ఖడ్గంతో తన తలనరికి ఎడమచేతిలో పట్టుకొనగా అమ్మవారి మెడ నుండి రక్తపు ధరలు మూడు పాయలుగా బయటకు వచ్చాయి. అలా వచ్చిన రక్తాన్ని రెండు పాయలు ఇద్దరు యోగిని దేవతలకు పంచుతూ తనరక్తాన్ని తానే స్వయంగా తాగుతూ కనిపిస్తుంది.

## మరొక కథ ప్రకారం

ఇంకొక కథ ప్రకారం ఛిన్నమస్త రతిమన్మథుల నగ్నజంట పై నిలబడి ఉంటుంది. అలా నిలబడిన ఆమె తన భౌతిక శరీరంపై పూర్తి నియంత్రణతో తన శరీరం నుండి మనస్సును విముక్తం చేసుకోవడం కొరకు శిరస్సు ఖండించుకుంటుంది.

## పాంచరాత్రంలో ఛిన్నమస్తా పుట్టుక వృత్తాంతం



అమ్మవారి పుట్టుకకు సంబంధించి నారద పాంచరాత్రంలో ఒక కథ చెప్పబడి వుంది. సతిదేవి పరిచారికలైన ఢాకిని మరియు వర్ణినులతో కలిసి అమ్మవారు మందాకిని నదిలో స్నానానికై బయలు దేరారట. స్నానాది కాలు పూర్తిచేసుకున్న ముగ్గురూ హిమాలయ విహారానికై బయలు దేరారు. కానీ మధ్యలో తీవ్రమైన ఆకలి గొన్న పరిచారికలు తమ క్షుద్బాధను తీర్చ మని అమ్మను వేడుకున్నారు. కైలాస పర్వతం చేరగానే ఆకలి తీరుస్తానని అమ్మ చెప్పినా వారు శాంతించక చాలా ఆకలితో ఉన్నామని అన్నపూర్ణ యైన ఆదిపరాశక్తే ఆగమంటే ఎలా అని అమ్మను పరిపరివిధాలా వేధించ సాగారు. చివరకు కారుణ్య జలధి అయిన అమ్మ తన నఖములతో తన తలను ఖండించుకొన్నది. అప్పుడు అమ్మ శరీరం నుండి మూడు రక్తధారలు వెలువడ్డాయి. అందులో రెంటిని

ఢాకిని మరియు వర్ణినులు అందుకోగా మూడో ధారను అమ్మ తల గైకొంది. అమ్మవారు ఒకచేత్తో తన తలను పట్టుకోగా మిగిలిన చేత్తో కత్తిని పట్టుకుంటుంది.

## ఛిన్నమస్తా మంత్రం



ఛిన్నమస్తను జీవిత చక్రంలోని మూడు దశలైన జన్మ, రతి మరియు మృత్యువు అనే దశలకు చిహ్నాలుగా మూడు రూపాంతరాలలో సేవిస్తారు. ఛిన్నమస్త ఇంట్లో కొలుచుకునే ప్రత్యేక దేవతగా అంత ప్రసిద్ధి చెందలేదు. తాంత్రికులు అతీంద్రియ శక్తులు మరియు సిద్ధి ప్రాప్తి కొరకై ఈమెను ఉపాసిస్తారు. ఛిన్నమస్త దుర్గాదేవి యొక్క తాంత్రిక స్వరూపము, ఈమె రూపము అనేక లక్షణాలకు చిహ్నంగా కనిపిస్తుంది. ఆమెను ప్రసన్నం చేసుకోవడానికి శ్రీం హ్రీం క్లీం ఐం వజ్రవైరోచనియే హుం హుం ఫట్ స్వాహా అనే మంత్రం పాటించాలి. ఛిన్నమస్తాదేవి మంత్రానికి చాలా శక్తి ఉంది ఒక రీతిన మంత్రిస్తే అనుకున్నది నెరవేరుతుంది, అదే మంత్రాన్ని తల క్రిందులుగా పఠిస్తే ప్రాణాంతకమైన బాణామతి లేదా చిల్లంగి మంత్రంగా మారుతుంది అని చెబుతారు.

## బౌద్ధం ప్రకారం ఛిన్నముండ

బౌద్ధుల కథనం ప్రకారం మానవుని మనస్సులో అహంకారం మరియు మూర్ఖత్వం ఖండించటానికి ప్రతీకగా ఛిన్నముండ తల ఖండించ బడింది. మోక్షాన్ని పొందుటకు ముందుగా మనిషి తనలోని అహం కారాన్ని అరికట్టాలి. వామాచారము మరియు చేతబడులు చేయు తాంత్రి కులు శత్రువులను చంపటానికి, వారి సంపదలను నాశనం చేయుటకు ఈ ఛిన్నమస్తా దేవిని ప్రయోగిస్తారు. కానీ, బౌద్ధ తాంత్రికులు మోక్షాన్ని ప్రసాదించే దేవతలా పూజిస్తారు.

## బౌద్ధ ప్రకారం ఛిన్నముండ పుట్టుక



బౌద్ధ గ్రంథాలు బౌద్ధ చిన్నముండ పుట్టుకను వివ రిస్తాయి. ఒక కథ కృష్ణచార్య శిష్యుల గురించి చెబు తుంది. ఇద్దరు మహాసిద్ధ (గొప్ప పరిపూర్ణులు) సోదరీ మణులు మేఖాల, కనఖల తలలు కత్తిరించి, వారి గురువుకు అర్పించి ఆపై నృత్యం చేశారు. దేవత వజ్రయోగిని కూడా ఈ రూపంలో కనిపించి వారితో కలిసి నృత్యం చేసింది. మహాసిద్ధ యువరాణి లక్ష్మింకర, రాజు ఇచ్చిన శిక్షగా ఆమె తలను నరికి, దానితో నగరంలో తిరుగుతూ ఉండగా పౌరులు ఆమెను చిన్నముండ–వజ్రవరాహి అని స్తుతించారు.



## ఇంద్రియాలపై విజయానికి గుర్తు



ఈ అమ్మవారిని ఉపాసించే సాధకునకు అమ్మవారు ఇంద్రియాల పై విజయాన్ని కల్గిస్తుంది. అదే వామాచారంలో చాలా ముఖ్యం. అదే ప్రధమ దశలో సాధకునకు కావలసినది. చిన్నమస్తా దేవి ఇంద్రియ సౌఖ్యం నుండి ఇంద్రియ నిగ్రహం కల్గిస్తుంది. ఈ అమ్మవారిని ఎవరు ఆరాధిస్తారో వారికీ అనేక చిత్రాలు విచిత్రాలు చూపించి ఏవి శాశ్వతం కాదు అని తెలియ చెపేదే ఈ అమ్మవారు నేర్పే విద్య.



## అమ్మవారి స్తోత్రాలు



ఈ అమ్మవారు ఇచ్చే ఐశ్వర్య సంపదలు వర్ణనాతీతం. ఈ అమ్మవారి అష్టోత్తర శతనామావళి స్వయంగా పరమేశ్వరునిచే చెప్పబడినది. ఈ అమ్మవారి స్తోత్ర పఠనాదులు ఉగ్ర అమ్మవారుల దేవాలయాలలో చెయ్యాలి. సాత్విక దేవతల సమక్షంలో నిర్వహించకూడదు అంటారు.



## ఛిన్నమస్త ఉపాసకులు



హిరణ్యకశిపుడు, వైరోచనుడు చిన్నమస్త ఉపాసకులు. వజ్రనాడి లో శక్తి ప్రవాహం ఉండటంలో అమ్మవారిని "వజ్రవైరోచని" అని పిలుస్తారు. వైరోచనుడుని అగ్ని అని పిలవబడతాడు. అగ్ని స్థానమైన మణిపూర చక్రంలో చిన్నమస్త అమ్మవారిని ధ్యానిస్తారు.



## కావ్యకంఠ గణపతిముని ప్రకారం ఛిన్నమస్తా దేవి



"కాళీ", "ఛిన్నమస్తా" తత్వాలు ఒక్కటే, అయితే వీరిలో కొంచెం భేదం వుంది. కాళీదేవి శరీరంలో అంతటా వ్యాపించే "విద్యుచ్ఛక్తి" అయితే, శరీరంలో కేవలం వెన్నుపామును – కుండలిని "సుషుమ్నా నాడిని" పట్టుకొని ఉండేది ఛిన్నమస్త. పరిణామాల్ని కల్పించే విద్యుచ్ఛక్తి కాళిదైతే ఆయుధంలాగా మారి "వజ్రాయుధంగా ఉపయోగపడేది ఛిన్న మస్త". అందుకే ఆమెకి "వజ్రవైరోచని", "ప్రచండ చండిక" అని, "ఇంద్రాణి" అని, "మధ్యమా" అని పిలుస్తారు. చిన్నమస్తా అనునది బృహదారణ్యంలో చెప్పబడిన జ్యోతివిద్య అని గణపతి స్వామివారు వివరించారు.

## ఛిన్నమస్త యోగశాస్త్ర రహస్యము

మన ప్రాణాన్ని ఆవేశించి ఉన్న కుండలినీ స్వరూపమే కాళి. యోగుల యందు అత్యంత సూక్ష్మమై సుషుమ్నగా పైకి వెళుతున్నప్పుడు ఆ కాళినే ప్రచండ చండిక అంటారు. అదియే యోగులలో ఛిన్నమస్తాగా ఉన్నేయ భూమికలలో అవుతుంది. దీన్ని ఛిన్నమస్తా అనటానికి కారణము రెండు కపాలములను ఇది భేదిస్తుంది. మరణ కాలములో కపాల మోక్షము అవుతుంది అది కాదు ఇది. జీవితకాలములోనే బ్రహ్మకచ్ఛమనే కపాలము ఒకటి బ్రహ్మపుచ్ఛమనే కపాలము ఒకటి. రెండింటిని భేదించకలది కాబట్టి ఇది ఛిన్నమస్తా. ఈ కారణముచేతనే మూలాధారమునందు తేజోలింగ

స్వరూపముగా బ్రహ్మకచ్ఛమనే బ్రహ్మరంధ్రములోనుండి అమృత ధారలు కురుస్తూ ఉంటే ఆ అమృతం గడ్డకట్టి తేజస్సుగా ఒక స్వయంభూ లింగమయితే ఆ లింగానికి మూడున్నర చుట్టూ చుట్టుకొని ఒక తలను లింగము యొక్క రంధ్రము పైన పెట్టి రెండవ తలతో అమృతధారల్ని పీలుస్తూ ఉంటుంది కుండలిని అని చెప్పారు. స్వాధిష్టాన ములోవున్న అగ్నిజ్వాలలు దీనికి తగులగానే ఆ రెండు తలల్ని కూడ పైకి పెట్టి అది పైకి వెళ్ళింది. అప్పుడు అది భిన్న కపాలము అంటే రెండు కపాలములు అన్నది ఒక చిన్న యోగ శాస్త్ర రహస్యము. ప్రాణ సమానములు, వ్యాన అపానములు రెండింటిని రెండు తలలుగా భావిస్తే వాటి సంఘట్టనములో నుండి అంటే వాటి తలలు రెండు ఛిన్నములైతే అందులోనుండి సుషుమ్న అనే ప్రచండచండి అనే పరాశక్తి ఉదయిస్తుంది. తన తలలను ప్రాణరూపిణిగా తానే ఖండితము చేసుకొని ఆ తలలను పట్టుకొని (అంటే సుషుమ్న అవి అంతర్నిఖితముగా చేసుకొని అని అర్ధము) పైకి వెళుతుంది కాబట్టి యోగుల యందు ఛిన్నమస్తా అంటే సుషుమ్న అని అంటారు.

## రేణుక - ఛిన్నమస్త



రేణుక దేవి పరశురాముని కన్న తల్లి. జమదగ్ని మహాముని ఇల్లాలు. ఈ అమ్మవారు చాల శక్తివంతమైన అమ్మవారు. ఈ అమ్మ వారిని ఎల్లమ్మ తల్లిగా అది జోగులదేవిగా వజ్రవైరోచని (చిన్న మస్తా) దేవి అని పిలుస్తారు. ఈ అమ్మవారి కృప ఉంటె మనకు భవిష్యత్తులో

జగరగబోయే విషయాలు కూడా తెలుస్తాయి అని నమ్మకము. ఈ అమ్మవారిని ఎరుక చెప్పే అమ్మవారు అనికూడా అంటారు. ఈ అమ్మవారు వరి చేనులో ఉంటె వరిగంటల ఎల్లమ్మ అని, అమ్మవారిని నగ్నంగా పూజించే వారు నగ్న ఎల్లమ్మ అని, మావురాల ఎల్లమ్మ అని బ్రాహ్మణుల ఇంటి ఎల్లమ్మ అని రక రకాలుగా పిలుస్తారు. ఈ రేణుక దేవి శబరిమలై అయ్యప్ప స్వామి 18 మెట్ల అధిష్ఠాన దేవీలలో ఒకరు అని చెబుతారు.

## ఛిన్నమస్త అవతార రహస్యం



ఛిన్నమస్తాదేవి రూపం చూడ గానే భయంగొలిపే విధంగా ఉంటుంది. కానీ ఆమె తాంత్రిక రూపం వెనుక తాత్వికత తెలుసుకుంటే శరీరం పులకరించకమానదు. ఆమె మైథునం జరుపుతున్న ఒక జంట పై నిలబడి ఉంటుంది. కామాన్ని జయించిన నిష్కామ తత్వానికి అది ప్రతీక. దిగంబరియై ఉండటం బాహ్య విష యాలను తిరస్కరించడం. అమ్మ ఎటువంటి మాయపొరలూ అంటని నిరాలంబయని చెప్పడం.

తనశిరస్సును తానే ఖండించుకోవడం అహాన్ని త్యజించడానికి ప్రతీక. అంతేకాదు ఆలోచనల్లోని, జ్ఞానంలోని స్వేచ్ఛను ప్రతిబింబిస్తుంది. ఆమె మెడలో కాపాలాలు ఆమె దుష్ట సంహారాన్ని తెలుపుతాయి.

డాకినీ, వారిణులు ఒకరు నల్లని దేహంతో మరొకరు ఎర్రని దేహంతో ఉంటారు. కాలాన్నీ, శక్తినీ సూచిస్తారు వారు. ఇది కాలానికీ శక్తికీ ఆమె పోషకురాలు అనిచెప్పడం.

ఆమె శరీరం నుండి వెలువడే మూడు ధారలు ఇడ, పింగళ, సుషుమ్న నాడులకు చెందినవి. ఆమె పరిపూర్ణ యోగిని.

భయానకంగా అనిపించే ఛిన్న మస్తాదేవి రూపం వెనుక ఇంతటి గొప్ప తత్వం దాగి ఉంది అంటారు.

## ప్రసిద్ధమైన ఛిన్నమస్త ఆలయాలు



పశ్చిమబెంగాల్‌లోని బిష్ణుపూర్ లోని బంకురా ప్రాంతంలో ఛిన్న మస్తాదేవి ఆలయం ఉంది.

హిమాచల్ ప్రదేశ్‌లోని ఉనీ జిల్లాలోని చింతపూర్ణిలో ఛిన్నమస్త అమ్మవారి ఆలయం ఉంది. ఇక్కడ సతీదేవి నుదురుభాగం పడినట్టుగా చెప్పబడి ఉంది. హిమాచల్ ప్రదేశ్‌లోని చింతపూర్ణి ఆలయం అత్యంత ప్రసిద్ధమైనది.

అస్సామ్‌లోని కామాఖ్య దేవాలయంలోగల దశమహావిద్యల ఆలయాలలో చిన్నమస్తాదేవి ఆలయం ఉంది.

ఝూర్ఖండ్‌లోని రామగఢ్ జిల్లాలో గల రాజ్రప్ప ప్రాంతంలో ఛిన్న మస్తాదేవి ఆలయం ఉంది.

ఖాట్మండు ప్రాంతంలో చంఘు నారాయణ ఆలయం వద్ద ఛిన్న మస్తా ఆలయం ఉంది. ఇవే కాకుండా భారతదేశంలోని తూర్పు భాగంలో అమ్మవారికి చాలా ఆలయాలున్నాయి.



## వజ్ర వారాహి సాధనలో ఛిన్నమస్తా



బౌద్ధతంత్రాలలో ఈమెను వజ్రవారాహి అనీ వజ్రయోగిని అనీ వజ్రతార అనీ పిలుస్తారు. 'చిన్నముండ వజ్రవారాహి సాధన' అనేది వజ్రయాన తంత్రాలలోని ఒక గ్రంథం. దీనిలో ఈ దేవత సాధనలు వివరంగా ఇవ్వబడ్డాయి. హిందూ తంత్రాలలో అయితే ఈమెను క్రోధకాళి అనీ ఉన్మత్తకాళి అనీ పిలుస్తారు. దశ మహావిద్యా దేవతలలో కాళి, తార, చిన్నమస్తిక ఒక గ్రూపుకు చెందిన దేవతలు. ఎందుకంటే వీరి ఆకారాలు భయానకంగా ఉండటమే గాక, మామూలు మనుషులకు అర్థంకాని రహస్య తాంత్రిక కాన్సెప్ట్‌లతో ముడిపడి ఉంటాయి. ఎందు కంటే ఇవి సాధనా రహస్యాలు గాబట్టి వీటిని అనుభవ పూర్వకంగా గ్రహించాలి గాబట్టి. అర్హత ఉన్న సాధకులకూ సాధికలకే ఈ రహస్యాలు చెప్పబడతాయి గాని ఊరకే కుతూహలపరులకు ఎన్నటికీ ఇవి తెలియ బడవు, అందవు. వజ్రయానంలో ఈ దేవత మహాసిద్ధ సాంప్రదాయంలో మనకు కనిపిస్తుంది. వజ్రయానంలో 84 మంది మహాసిద్ధులు ఉన్నారు.



## ఛిన్నమస్తా మూలాలు



'చతురశీతి సిద్ధ ప్రవృత్తి' అనే గ్రంథంలోనూ, 17 వ శతాబ్దానికి చెందిన టిబెటన్ గురువు పండిత తారానాధుడు వ్రాసిన పుస్తకాలలోనూ మహాసిద్ధ కృష్ణాచార్యుని గాథలు మనకు లభిస్తున్నాయి. ఈ గాథలలోనే మనకు 'చిన్నముండా/ చిన్నమస్తా దేవి' యొక్క మూలాలు దర్శనమిస్తాయి. తన గురువైన జాలంధరనాథుని వద్ద ఈయన బౌద్ధతంత్రమైన 'హేవజ్ర తంత్రం' లో దీక్ష స్వీకరించినట్లు తెలుస్తున్నది. ఈయన దేవపాలుడనే



రాజు కాలంలో (క్రీ.శ. 800 ప్రాంతం) బెంగాల్లో బౌద్ధభిక్షువుగా నివసించినట్లు ఆధారాలున్నాయి. అనేక సంవత్సరాల పాటు వజ్రవారాహి సాధన చెయ్యడం వల్ల ఈయనకు అనేక అద్భుత శక్తులు కలిగాయి. ఈయనకు అనేక వేలమంది శిష్యులు కూడా ఉండేవారు. వారిలో ఇద్దరు మహిళా మణులతో 'వజ్రవారాహి' సాధన ముడిపడి ఉన్నట్లు మనకు టిబెటన్ తంత్రగ్రందాల నుంచి తెలుస్తున్నది. వాళ్ళిద్దరి పేర్లు మేఖల, కనఖల. ఈ మేఖల కనఖల అనే ఇద్దరు బ్రాహ్మణ అక్కా చెల్లెళ్ళ రూపాలే మనం చూచే చిన్నమస్తా చిత్రంలో ముఖ్యదేవతకు రెండువైపులా నిలబడి ఆమె ఖండిత శిరస్సు నుంచి వెలువడే రక్తాన్ని త్రాగుతున్న ఇద్దరు దేవతలుగా చూడవచ్చు.

## ఏకవీర - ఛిన్నమస్తా



కృష్ణాచార్యుడు వ్రాసిన 'శ్రీ హేవజ్రైక వీర సాధన' అనే గ్రంధాన్ని బట్టి చిన్నమస్తా దేవతకు 'ఏకవీర' అనే పేరు కూడా ఉన్నట్లు తెలుస్తున్నది. హిందూ మతంలోని జానపద సాంప్రదాయాలలో పూజింపబడే 'రేణుక', 'ఎల్లమ్మ తల్లి' 'ఏకవీర', 'పోలేరమ్మ' మొదలైన గ్రామదేవతలందరూ ఈ చిన్నమస్తాదేవి యొక్క రకరకాలైన రూపాలే.

అందుకే వీరికి ఒక్క శిరస్సు మాత్రమే ఉండి ఆ శిరస్సు చుట్టూ జ్వాల ఆవరించి ఉన్నట్లు మనం చూడవచ్చు. ఇది ఖండిత శిరస్సుకు సూచిక అని అంటారు.



## టిబెటన్ బౌద్ధ గురువుల నమ్మకం



క్రిష్ణాచార్యుని శిష్యురాళ్ళలో మేఖల కనఖల అనేవాళ్ళు ఇద్దరు బ్రాహ్మణ యువతులు. వీళ్ళు చాలా చిన్నపిల్లలుగా ఉన్నప్పుడే వీళ్ళకు పెళ్ళిళ్ళు చెయ్యబడ్డాయి. కానీ ఎన్నాళ్ళకూ వీళ్ళు రజస్వలలు కాకపోతుంటే భర్తలు వీళ్ళను వదిలేశారు. ఆ పరిస్థితిలో వీళ్ళకు కృష్ణాచార్యుడు తారసపడి వీరికి వజ్రయోగిని చిన్నమస్తా సాధనలో దీక్షను ఇచ్చాడు. పది పన్నెండేళ్ళ సాధన తర్వాత ఆ సాధనలో వీళ్ళు సిద్ధిని సంపాదించారు. ఆ తర్వాత కొన్నేళ్ళకు వీళ్ళు తమ తలలను ఖండించుకుని వాటిని తమ చేతులతో పట్టుకుని నాట్యం చేస్తూ ప్రాణాలు వదిలారు. అప్పుడు వజ్ర వారాహి కూడా వారి మధ్యన ప్రత్యక్షమైనదని ఈ ముగ్గురి నాట్యమే నేడు మనం చూస్తున్న చిన్నమస్తా చిత్రమని అనేకమంది టిబెటన్ బౌద్ధ గురువులు నమ్ముతారు.



## ఛిన్నమస్తా ప్రకృతికి ప్రతీక



ఛిన్నమస్తా దేవత ప్రకృతికి ప్రతీక అనుకుంటే, ఆమె తన తలను తాను ఖండించుకుని తన రక్తాన్ని తన చెలికత్తేలకు ఇవ్వడమంటే ప్రకృతి తనను తాను తగ్గించుకుని లోకాన్ని పోషిస్తోందని దాని అర్థం. అంతేగాక తన రక్తాన్ని తానే కొంత త్రాగుతోంది కూడా! అంటే తన జీవనం కోసం కొంత శక్తిని తాను వాడుకుని మిగతా భాగంతో లోకంలోని అందరినీ పోషిస్తోంది అని మనకు మార్మికంగా చెబుతోంది.

## నగ్నత్వం ప్రకృతికి ప్రతీక



ప్రకృతి శక్తులు శుద్ధశక్తి స్వరూపాలు అవి నగ్నంగానే ఉంటాయి. ఉన్నదున్నట్లుగా కనిపిస్తాయి. ప్రకృతిలో అన్నీ నగ్నంగానే ఉంటాయి. ఒక్క మనిషి మాత్రమే బట్టలు కట్టు కుంటాడు. ప్రకృతిలో ఉన్న అమా యకత్వమూ, స్వచ్ఛతా, శుద్ధమైన శక్తి స్వరూపములే ఈ చిత్రంలోని దేవతల నగ్న త్వాలకు సూచనలు. తాంత్రిక చిత్రాల్నీ సింబాలిక్ లాగ్వేజీ అనే విషయాన్ని మనం మర్చిపోకూడదు. కనుక కరుణామయి అయిన జగన్మాతకు ఈ చిత్రం ఒక మార్మిక సంకేతం. అంతేగాని ఇదేదో ఘోరమైన రాక్షసి బొమ్మనీ, తలలు నరుక్కునే ఆటవిక సాంప్రదాయానికి ఇదొక చిహ్నమనీ భావించడం సరి కాదు అని కొందరి భావన.

## తలను ఖండించుకొన్నా శవం కాదు

ఛిన్నమస్తా స్వరూపం భయంకరంగా ఉన్నప్పటికీ దానిలో చాలా నిగూఢమైన అర్ధాలున్నాయి. తన తలను తాను ఖండించుకోవడం త్యాగానికి చిహ్నం. అలాంటి అత్యున్నతమైన త్యాగం లేనిదే ఎవరూ తంత్ర మార్గంలో సిద్ధిని పొందలేరు. దానికి తన సర్వస్వాన్నీ పణంగా

పెట్టగలిగిన ధీరత్వం ఉండాలని చెప్పడమే ఈ తల నరుక్కోవడంలోని అర్థం. దైవం కోసం తన సమస్త సుఖాలనూ చివరకు తన ప్రాణాన్ని కూడా త్యాగం చెయ్యడమనే రహస్యార్థం ఇందులో ఇమిడి ఉన్నది. అయితే తన తలను ఖండించుకున్నప్పటికీ ఆమె చనిపోలేదు. ఆమె శవం కాదు. శక్తి స్వరూపమైన దేవత. కనుక తల లేకున్నప్పటికీ ఆమె సజీవంగానే ఉన్నది. దీనికి తార్కాణంగానే ఖండింపబడిన ఆమె తల ఆమె చేతిలోనే నవ్వుతూ మనకు కనిపిస్తుంది. అంటే యోగసమాధిలో స్వచ్ఛందంగా శరీరాన్ని వదిలేసే ప్రక్రియకు ఈమె సంకేతంగా నిలుస్తున్నది. కానీ అది ఆత్మహత్యా కాదు, అందరికీ తెలిసిన మామూలు మరణమూ కాదు. మామూలు మనుషులకు మరణం వస్తుంది. కానీ యోగసమాధిలో దేహత్యాగం చేసే యోగులది మరణం కాదు. వాళ్ళు కర్మబద్ధులైన మామూలు మనుషుల లాగా నరకానికి పోరు. వారిదైన ఆత్మస్థితిలో వారు వెలుగులోనే నిలిచి ఉంటారు.

## శాక్త మహాభాగవతంలో ఛిన్నమస్తా ప్రస్తావన

బెంగాల్లో ప్రచారంలో ఉన్నట్టి శాక్త మహాభాగవతంలో ఛిన్నమస్తాదేవి తూర్పు దిక్కుకు అధిదేవత అని ఉన్నది. తన చుట్టూ దశ దిశలలో సతీదేవి ప్రత్యక్షమైనప్పుడు, ఈ పదిమంది శక్తులు ఎవరని సతీదేవిని శివుడు ప్రశ్నిస్తాడు. దానికి ఆమె జవాబు చెబుతూ  తూర్పుదిక్కున ఉన్న భయంకర శక్తి ఛిన్నమస్త అంటూ మిగతా దిక్కులలో ఎవరెవరున్నారో చెబుతుంది. తూర్పుదిక్కున ఉన్న దేవతకు 'ఉష' అని వేదాలలో పేరున్నది. ఈమె సూర్యుని కంటే ముందు ఉదయించే వెలుగు. ఈ వెలుగుతోనే లోకం మేలుకోవడం మొదలౌతుంది. కానీ సాయంత్రానికి సూర్యు



నితో బాటే ఈమె అస్తమిస్తుంది. సూర్యునితో కలసి నడుస్తుంది గనుక ఈమెకు సూర్యదేవుని భార్య అని ఇంకొక పేరున్నది. ఈ రకంగా ఈమె ప్రతిరోజూ ఉదయిస్తూ (జన్మిస్తూ), అస్తమిస్తూ (మరణిస్తూ) ఉంటుంది. కనుక పుట్టుక చావులనేవి ఈమెకు ఒక ఆటవంటివి. ఎందుకంటే ఈమె ప్రతిరోజూ ఈ స్థితులలో నడుస్తూ ఉంటుంది. అలాగే ఛిన్నమస్తా దేవత కూడా జీవనానికీ మరణానికీ అధిదేవతగా తంత్రాలలో ఆరాధింప బడుతూ ఉన్నది. ఈమె అనుక్షణం మరణిస్తూ ఉంటుంది కానీ అనుక్షణం జీవించే ఉంటుంది. అలాగే ఈమెను ఆరాధించే యోగులు తాంత్రికులు కూడా ప్రతిరోజూ మరణిస్తూ మళ్ళీ జీవిస్తూ ఉంటారు. సమాధిస్థితిని అందుకోవడం అంటే మరణించడమే. అది ఒకరకమైన చావే. దానిలో నుంచి బయటకు రావడం అంటే మళ్ళీ జీవించడమే. కనుక సమాధి స్థితిని అందుకున్న ఉపాసకులు చచ్చి బ్రతికిన వారే. ఇదే జీవన్ముక్తి అంటే అసలైన అర్థం.

## చిన్నమస్తా సాధన యొక్క ప్రయోజనాలు

చీకటి శక్తులు మరియు అడ్డంకులను తొలగించడానికి, అన్ని ప్రయత్నాలలో  విజయం వేగంగా అందుకోవటానికి, మనస్సు యొక్క పరిమితులను అధిగమించడానికి, ఆధ్యాత్మిక వృద్ధి మరియు మెరుగైన

అవగాహన కోసం, శత్రువులపై విజయం సాధించేందుకు ఛిన్నమస్తా యొక్క సాధన అవసరమని చెబుతారు.

## ప్రణతోషిణ తంత్రంలో ఛిన్నమస్తా ప్రస్తావన

అమ్మకు సంబంధించి ఇంకో కథ ఏం ప్రచారంలో ఉంది. క్షీరసాగర మథనంలో నుండి వచ్చిన అమృతంలో రాక్షసుల భాగాన్ని ఛిన్నమస్తా అమ్మే త్రాగిందట. మళ్ళీ ఆ అమృతం రాక్షసుల పాలు కాకుండా తన తలను శరీరం నుండి వేరుచేసి దేవతలను రక్షించింది జగన్మాత. ఈ కథ ప్రణతోషిణ తంత్రంలో చెప్పబడింది.

'ఛిన్నమస్త తత్త్వం' పేరిట పుస్తకం రాసిన ఆచార్య ఆనంద్ ఝా, సైనికులను అమ్మవారి పూజచేయమని అంటారు ఎందుకంటే అమ్మ పూజ వలన తమపై తమకు నియంత్రణ ఉంటుందని, అమ్మ పూజవలన త్యాగగుణం అలవడుతుందని చెప్పారు.

## ఛిన్నమస్తాదేవి గాయిత్రి మంత్రము



ఓమ్ వైరోచన్యైచ విద్మహే
ఛిన్నమస్తాయై ధీమహి
తన్నో దేవీ ప్రచోదయాత్!!



## ఛిన్నమస్తా సాధనకు గురువు అవసరమా?

ఛిన్న మస్తాదేవిని ఆరాధించాలనుకునేవారు తప్పకుండా గురువుల వద్ద ఉపదేశం పొందాలి లేదా వారి అనుమతిని పొందాలి అని చెబుతారు.

# శ్రీ ఛిన్నమస్తాదేవీ స్తోత్రం

*స్తోత్ర పారాయణకి గురు ముఖత అవసరం లేదు, మంత్రానికి గురువు ముఖం అవసరం. అతి శక్తివంతమైన చిన్నమస్త స్తోత్రం 41 రోజులు నిష్ఠతో రోజుకి 3 సార్లు జపిస్తే ఎంతటి కార్యాన్ని అయిన ఛిన్నమస్తాదేవి అవలీలగా జరిపిస్తుంది అని నమ్మకం.*

**ఈశ్వర ఉవాచ :**

స్తవరాజమహం వందే వై రోచన్యా శ్శుభ ప్రదం
నౌభౌ శుభ్రారవిందం తదుపరి విలసన్మండలం చండరేశ్మేః
సంసారస్యైకసారాం త్రిభువనజననీం ధర్మకామార్థదాత్రీం
తస్మిన్మధ్యే త్రిభాగే త్రితయతనుధరాంఛిన్నమస్తాం ప్రశస్తాం
తాం వందే ఛిన్నమస్తాం శమనభయహరాం యోగినీం యోగముద్రామ్ 1

నాభౌ శుద్ధసరోజవక్త్రవిలసద్బంధూకపుష్పారుణాం
భాస్వద్భాస్కరమండలం తదుదరే తద్యోనిచక్రం మహత్
తన్మధ్యేవిపరీతమైదునతర ప్రద్యుమ్నసత్కామినీ
పృష్ఠం స్యాత్తరుణార్క కోటివిలసత్తేజ స్స్వరూపాం భజే 2

వామే ఛిన్న శిరోధరాం తదితరే పాణౌమహత్కర్తృకాం
ప్రత్యాలీఢపదాం దిగంతవసనామున్ముక్త కేశవ్రజాం
ఛిన్నాత్మీయ శిరస్సముచ్చల దసృగ్ధారాం పిబంతీంపరాం
బాలాదిత్య సమప్రకాశ విలసన్నేత్రత్రయోద్భాసినీమ్ 3

వామాదన్యత్ర నాళం బహుగహనగళద్రక్తధారాభిరుచ్చై
ర్గాయంతీమస్థిభూషాం కరకమలలసత్కర్తృ కాముగ్రరూపాం
రక్తామారక్తకేశీమవగతవసనావర్ణనీ మాత్మశక్తిం
ప్రత్యాలీఢోరు పాదామరుణి తనయనాం యోగినీం యోగినిద్రామ్ 4

దిగ్వస్త్రాం ముక్తకేశీం ప్రళయఘనఘటా ఘోరరూపాం
ప్రచండాం దంష్ట్రాదుఃప్రేక్ష్య వక్త్రోదర వివరలసల్లోలజిహ్వాగ్రభాసాం
విద్యుల్లోలాక్షియుగ్మాం హృదయతటలసద్భోగినీం భీమమూర్తిం
సద్యఃచ్ఛిన్నాత్మకంఠప్రగలితరుధిరైర్డాకినీ వర్ధయంతీమ్ 5

బ్రహ్మేశానాచ్యుతాద్యైశ్శిరసి వినిహితా మందపాదారవిందై
రాజ్ఞైర్యోగీంద్రముఖ్యైః ప్రతిపదమనిశం చింతితాం చింత్యరూపాం
సంసారే సారభూతాం త్రిభువనజననీం ఛిన్నమస్తాం ప్రశస్తాం
ఇష్టాం తామిష్టదాత్రీం కలికలుషహరాం చేతసా చింతయామి 6

ఉత్పత్తి స్థితిసంహృతీర్ఘటయితుం ధత్తే త్రిరూపాం
తనుం త్రైగుణ్యాజ్జగతో యదీయవికృతి బ్రహ్మాచ్యుతశ్శూలభృత్
తామాద్యాం ప్రకృతిం స్మరామి మనసా సర్వార్థసంసిద్ధయే
యస్మాత్స్మేరపదారవిందయుగళే లాభం భజంతే నరాః 7

అఖిలషిత పరస్త్రీ యోగపూజపరోఽహం
బహువిధజన భావారంభసంభావితోఽహం
పశుజనవిరతోఽహం భైరవీ సంస్థితోఽహం
గురుచరణపరోఽహం భైరవోఽహం శివోఽహమ్ 8

ఇదం స్తోత్రం మహాపుణ్యం బ్రహ్మణా భాషితం పురా
సర్వసిద్ధిప్రదం సాక్షాన్మహాపాతకనాశనమ్ 9

యఃపఠేత్ప్రాతరుత్థాయదేవ్యాస్సన్నిహితోఽపివా
తస్య సిద్ధిర్భవేద్దేవీ వాంఛితార్థ ప్రదాయినీ 10

ధనం ధాన్యం సుతం జాయాం హయం హస్తినమేవ చ
వసుంధరాం మహావిద్యామష్టసిద్ధిం లభేద్ధ్రువమ్ 11

వైయాఘ్రాజిన రంజితస్వజఘనేఽరణ్యే ప్రలంబోదరే
ఖర్వే నిర్వచనీయపర్వసుభగే ముండావళీమండితే
కర్త్రీం కుందరుచిం విచిత్రవనితాం జ్ఞానే దధానే పదే
మాతర్భక్తజనాను కంపిని మహామాయేఽస్తు తుభ్యం నమః 12

ఇతి శ్రీ ఛిన్నమస్తాదేవీ స్తోత్రమ్

# ఛిన్నమస్తా స్తోత్రం - అథవా ప్రచండ చండికా స్తోత్రం

(శంకరాచార్య విరచిత)

శ్రీగణేశాయ నమః।

ఆనన్దయిత్రి పరమేశ్వరి వేదగర్భే
మాతః పురన్దరపురాన్తరలబ్ధనేత్రే ।
లక్ష్మీమశేషజగతాం పరిభావయన్తః
సన్తో భజన్తి భవతీం ధనదేశలబ్ధ్యై । 1

లజ్జానుగాం విమలవిద్రుమకాన్తికాన్తాం
కాన్తానురాగరసికాః పరమేశ్వరి త్వామ్ ।
యే భావయన్తి మనసా మనుజాస్త ఏతే
సీమన్తినీభిరనిశం పరిభావ్యమానాః । 2

మాయామయీం నిఖిలపాతకకోటికూటవిద్రావిణీం
భృశమసంశయినో భజన్తి ।
త్వాం పద్మసున్దరతనుం తరుణారుణాస్యాం
పాశాఙ్కుశాభయవరాద్యకరాం వరాస్త్రైః । 3

తే తర్కకర్కశధియః శ్రుతిశాస్త్రశిల్పైశ్ఛన్దో-
భిశోభితముఖాః సకలాగమజ్ఞాః ।
సర్వజ్ఞలబ్ధవిభవాః కుముదేన్దువర్ణాం
యే వాగ్భవే చ భవతీం పరిభావయన్తి । 4

వజ్రపణున్నహృదయా సమయద్రుహస్తే
వైరోచనే మదనమన్దిరగాస్యమాతః ।
మాయాద్వయానుగతవిగ్రహభూషితాఽసి
దివ్యాస్త్రవహ్నివనితానుగతాఽసి ధన్యే । 5

వృత్తత్రయాష్టదలవహ్నిపురఃసరస్య
మార్తణ్డమణ్డలగతాం పరిభావయన్తి ।
యే వహ్నికూటసదృశీం మణిపూరకాన్తస్తే
కాలకణ్టకవిడమ్బనచ్చవః స్యుః । 6

కాలాగరుభ్రమరచన్దనకుణ్డగోల
ఖణ్డైరనఙ్గమదనోద్భవమాదనీభిః ।
సిన్దూరకుఙ్కుమపటీరహిమైర్విధాయ
సన్మణ్డలం తదుపరీహ యజేన్మృడానీమ్ । 7

చ్ఛత్తడిన్మిహిరకోటికరాం విచేలా
ముద్యత్కబన్ధరుధిరాం ద్విభుజాం త్రినేత్రామ్ ।
వామే వికీర్ణకచశీర్షకరే పరే తా
మీడే పరం పరమకర్త్రికయా సమేతామ్ । 8

కామేశ్వరాఙ్గనిలయాం కలయా
సుధాంశోర్విభ్రాజమానహృదయామపరే స్మరన్తి ।
సుప్తాహిరాజసదృశీం పరమేశ్వరస్థాం
త్వామాద్రిరాజతనయే చ సమానమానాః । 9

ల్లిత్రయోపరిగతామపి వహ్నిచక్ర-
పీఠానుగాం సరసిజాసనసన్నివిష్టామ్ ।
సుప్తాం ప్రబోధ్య భవతీం మనుజా
గురూక్తహూఁకారవాయువశిభిర్మనసా భజన్తి । 10

శుభ్రాసి శాన్తికకథాసు తథైవ పీతా
స్తమ్భే రిపోరథ చ శుభ్రతరాసి మాతః ।
ఉచ్చాటనేఽప్యసితకర్మసుకర్మణి త్వం
సంసేవ్యసే స్ఫటికకాన్తిరనన్తచారే । 11

త్వాముత్పలైర్మధుయుతైర్మధునోపనీతైర్గవ్యైః
పయోవిలులితైః శతమేవ కుణ్డే ।
సాజ్యైశ్చ తోషయతి యః పురుషస్త్రిసన్ధ్యం
షణ్మాసతో భవతి శక్రసమో హి భూమౌ । 12

జాగ్రత్స్వపన్నపి శివే తవ మన్త్రరాజమేవం
విచిన్తయతి యో మనసా విధిజ్ఞః ।
సంసారసాగరసమృద్ధరణే వహిత్రం చిత్రం
న భూతజననేఽపి జగత్సు పుంసః । 13

ఇయం విద్యా వన్ద్యా హరిహరవిరిఞ్చిప్రభృతిభిః
పురారాతేరన్తః పురమిదమగమ్యం పశుజనైః ।
సుధామన్దానన్దైః పశుపతిసమానవ్యసనిభిః
సుధాసేవ్యైః సద్భిర్గురుచరణసంసారచతురైః । 14

కుణ్డే వా మణ్డలే వా శుచిరథ మనునా భావయత్యేవ మన్త్రీ
సంస్థాప్యోచ్చైర్జుహోతి ప్రసవసుఫలదైః పద్మపాలాశకానామ్ ।
హైమం క్షీరైస్తిలైర్వాం సమధుకకుసుమైర్మాలతీబన్ధుజాతీశ్వేతైరబ్ధం
సకానామపి వరసమిధా సమ్పదే సర్వసిద్ధ్యై । 15

అన్ధః సాజ్యం సమాంసం దధియుతమథవా యోఽన్వహం యామినీనాం
మధ్యే దేవ్యై దదాతి ప్రభవతి గృహగా శ్రీరముష్యావఖణ్డా ।
ఆజ్యం మాంసం సరక్తం తిలయుతమథవా తణ్డులం పాయసం వా హుత్వా
మాంసం త్రిసన్ధ్యం స భవతి మనుజో భూతిభిర్భూతనాథః । 16

ఇదం దేవ్యాః స్తోత్రం పఠతి మనుజో యస్త్రిసమయం
శుచిర్భూత్వా విశ్వే భవతి ధనదో వాసవసమః ।
వశా భూపాః కాన్తా నిఖిలరిపుహన్తుః సురగణా
భవన్త్యుచ్చైర్వాచో యదిహ నను మాసైస్త్రిభిరపి । 17

ఇతి శ్రీశంకరాచార్యవిరచితః ప్రచణ్డచణ్డికాస్తవరాజః సమాప్తః

# శ్రీ ఛిన్నమస్తా దేవీ హృదయమ్



**శ్రీ పార్వత్యువాచ :**

శృతం పూజాదికం సమ్యగ్భవద్వక్త్రాబ్జనిః స్రుతమ్ ।
హృదయం ఛిన్నమస్తాయాః శ్రోతుమిచ్ఛామి సాంప్రతమ్ ॥ 1

**శ్రీ మహాదేవ ఉవాచ :**

నాద్యావధి మయాప్రోక్తం కస్యాపి ప్రాణవల్లభే ।
యత్వయా పరిపృష్టాహం వక్ష్యే ప్రీత్యై తవప్రియే ॥ 2

ఓం అస్య శ్రీ ఛిన్నమస్తా హృదయ స్తోత్ర మంత్రస్య
భైరవ ఋషిః - సమ్రాట్
ఛందః, ఛిన్నమస్తా దేవతా, హూం బీజమ్ -
ఓం శక్తిః - హ్రీం కీలకం -
శత్రుక్షయకరణార్థే జపే వినియోగః.

## ఋష్యాదిన్యాసః ।

ఓం భైరవ ఋషయే నమః శిరసి, సమ్రాట్ఛందసే నమః ముఖే, ఛిన్నమస్తా దేవతాయై నమః హృది, హూం బీజాయ నమో గుహ్యే, ఓం శక్తయే నమః పాదయోః హ్రీం కీలకాయ నమః నాభౌ, వినియోగాయ నమః సర్వాంగే, ఇతి ఋష్యాదిన్యాసః

## అథ కరన్యాసః ।

ఓం ఓం అంగుష్ఠాభ్యాం నమః ఓం హ్రూం తర్జనీభ్యాం నమః

ఓం హ్రీం మధ్యమాభ్యాం నమః ఓం ఐం అనామికాభ్యాం నమః

ఓం క్లీం కనిష్ఠికాభ్యాం నమః ఓం హూం కరతల కరపృష్ఠాభ్యాం నమః

ఓం ఓం హృదయాయ నమః । ఓం హూం శిరసే స్వాహా ।

ఓం హ్రీం శిఖాయై వషట్ । ఓం క్లీం నేత్రత్రయాయ వౌషట్ ।

ఓం ఐం కవచాయ హుమ్ । ఓం హూం అస్త్రాయ ఫట్ ।

భూర్భువస్సువరోమితి దిగ్బంధః ।

## ధ్యానమ్ :

రక్తాభాం రక్తకేశీం కరకమల లసత్కర్త్రికాం కాలకాంతిం
విచ్ఛిన్నాత్మీయ ముండాస్రుగరూణబహుళోదగ్రధారాం పిబంతీం ।
విఘ్నా భ్రౌఘ ప్రచండశ్వసన సమనిభాం సేవితాం సిద్ధసంఘైః ।
పద్మాక్షీం ఛిన్నమస్తాం ఛలకరదితిజచ్ఛేదినీం సంస్మరామి ॥ 1

వందేహం ఛిన్నమస్తాం తాం ఛిన్నముండధరాం పరాం ।
ఛిన్నగ్రీవోచ్ఛటాచ్ఛన్నాం క్షోమవస్త్ర పరిచ్ఛదామ్ ॥ 2

సర్వదాసుర సంఘేన సేవితాంఘ్రి సరోరుహామ్ ।
సేవే సకల సంపత్త్యై ఛిన్నమస్తాం శుభప్రదామ్ ॥ 3

యజ్ఞానాం యోగయజ్ఞాయ యాతు జాతా యుగేయుగే ।
దానవాంతకరీం దేవీం ఛిన్నమస్తాం భజామి తాం ॥ 4

వైరోచనీం వరారోహాం వామదేవ వివర్ధితామ్ ।
కోటిసూర్య ప్రభాం వందే విద్యుద్వర్ణాక్షి మండితామ్ ॥ 5

నిజకంఠోచ్ఛలద్రక్తధారయా యా ముహుర్ముహుః ।
యోగినీస్తర్పయన్త్యుగ్రా తస్యాశ్చరణ మాశ్రయే ॥ 6

హూ మిత్యేకాక్షరం మంత్రం యదీయం యుక్త మానసః ।
యో జపేత్తస్య విద్వేషీ భస్మతాం యాతి తాం భజే ॥ 7

హూం స్వాహేతి మనుం సమ్యగ్యః స్మరత్యర్తి మాన్నరాః ।
ఛినత్తి ఛిన్నమస్తాయా తస్యబాధాం నమామితాం ॥ 8

యస్యాః కటాక్షమాత్రేణ క్రూరభూతాద్యోదృతమ్ ।
దూరతః సంపలాయంతే ఛిన్నమస్తాం భజామితామ్ ॥ 9

క్షితితల పరిరక్షా క్షాంతరోషా సుదక్షా ఛలయుత ఖలకక్షా ఛేదనే క్షాంతిలక్ష్యా ।
క్షితి దితిజ సుపక్షా క్షోణిపాక్షయ్య శిక్షా జయతు చాక్షా ఛిన్నమస్తారిభక్షా ॥ 10

కలికలుష కలానాం కర్తనే కర్త్రిహస్తా
సురకువలయాకాశా మందభాను ప్రకాశా
అసురకుల కళాపత్రాసి కామ్లానమూర్తిః
జయతు జయతు కాళీ ఛిన్నమస్తా కరాళీ ॥ 11

భువనభరణ భూరి భాజమానానుభావా
భవ భవ విభవానాం భారణోద్ధాత భూతిః ।
ద్విజకుల కమలానాం భాసినీ భానుమూర్తిః
భవతు భవతు వాణీ ఛిన్నమస్తా భవానీ ॥ 12

మమరిపుగణమాశు ఛేత్తుముగ్రం కృపాణం
సపదిజనని తీక్ష్ణం ఛిన్న ముండం గృహాణ ।
భవతు తవ యశోలం ఛింది శత్రూన్ ఖలాన్మే
మమచ పరిదిశేష్టం ఛిన్నమస్తే క్షమస్వ ॥ 13

ఛిన్నగ్రీవా ఛిన్నమస్తా ఛిన్నముండధరా క్షతా ।
క్షోదక్షేమకరీ స్వక్షా క్షోణీశాఛాదన క్షమా ॥ 14

వైరోచనీ వరారోహా బలిదాన ప్రహర్షితా
బలిపూజిత పాదాబ్జా వాసుదేవ ప్రపూజితా ॥ 15

ఇతిద్వాదశ నామాని ఛిన్నమస్తా ప్రియాణి యః ।
స్మరేత్ప్రాతః సముద్ధాయ తస్య నశ్యంతి శత్రవః ॥ 16

యాం స్మృత్వా సంతి సద్యః సకలసురగణాః సర్వదాః సంపదాఢ్యాః
శత్రూణాం సంఘమాహత్య విశదవదనాః స్వస్థ చిత్తాః శ్రయాంతి ।
తస్యాః సంకల్పవంతః సరసిజ చరణం సంతతం సంశ్రయంతి
సాஉద్యా శ్రీశాది సేవ్యా సుఫలతు సుతరాం ఛిన్నమస్తా ప్రశస్తా ॥ 17

ఇదం హృదయ మజ్ఞాత్వా హంతుమిచ్ఛతి యోద్విషమ్ ।
కథం తస్యాచిరం శత్రుర్నాశ మేష్యతి పార్వతీ ॥ 18

యదీచ్ఛేన్నాశనం శత్రోః శీఘ్రమేతత్పఠేన్నరః ।
ఛిన్నమస్తా ప్రసన్నాహి దదాతి ఫలమీప్సితమ్ ॥ 19

శత్రుప్రశమనం పుణ్యం సమీప్సిత ఫలప్రదమ్ ।
ఆయురారోగ్యదం చైవ పఠతాం పుణ్యసాధనమ్ ॥ 20

ఇతి శ్రీ నంద్యావర్తే మహాదేవ పార్వతీ సంవాదే శ్రీ ఛిన్నమస్తా హృదయ స్తోత్రం సమాప్తమ్

# ఛిన్నమస్తా ధ్యానం

ప్రత్యాలీఢపదాం సదైవ దధతీం ఛిన్నం శిరః కర్త్రికాం
దిగ్వస్త్రాం స్వకబన్ధశోణితసుధాధారాం పిబన్తీం ముదా ।
నాగాబద్ధశిరోమణిం త్రినయనాం హృద్యుత్పలాల్కృతాం
రత్యాసక్తమనోభవోపరి దృఢాం వన్దే జపాసన్నిభామ్ । 1

దక్షే చాతిసితా విముక్తచికురా కర్త్రీం తథా ఖర్పరమ్ ।
హస్తాభ్యాం దధతీ రజోగుణభవా నామ్నాపి సా వర్ణినీ ।

దేవ్యాశ్ఛిన్నకబన్ధతః పతదసృగ్ధారాం పిబన్తీ ముదా ।
నాగాబద్ధశిరోమణిర్మనువిదా ధ్యేయా సదా సా సురైః । 2

ప్రత్యాలీఢపదా కబన్ధవిగలద్రక్తం పిబన్తీ ముదా ।
సైషా యా ప్రలయే సమస్తభువనం భోక్తుం క్షమా తామసీ ।

శక్తిః సాపి పరాత్పరా భగవతీ నామ్నా పరా డాకినీ ।
ధ్యేయా ధ్యానపరైః సదా సవినయం భక్తేష్టభూతిప్రదా । 3

భాస్వన్మణ్డలమధ్యగాం నిజశిరశ్ఛిన్నం వికీర్ణాలకమ్ ।
స్ఫారాస్యం ప్రపిబద్గలాత్స్వరుధిరం వామే కరే బిభ్రతీమ్ ।

యాభాసక్తరతిస్మరోపరిగతాం సఖ్యౌ నిజే డాకినీ-
వర్ణిన్యౌ పరిదృశ్య మోదకలితాం శ్రీఛిన్నమస్తాం భజే । 4

స్వనాభౌ నీరజం ధ్యాయామ్యర్ధం వికసితం సితమ్ ।
తత్పద్మకోశమధ్యే తు మణ్డలం చణ్డరోచిషః । 5

జపాకుసుమసఙ్కాశం రక్తబన్ధూకసన్నిభమ్ ।
రజస్సత్త్వతమోరేఖా యోనిమణ్డలమణ్డితమ్ । 6

తన్మధ్యే తాం మహాదేవీం సూర్యకోటిసమప్రభామ్ ।
ఛిన్నమస్తాం కరే వామే ధారయన్తీం స్వమస్తకమ్ । 7

ప్రసారితముఖీం దేవీం లేలిహానాగ్రజిహ్వికామ్ ।
పిబన్తీం రౌధిరీం ధారాం నిజకణ్ఠవినిర్గతామ్ । 8

వికీర్ణకేశపాశాం చ నానాపుష్పసమన్వితామ్ ।
దక్షిణే చ కరే కర్త్రీం ముణ్డమాలావిభూషితామ్ । 9

దిగమ్బరాం మహాఘోరాం ప్రత్యాలీఢపదే స్థితామ్ ।
అస్థిమాలాధరాం దేవీం నాగయజ్ఞోపవీతినీమ్ । 10

రతికామోపరిష్ఠాం చ సదా ధ్యాతాం చ మన్త్రిభిః ।
సదా షోడశవర్షీయాం పీనోన్నతపయోధరామ్ । 11

విపరీతరతాసక్తౌ ధ్యాయామి రతిమన్మథౌ ।
శాకినీవర్ణినీయుక్తాం వామదక్షిణయోగతః । 12

దేవీగలోచ్ఛలద్రక్తధారాపానం ప్రకుర్వతీమ్ ।
వర్ణినీం లోహితాం సౌమ్యాం ముక్తకేశీం దిగమ్బరామ్ । 13

కపాలకర్త్రికాహస్తాం వామదక్షిణయోగతః ।
నాగయజ్ఞోపవీతాఢ్యాం జ్వలత్తేజోమయీమివ । 14

ప్రత్యాలీఢపదాం విద్యాం నానాలఙ్కారభూషితామ్ ।
సదా ద్వాదశవర్షీయాం అస్థిమాలావిభూషితామ్ । 15

డాకినీం వామపార్శ్వే తు కల్పసూర్యానలోపమామ్ ।
విద్యుజ్జటాం త్రినయనాం దన్తపఙ్క్తిబలాకినీమ్ । 16

దంష్ట్రాకరాలవదనాం పీనోన్నతపయోధరామ్ ।
మహాదేవీం మహాఘోరాం ముక్తకేశీం దిగమ్బరామ్ । 17

లేలిహానమహాజిహ్వాం ముణ్డమాలావిభూషితామ్ ।
కపాలకర్త్రికాహస్తాం వామదక్షిణయోగతః । 18

దేవీగలోచ్ఛలద్రక్తధారాపానం ప్రకుర్వతీమ్ ।
కరస్థితకపాలేన భీషణేనాతిభీషణామ్ ।
ఆభ్యాం నిషేవ్యమాణాం తాం కలయే జగదీశ్వరీమ్ ।

# త్రైలోక్య విజయ ఛిన్నమస్తా కవచం

(భైరవతంత్రే)



శ్రీ గణేశాయ నమః।

దేవ్యువాచ ।

కథితాచ్ఛిన్నమస్తాయా యా యా విద్యా సుగోపితాః ।
త్వయా నాథేన జీవేశ శ్రుతాశ్చాధిగతా మయా । 1

ఇదానీం శ్రోతుమిచ్ఛామి కవచం సర్వసూచితమ్ ।
త్రైలోక్యవిజయం నామ కృపయా కథ్యతాం ప్రభో । 2

భైరవ ఉవాచ ।

శృణు వక్ష్యామి దేవేశి సర్వదేవనమస్కృతే ।
త్రైలోక్యవిజయం నామ కవచం సర్వమోహనమ్ । 3

సర్వవిద్యామయం సాక్షాత్సురాత్సురజయప్రదమ్ ।
ధారణాత్పఠనాదీశస్త్రైలోక్యవిజయీ విభుః । 4

బ్రహ్మా నారాయణో రుద్రో ధారణాత్పఠనాద్యతః ।
కర్తా పాతా చ సంహర్తా భువనానాం సురేశ్వరి । 5

న దేయం పరశిష్యేభ్యోఽభక్తేభ్యోఽపి విశేషతః ।
దేయం శిష్యాయ భక్తాయ ప్రాణేభ్యోఽప్యధికాయ చ । 6

దేవ్యాశ్చ ఛ్ఛిన్నమస్తాయాః కవచస్య చ భైరవః ।
ఋషిస్తు స్యాద్విరాట్ ఛన్దో దేవతా ఛ్ఛిన్నమస్తకా । 7

త్రైలోక్యవిజయే ముక్తౌ వినియోగః ప్రకీర్తితః ।
హుంకారో మే శిరః పాతు ఛిన్నమస్తా బలప్రదా । 8

హ్రాం హ్రూం ఐం త్ర్యక్షరీ పాతు భాలం వక్త్రం దిగమ్బరా ।
శ్రీం హ్రీం హ్రూం ఐం దృశౌ పాతు ముణ్డం కర్త్రిధరాపి సా । 9

సా విద్యా ప్రణవాద్యన్తా శ్రుతియుగ్మం సదాఽవతు ।
వజ్రవైరోచనీయే హుం ఫట్ స్వాహా చ ధ్రువాదికా । 10

ఘ్రాణం పాతు ఛ్ఛిన్నమస్తా ముణ్డకర్త్రివిధారిణీ ।
శ్రీమాయాకూర్చవాగ్బీజైర్వజ్రవైరోచనీయహ్రూం । 11

హూం ఫట్ స్వాహా మహావిద్యా షోడశీ బ్రహ్మరూపిణీ ।
స్వపార్శ్వే వర్ణినీ చాసృగ్ధారాం పాయయతీ ముదా । 12

వదనం సర్వదా పాతు ఛ్ఛిన్నమస్తా స్వశక్తికా ।
ముణ్డకర్త్రిధరా రక్తా సాధకాభీష్టదాయినీ । 13

వర్ణినీ డాకినీయుక్తా సాపి మామభితోఽవతు ।
రామాద్యా పాతు జిహ్వాం చ లజ్జాద్యా పాతు కణ్ఠకమ్ । 14

కూర్చాద్యా హృదయం పాతు వాగాద్యా స్తనయుగ్మకమ్ ।
రమయా పుటితా విద్యా పార్శ్వౌ పాతు సురేశ్వరీ । 15

మాయయా పుటితా పాతు నాభిదేశే దిగమ్బరా ।
కూర్చేణ పుటితా దేవీ పృష్ఠదేశే సదాఽవతు । 16

వాగ్బీజపుటితా చైషా మధ్యం పాతు సశక్తికా ।
ఈశ్వరీ కూర్చవాగ్బీజైర్వజ్రవైరోచనీయహ్రూం । 17

హూంఫట్ స్వాహా మహావిద్యా కోటిసూర్యసమప్రభా ।
ఛిన్నమస్తా సదా పాయాదురుయుగ్మం సశక్తికా । 18

హ్రీం హ్రూం వర్ణినీ జానుం శ్రీం హ్రీం చ డాకినీ పదమ్ ।
సర్వవిద్యాస్థితా నిత్యా సర్వాంగం మే సదాఽవతు । 19

ప్రాచ్యాం పాయాదేకలిగ్ యోగినీ పావకేఽవతు ।
డాకినీ దక్షిణే పాతు శ్రీమహాభైరవీ చ మామ్ । 20

నైరృత్యాం సతతం పాతు భైరవీ పశ్చిమేఽవతు ।
ఇన్ద్రాక్షీ పాతు వాయవ్యేఽసితాగ్ పాతు చోత్తరే । 21

సంహారిణీ సదా పాతు శివకోణే సకర్త్రికా ।
ఇత్యష్టశక్తయః పాన్తు దిగ్విదిక్షు సకర్త్రికాః । 22

క్రీం క్రీం క్రీం పాతు సా పూర్వం హ్రీం హ్రీం మాం పాతు పావకే ।
హ్రూం హ్రూం మాం దక్షిణే పాతు దక్షిణే కాలికాఽవతు । 23

క్రీం క్రీం క్రీం చైవ నైరృత్యాం హ్రీం హ్రీం చ పశ్చిమేఽవతు ।
హ్రూం హ్రూం పాతు మరుత్కోణే స్వాహా పాతు సదోత్తరే । 24

మహాకాలీ ఖడ్గహస్తా రక్షఃకోణే సదాఽవతు ।
తారో మాయా వధూః కూర్చం ఫట్ కారోఽయం మహామనుః । 25

ఖడ్గకర్త్రీధరా తారా చోర్ధ్వదేశం సదాఽవతు ।
హ్రీం స్త్రీం హూం ఫట్ చ పాతాలే మాం పాతు చైకజటా సతీ ।
తారా తు సహితా ఖేఽవ్యాన్మహానీలసరస్వతీ । 26

ఇతి తే కథితం దేవ్యాః కవచం మన్త్రవిగ్రహమ్ ।
యద్ధృత్వా పఠనాన్భీమః క్రోధాఖ్యో భైరవః స్మృతః । 27

సురాసురమునీన్ద్రాణాం కర్తా హర్తా భవేత్స్వయమ్ ।
యస్యాజ్ఞయా మధుమతీ యాతి సా సాధకాలయమ్ । 28

భూతిన్యాద్యాశ్చ డాకిన్యో యక్షిణ్యాద్యాశ్చ ఖేచరాః ।
ఆజ్ఞాం గృహ్ణంతి తాస్తస్య కవచస్య ప్రసాదతః । 29

ఏతదేవం పరం బ్రహ్మకవచం మన్ముఖోదితమ్ ।
దేవీమభ్యర్చ్య గన్ధాద్యైర్మూలేనైవ పఠేత్సకృత్ । 30

సంవత్సరకృతాయాస్తు పూజాయాః ఫలమాప్నుయాత్ ।
భూర్జే విలిఖితం చైతద్గుటికాం కాఞ్చనస్థితామ్ । 31

ధారయేద్దక్షిణే బాహౌ కణ్ఠే వా యది వాన్యతః ।
సర్వైశ్వర్యయుతో భూత్వా త్రైలోక్యం వశమానయేత్ । 32

తస్య గేహే వసేల్లక్ష్మీర్వాణీ చ వదనామ్బుజే ।
బ్రహ్మాస్త్రాదీని శస్త్రాణి తద్గాత్రే యాన్తి సౌమ్యతామ్ । 33

ఇదం కవచమజ్ఞాత్వా యో భజేచ్ఛిన్నమస్తకామ్ ।
సోఽపి శస్త్రప్రహారేణ మృత్యుమాప్నోతి సత్వరమ్ । 34

ఇతి శ్రీభైరవతన్త్రే భైరవభైరవీసంవాదే
త్రైలోక్యవిజయం నామ ఛిన్నమస్తాకవచం సమ్పూర్ణమ్

# శ్రీ ఛిన్నమస్తాదేవి అష్టోత్తరశతనామ స్తోత్రమ్

### శ్రీ పార్వతీ ఉవాచ :

నామ్నాం సహస్రం పరమం, ఛిన్నమస్తా ప్రియం శుభం ।
కథితం భవతా శంభో సద్యశ్శత్రు నికృంతనమ్ ॥ 1

పునః పృచ్ఛామ్యహం దేవ కృపాం కురు మమో పరి ।
సహస్రనామ పాఠే చ అశక్తో యః పుమాన్ భవేత్ ॥ 2

తేన కిం పఠ్యతే నాథ తన్మే బ్రూహి కృపామయ ॥

### శ్రీ సదాశివ ఉవాచ :

అష్టోత్తర శతనామ్నాం పఠ్యతే తేన సర్వదా ।
సహస్ర నామ పాఠస్య ఫలం ప్రాప్నోతి నిశ్చితమ్ ॥

ఓం అస్యశ్రీ ఛిన్నమస్తాష్టోత్తర శతనామ స్తోత్రస్య సదాశివఋషిః అనుష్టుప్ఛందః శ్రీ ఛిన్నమస్తా దేవతా, మమ సకల సిద్ధి ప్రాప్తయే జపే వినియోగః ॥

ఛిన్నమస్తా మహావిద్యా మహాభీమా మహోదరీ ।
చండేశ్వరీ చండమాతా చండముండ ప్రభంజనీ ॥ 1

మహా చండా చండరూపా చండికా చండ ఖండినీ ।
క్రోధినీ క్రోధ జననీ క్రోధరూపా కుహూః కలా ॥ 2

కోపాతురా కోపయుతా కోప సంహారకారిణీ ।
వజ్ర వైరోచనీ వజ్రా వజ్రకల్పా చ డాకినీ ॥ 3

డాకినీ కర్మ నిరతా డాకినీ కర్మ పూజితా ।
డాకినీ సంగ నిరతా డాకినీ ప్రేమ పూరితా ॥ 4

ఖట్వాంగ ధారిణీ సర్వా ఖడ్గ కర్పరధారిణీ ।
ఛిన్నముండధరా ఛిన్నా చండ విద్యా చ చిత్రిణీ ॥ 5

ఘోర రూపా ఘోర దృష్టిః ఘోరారావా ఘనోదరీ ।
యోగినీ యోగనిరతా జపయజ్ఞ పరాయణా ॥ 6

యోని చక్ర మయీ యోని ర్యోనిచక్ర ప్రకీర్తనీ ।
యోని ముద్రా యోనిగమ్యా యోనియంత్ర నివాసినీ ॥ 7

యంత్ర రూపా యంత్ర మయీ యంత్రేశీ యంత్ర పూజితా ।
కీర్త్యా కపర్దినీ కాళీ కంగాళీ కలవికారిణీ ॥ 8

భద్రరూపా మహాభద్రా సుభద్రా భద్రపాలినీ ।
ఆరక్తా రక్ష నయనా రక్త పానపరాయణా ॥ 9

భవానీ భూతిదా భూతి ర్భూతి దాత్రీచ భైరవీ ।
భైరవాచార నిరతా భూత భైరవ సేవితా ॥ 10

## ప్రతి అవతారమునకు ఒక ప్రత్యేకత



దశమహావిద్యలు పేరుకు తగ్గట్టుగ అపారమైన జ్ఞాన మూర్తులుగా తెలుపబడ్డారు. ప్రతి ఒక అవతారము ఒక ప్రత్యేకతను కలిగి ఉంది. ఆధ్యాత్మికతను సంతరించుకున్నవారికి ఈ దశమహావిద్యలు ఎంతో ప్రేమ, ధైర్యము, జ్ఞానముతో కనిపిస్తాయి. తాంత్రికులకు ఆరాధ్య దేవతలుగా ఈ పది మంది దేవతలు ప్రాముఖ్యం చెంది ఉన్నారు. వీరిలో మొదటి ఐదుగురు దేవతలు ఉగ్రదేవతలుగా గుర్తించబడ్డారు. కానీ వారు నిజానికి దయామయులుగా ఉంటారు. మిగిలిన ఐదుగురు దేవతలు శాంత స్వరూపులుగా కనిపిస్తారు. దశమహావిద్యలు అని పేర్కొనబడిన పది మంది ఆదిపరాశక్తి అంశల యొక్క కథలు, మంత్రాలు మరియు ఆ దేవతల యొక్క స్వరూపాల గురించి నియమ బద్ధంగ పఠించినపుడు ఆయా మంత్రాల యొక్క అధిష్టాన దేవతలయిన దశమహావిద్యలు అనుగ్రహిస్తాయి అని చెబుతారు.

## ఐహిక లాభమునకే ఉపాసన

జగన్మాత భుక్తిముక్తి ప్రదాయిని. అనగా ఐహిక లాభములను ఆముష్మిక లాభములను కూడా సమముగా ప్రసాదించగలదు. ఎక్కువగా మానవులు ఈ శక్తులను ఐహికలాభముల కోసమే ఉపాసించటం కనిపిస్తుంది.

## జాతకములోని చెడులను నిర్మూలించే మాత

జాతకములో బలం లేకపోవటం పూర్వజన్మల చెడుకర్మ వల్ల కలుగుతుంది. దానిని పోగొట్టుకొని సుఖశాంతులతో జీవితం గడపవలె నని ప్రతివానికీ ఉంటుంది. దానికి దైవబలం తప్పనిసరిగా కావాలి. దశమహావిద్యల ఉపాసనద్వారా జాతకములోని చెడును నిర్మూలించు కోవటం సాధ్యం అవుతుంది. శక్తి అనుగ్రహం వల్ల పూర్వకర్మల చెడు ప్రభావం భస్మీపటలం అవుతుంది. కనుక దోషాన్ని బట్టి ఏ దేవతా ఉపాసన అవసరమో చూచుకొని దానిని ఆచరించడం ద్వారా సుఖ శాంతులతో కూడిన జీవితాన్ని పొందవచ్చు అని దశమహావిద్యల ఉపాసకులు చెబుతారు.

## సృష్టి రహస్యానికి ప్రతీకలు

సత్తు అసత్తు తానైన, అవ్యక్తమైన పరమేశి తత్త్వము పదివిధములైన నామరూపములుగా వ్యక్తపరచు లీలయే దశమహాశక్తులు. ఇవి సృష్టి



రహస్యానికి ప్రతీకలు. నానాత్వ ఏకత్వరూపములు అమ్మ స్వేచ్ఛా లీలలు. పరమేశ్వరి సంకల్ప ప్రతీకలు. స్థూల-సూక్ష్మ అండ-పిండ-బ్రహ్మాండ పరిపాలనలో అమ్మకు సహాయపడు అదృష్ట-అద్భుత శక్తులు. నవగ్రహాధి దేవతలుగా, నానా రూపధారులుగా, కఠినత కారుణ్యము రూప స్వభావ ములుగా కొన్ని శక్తులు, మనోహరత మాధుర్యము మూర్తీభవించిన మాతృస్వరూపములుగా మరికొన్ని శక్తులు, ఘోర-అఘోర రూపములను సమయ సందర్భములను అనుసరించి ధరించుచున్న దయార్ద్రశక్తులే దశ మహావిద్యలు. సత్వగుణసంపన్నమైన ఆధ్యాత్మిక భావనయే ఆదిపరాశక్తి. తల్లి ధర్మపరిరక్షణకై పరిసరాలను తానే సృష్టించుకొని, వానికి అనుగుణముగా ఉండే రూపములో అయిన ప్రకటనమే దశమహాశక్తుల ఆవిర్భావము.

## దశావతారాలే మహావిద్యలుగా భావన



నారాయణుని దశావతారములే దశమహావిద్యలుగా భావిస్తారు. స్త్రీ పురుష భేదము మన చర్మ చక్షువులకు మాత్రమే. మాయ తొలగిన కన్నులకు మాధవ తత్త్వము అర్థమవుతుంది. పంచ భూత, పంచేంద్రియ పరిరక్షణ బాధ్యతా నిర్వాహకమూర్తులు ఈ దశ మహావిద్యలు. సూక్ష్మరూపములో పరిశీలిస్తే ఈ దశమహావిద్యలు మానవ దేహమున వివిధ చక్రములను కుండలినీ శక్తిద్వారా వ్యాపింపచేయుచూ, శక్తివంతము చేయుచున్నదన్న మాట యోగసాధకులు అంగీకరించినదే.

## అంతర్యాగము, బహిర్యాగము

అంతర్ముఖ సమారాధ్యా, బహిర్ముఖ సుదుర్లభ అయిన తల్లిని చక్రములు, యంత్రములు, విగ్రహరూపములలో ఆరాధిస్తే బహిర్యాగము అంటారు. మన శరీర చక్రములుగా భావించి, నీవారసూక మాత్రమైన తల్లిని గుర్తించి చేసే ఆరాధనను అంతర్యాగము అంటారు.

## ఉగ్ర శక్తులు, సౌమ్య శక్తులు

దశ మహాశక్తులలో కొన్ని ఉగ్ర తత్త్వము కలవి. మరికొన్ని సౌమ్య తత్త్వము కలవి (ఘోర–అఘోర). ఉగ్రతత్త్వ శక్తులు కాళి కులమునకు



సంబంధించినవి. సౌమ్య శక్తులు శ్రీకులమునకు సంబంధించినవి. సౌమ్యశక్తులను సంప్రదాయబద్ధమైన దక్షిణాచార మార్గములో ఆరాధిస్తారు. ఉగ్రశక్తులను సంప్రదాయ విరుద్ధమైన వామాచార పద్ధతిలో ఆరాధిస్తారు. కొన్ని విద్యలు ఘోర, అఘోర రూపములలో సమయమును బట్టి ప్రకటితమైన వేళ వాటిని ఉభయ పద్ధతులలోను ఆరాధిస్తారు.

## ఎవరు గొప్ప?



దశ మహావిద్యలలో ఎవరికీ వారే గొప్పవారు. ఎవరికి వారే పరమ శక్తి వంతులు. ప్రసాద గుణ సంపన్నులు. ఎవరిని ఉపాసించినను ముక్తి ప్రసాదకులే. వీరు ప్రత్యేక దేవతలు కారు. జగన్మాతయగు ఆద్యాశక్తి యొక్క వివిధ రూపములు. కనుక ఎవరిని ఉపాసించినా భుక్తి ముక్తులను ఇవ్వగలరు. కాని వారివారి లక్షణములను బట్టి ఒక్కొక్క ప్రత్యేక వరమును అధికముగా ఇవ్వగలరు. కనుక జాతకమున గల ఒక్కొక్క దోషమునకు ఒక్కొక్క మహావిద్య ఉపాసన ఉత్తమము అని తెలియుచున్నది.

## సాత్త్విక, రాజసిక దేవతలు



రవి కుజులు రాజసిక గ్రహములు. కనుక త్రిపుర భైరవి, బగళాముఖి రాజసిక దేవతలు. వీరు ఉగ్రరూపులు. వీరి ఉపాసన కష్టతరము. ఇక బుధ చంద్రులు మిశ్రమ గ్రహములు. అనగా వారి స్థితిని బట్టి మంచీ చెడూ రెండూ చేయగలరు. కనుక మాతంగి, భువనేశ్వరి అనువారు వీరికి అధిదేవతలు. వీరి ఉపాసన సాత్వికమునకు, రాజసమునకు మధ్యస్తంగా ఉంటుంది. ఇక మిగిలినది శనీశ్వరులు. వీరికి కాళి అధిదేవత. రాహుకేతువులకు ఛిన్నమస్త, ధూమావతులు అధిదేవతలు. వీరి ఉపాసన బహు కష్టతరము. వివిధ ఆటంకములు, భయమును గొలిపే పరీక్షలతో కూడి ఉంటుంది. అంత మాత్రాన వీరిని తామసిక దేవతలు అనుట తప్పు.

## తత్వప్రకారము విభజన

ఈ దశ మహా విద్యల తత్వాన్ని చూస్తే, అవి ఇలా సూచిస్తాయి.

కాళీ, ఛిన్నమస్త – కాల పరిణామము.

తార, మాతంగి – వాక్కు, వ్యక్తావ్యక్తము.

త్రిపుర సుందరి, కమల – ఆనందము, సౌందర్యము.

భువనేశ్వరి, ధూమావతి – అంతరాళము, అతీత పరబ్రహ్మ శక్తి.

భైరవి, బగళాముఖి – శక్తి, గతి, స్థితి.

## దశమహావిద్యలను సామాన్యులు ఆరాధించవచ్చా?



దశ మహావిద్యలను నిరభ్యం తరంగా ఎవరైనా ఆరాధించవచ్చు. అమ్మను కొలవడానికి అందరూ అర్హులే. కానీ వామాచార పద్ధతులలో దశ మహావిద్యలను ఆరాధించదల చినవారు ముందుగా ఉపాసకులను, గురువులను దర్శించి విధి విధానా లను తెలుసుకోవడం మాత్రం తప్పనిసరి. ఈ పుస్తకములో అటువంటి వామాచార పద్ధతులు ఎక్కడా పేర్కొనలేదు.

ఈ దశ మహావిద్యల యొక్క స్తోత్రాలు, హృదయం, కవచం, అష్టోత్తరం, సహస్రనామము.. మొదలగు వాటిని పారాయణ చేయుటకు గురూపదేశంతో పనిలేదు. స్త్రీ పురుష, వయో భేదం లేకుండా అందరూ నిర్భయంగా ఏ సమయంలో నైనా పారాయణ చేసి ఆ ఆదిశక్తి అనుగ్రహాన్ని పొందవచ్చును.

## ఏడవ మహావిద్య శ్రీ ధూమావతీ దేవి

దశమహా విద్యలలో 7వ మహావిద్య శ్రీ ధూమావతీ దేవి. ఈమె ఒక వితంతువుగా కనిపిస్తుంది. ఈ దేవతకి ఉచ్చాటన దేవత అని పేరు. తన ఉపాసకుల కష్టాల్ని, దరిద్రాల్ని ఉచ్చాటన చేసి అపారమైన ఐశ్వర్యాన్ని ప్రసాదిస్తుంది. జీవుని ఆకలి, దప్పికల బాధలకు, కలహ దారిద్ర్యాలకు ఈమె కర్త. ఈ తల్లి అనుగ్రహం ఉంటే సమస్యలన్ని దూరం అవుతాయి. తాంత్రికులు సిద్ధిని పొందటానికి ఈమెను ఎక్కువగా



స్మశానాలలో రాత్రివేళలలో పూజిస్తుంటారు. ఈ అమ్మవారిని ఆరాధించే వారలకు భూతప్రేత దరిద్ర క్షుద్ర విద్యాదులు పనిచేయవు అని అంటారు. ప్రమాద నివారణలకు, యుద్ధంలో విజయానికి మరియు రోగ నివారణకు అమ్మవారి ఆరాధన తప్పనిసరి. ఈమె ఉపాసనా ప్రయోగమును ప్రధానంగా శత్రువులను నిర్మూలించడానికి చేస్తారు.

ఈ దశమహావిద్యా మాతలకు సంబంధించిన జననం, అవతార రహస్యం, పూజా విధానాలు, అనుగ్రహం చూపే విధానాలు, ఉపాసనా మార్గాలు మొదలైన ఈ పుస్తకంలో పేర్కొన్న అనేక విషయాలు; ఆయా దేవతలకు సంబంధించిన స్తోత్రాలు, ప్రార్థనలు, ధ్యానాలు, కవచాలు, హృదయాలు, అష్టోత్తరాలు... మొదలైన అన్ని విషయాలకు సంబంధించిన విషయసేకరణకు మాకు అనేక గ్రంథాలు, మాస, పక్ష, వార, దిన పత్రికలు, అంతర్జాలము ఎంతగానో సహకరించినది. ఈ విధముగా లభ్యమైన సమాచారమునకు తగిన పటములను జోడించి మీకు సంకలనముగా అందించాము. ఆయా మూల రచయితలకు, వ్యాసకర్తలకు పేరుపేరునా ధన్యవాదాలు తెలుపు కొంటున్నాము. తప్పులు దొర్లకుండా ఉండుటకు అనేక జాగ్రత్తలు తీసుకొన్నాము. అయినా అక్కడక్కడా కొన్ని అక్షర దోషాలు, భావ దోషాలు దొర్లి ఉండవచ్చును. సహృదయులైన పాఠకులు అలాంటి దోషాలను మా దృష్టికి తెచ్చినచో మా తరువాతి ముద్రణలో వీటిని తప్పక సరి చేసుకొనగలము.

మా పాఠకులు అందరికీ దశమహా విద్యలకు ఆదిదేవత అయిన మాత అనుగ్రహం కలగాలని, తద్వారా వారు తమ జీవితంలో అమృత స్థానాన్ని పొందాలని ఆశిస్తూ...

- నిత్య పబ్లికేషన్స్



# విషయసూచిక



# శ్రీ ధూమావతి దేవి



దశమహా విద్యలలో **7వ మహావిద్య శ్రీ ధూమావతీ దేవి.** ధూమ వర్ణంతో దర్శనమిచ్చే శ్రీ ధూమావతీ దేవికి జ్యేష్ఠమాసం శుక్లపక్ష అష్టమీ తిథి ప్రీతిపాత్రమైనది. దశమహావిద్యలలో అతి విచిత్రమైన అవతారం



కలిగిన మాత ధూమవతీ దేవి. ఈమె ఒక వితంతువుగా కనిపిస్తుంది. ఈ దేవతకి ఉచ్చాటన దేవత అని పేరు. తన ఉపాసకుల కష్టాల్ని, దరి ద్రాల్ని ఉచ్చాటన చేసి అపారమైన ఐశ్వర్యాన్ని ప్రసాదిస్తుంది. ఈ ధూమావతీ దేవి ఆరాధన వల్ల సాధకుడికి వివిధ రోగాల నుంచి, శోకాల నుంచి విముక్తి కలుగుతుంది. ఈ దేవి ఉగ్రతారయే. ఈమె శరణాగతి వల్ల విపత్తులు నాశనమై సంపదలు లభిస్తాయి. జీవుని ఆకలి, దప్పికల బాధలకు, కలహ దారిద్ర్యాలకు ఈమె కర్త. ఈ తల్లి అనుగ్రహం ఉంటే సమస్యలన్ని దూరం అవుతాయి.

## ధూమావతి నామం

ఒకనాడు పరమశివుడు ధ్యానంలో ఉండగా పార్వతీదేవి ఆకలిగా ఉంది అని అడుగగా శివుడు వేచి ఉండమనెను, మరల కొంత సమయం గడిచాక పార్వతిదేవి శివుని చూచి ఆకలి అని అడుగగా శివుడు మరల వేచి ఉండమని చెప్పెను, అది విని పార్వతిదేవి మిక్కిలి కోపంతో శివుని మ్రిగేసింది. ఆమెలో ఉన్న శివుడు కోపంతో మూడోకన్ను తెరచి పార్వతి దేవితో ఇట్లనెను "ఈ లోకంలో పురుషుడు అనే వాడు ఉండడు అనెను" దాని ప్రతిఫలమే ఆమె వితంతువు రూపం. శివుడు మూడో కన్ను తెరువగా ఆమెలో నుండి పొగ రాసాగింది అందువల్లనే ఆమెకు ధూమవతి అని పేరు వచ్చినది అంటారు.

## వికారమైన రూపం



ఈమె చూడటానికి వికారంగా, చేతిలో చాటతో, పొగసూరిన బట్టలతో, మెల్లకళ్ళతో, గుర్రంలేని బండిపై కూర్చుని ఉంటుంది. ఈమె వికారమైన రూపం మనకి సౌందర్యాన్ని మించింది ఎంతో ఉందని తెలియజేస్తుంది. ధూమవతి సిద్ధిని ప్రసాదించే తల్లి. ఈమెను ముఖ్యంగా వితంతువులు, పెళ్ళికాని వారు పూజిస్తుంటారు. ఈమెకు చాలా అరుదుగా ఆలయాలు ఉంటాయి. తాంత్రికులు సిద్ధిని పొందటానికి ఈమెను ఎక్కువగా స్మశానాలలో రాత్రివేళలలో పూజిస్తుంటారు. ఈమెను చూస్తేనే ఎవరికైనా తీవ్రమైన భయాందోళనలు కలుగుతాయి. కానీ ఈమెను ఆరాధించేవారికి అపూర్వమైన వరాలను ఇచ్చి ఆదరిస్తుంది.

## నారద పంచరాత్రం ప్రకారం ధూమావతి

నారద పాంచరాత్రం ప్రకారం అసుర యుద్ధంలో అమ్మవారు తన నుండి ఉగ్ర చండికను పుట్టించగా ఆమె అసురులను చంపి వారి రక్తమాంసాలను భుజించింది. దాని వలన ఆమెలో తమోగుణ ప్రవృత్తి అధికం కాసాగింది. దానిని నియంత్రించడానికి అమ్మకు ఆకలి వేసింది. అదే సమయంలో పార్వతి దేవి తనకు చాలా ఆకలిగా ఉందని శివుడితో తెలిపింది. కానీ యోగ సమాధిలో ఉన్న శివుడు ఆ మాటలను పట్టించుకోలేదు. అలా ఎన్ని సార్లు తన క్షుద్బాధను తెలిపిన శివుడు పట్టించుకోక

పోయేసరికి కోపంతో పార్వతిదేవి శివుడినే మింగివేసింది. అప్పుడు ఆమె శిరస్సు నుండి పొగలు రావటం ప్రారంభం అయ్యాయి. అలా అవి శరీరం అంతా వ్యాపించాయి. అప్పుడు అమ్మవారి కడుపులో ఉన్న శివుడు పార్వతితో "నన్ను మింగివేసిన కారణంగా నీ శరీరం అంతా పొగలు వ్యాపించాయి. కాబట్టి ఇక నుండి నువ్వు ధూమావతి లేక ధూమ్రా అని పిలవబడతావు" అని అన్నాడు. ఇక్కడ శివుని మింగడం అంటే తన స్వామిత్వాన్ని నిషేధించడం మాత్రమే అని అర్థం.

## శక్తి, శివుల అభేద్యం

ధూమావతి బ్రతికే ఉంది అంటే స్వామి వారుకూడా బ్రతికే ఉంటారు. ఎందుకంటే శక్తి శివులు ఒకరు లేక ఇంకొకరు లేరు కనుక స్వామి చేసిన లీలను గుర్తించి స్వామిని ఆర్తిగా పిలిచినా హైమావతి మాటకి గౌరవం ఇచ్చి తననుండి బయటకు వచ్చేసాడు శంకరుడు.

## శివుని మ్రింగిన తరువాత అమ్మవారి రూపం

శివుని మ్రింగిన తరువాత అమ్మవారి రూపం విచిత్రంగా మారి పోయింది నిత్యం అమ్మవారి సిగ చంపకాది సర్వఋతువుల పుష్పలతో విరాజిల్లిన జడ ఇప్పుడు శిగమూడిలేని విరబోసిన కేశపాశాలతో భయం గొల్పుతుంది. నిత్యం మాంగల్యాది సకలాభరణాలతో విరాజిలే తల్లి మెడ ఇప్పుడు ఏ ఆభరణాలు లేకుండా బూడిదతో అలికినట్లు ఉంది. పౌర్ణమి చంద్రునిలా ఉండే అమ్మవారి మోము ఇప్పుడు చిక్కిపోయిన ముఖంలా కనిపిస్తుంది. వీటితో పాటు అమ్మవారు ఉన్న స్మశానంలో కాకి ధ్వజపటంగా ఉన్న అశ్వాలు లేని రథాన్ని ఎక్కి రెండు చేతులతో

చాటా చీపురుకట్ట పట్టుకొని కాకుల అరుపుల మధ్యలో అమ్మవారు కనిపిస్తుంది. ఈపైన చెప్పిన ఏ ఒక్కటి మంచిశకునాలు కావు కానీ అమ్మవారు సర్వశుభంకరి. దేవదేవాదుల ద్వారా స్తుతించబడిన తల్లి ఈ జగజ్జనని.

## శ్మశానంలో పూజింపబడే మాత

అమ్మవారిని వామాచారంలో పూజిస్తారు. స్మశానంలో అమ్మవారు పూజింపడుతారు. ఈ అమ్మవారిని ఆరాధించే వారలకు భూతప్రేత దరిద్ర క్షుద్ర విద్యాదులు పనిచేయవు అని అంటారు.

## ధూమావతి స్వతంత్ర శక్తి



ధూమావతి దేవి ఒక స్వతంత్ర శక్తి. ఎందు కంటే ఆమెతో పాటు స్వామి ఉండరు కాబట్టి. మళ్ళీ అమ్మవారు స్వయం నియంత్రిక శక్తి కూడా. తన భర్త అయిన శివుని మింగివేసిన కారణంగా ఆమెది విధవ రూపం కూడా. అందుకే అమ్మవారు తెల్లని చీరతో, నుదుటన బొట్టు లేకుండా, గుర్రంలేని రథం మీద, కాకిని ధ్వజంగా కలిగి, చేత ఖాళీ చాటతో, ఆకలితో ఉన్నదానివలె కనిపిస్తుంది.

## స్వాతంత్ర తంత్రానుసారం అమ్మవారు

స్వాతంత్ర తంత్రానుసారం చూస్తే దక్ష యజ్ఞంలో దూకిన సతీదేవి నుండి వ్యాపించిన పొగలో నుండి ధూమావతి దేవి జన్మించింది. ప్రమాద నివారణలకు, యుద్ధంలో విజయానికి మరియు రోగనివారణకు అమ్మ వారి ఆరాధన తప్పనిసరి.

## శతపత బ్రాహ్మణం ప్రకారం అమ్మవారు

శతపత బ్రాహ్మణంలో ధూమావతి దేవి మరియు నిఋత్రీ దేవి ఒక్కరే. అమ్మవారి ఉపాసకుల మీద దుష్టాభిచారక ప్రభావం ఉండదు అంటారు. దుర్గా సప్తశతిలో అమ్మవారికి వాభ్రవి మరియు తామసి అనే పేర్లు కూడా ఉన్నాయి. అమ్మవారు స్థితప్రజ్ఞతకు ప్రతీక అంటారు.

## కన్యగా మిగిలిన అమ్మవారు

దుర్గా సప్తశతిలో ఎవరైతే నన్ను జయిస్తారో అతడినే నా పతి అని అంటుంది. అప్పుడు ఎవరూ ముందుకు రాకపోవడం చేత అమ్మవారు కన్యగా మిగిలిపోయినది. నారద పంచరాత్రాన్ని బట్టి అమ్మవారు శరీరం నుండి ఉగ్రచండి ప్రకటించబడినది. అప్పుడు వందలాది నక్కలు అరిచినట్లుంది. శివుణ్ణి మింగడానికి సిద్ధపడడం వల్ల శివుడు అమ్మవారిని పత్నిగా స్వీకరించలేదు.

## ధూమావతి రూపం నుండి గ్రహించాల్సింది

ధూమావతి రూపం నుండి ముఖ్యంగా గ్రహించాల్సిన విషయం స్త్రీ ఏ రూపం లోనైనా అమ్మవారి స్వరూపమే. అలా చూడని పక్షంలో అమ్మవారి కటాక్షం కలగదని తెలుస్తుంది. కొందరు పూర్వ సువాసినులను అనవసరంగా ప్రతి దానికి తిడుతారు. దానివల్ల ధూమావతి



ఆగ్రహిస్తుంది. ఏ విషయమైనా వారికీ శాంతంగా, నొప్పించకుండా చెప్పాలి. ఆలా చెయ్యకపోతే ధూమావతి కటాక్షరహితకరణంగా జేష్టాదేవి ఇంట్లో ప్రవేశిస్తుంది అని భావన. ఇంట్లో గల పూర్వసువాసినీలను గౌరవంగా చూసుకోవాలి. దేవుడు రాసిన తలరాతని మనం మార్చలేం కనుక వారిని కించపరచడం వేరుగా మాట్లాడడం చెయ్యకూడదు.

## ధూమావతి లక్ష్మీదేవికి అక్క



ధూమవతి ఉపాసనవలన విపత్తులను నశించడం, రోగనివారణ, యుద్ధ జయం, ఉచ్చాటన ప్రయోగం మొదలైనవి సిద్ధిస్థాయి. ప్రపంచంలో రుద్ర కోపం వల్ల జ్వరం, ఉన్మాదం, దాహం ఏర్పడతాయి. మూర్ఛ, వికలాంగత యముని కోపం వల్ల వస్తాయి. కీళ్ల నొప్పులు పక్షవాతం మొదలైనవి వరుణ దేవుడివల్ల వస్తాయి. కలహం ఆకలి దప్పికలు వికృతి కోపంవల్ల వస్తాయి. ధూమావతి లక్ష్మీదేవికి అక్కగా పేర్కొంటారు.

## సుతరా రూపంలో అమ్మవారు

ఋగ్వేదంలోని రాత్రి సూక్తం అమ్మవారిని సుతరా అని పేర్కొంటుంది. అంటే సుఖంగా చరింప చేసేది అని అర్థం. ఆగమ శాస్త్రంలో భూతి అని పిలువబడుతున్నది. భూతి అంటే ఐశ్వర్యం. ధూమవతి అమ్మవారు అనుగ్రహిస్తే స్థిత ప్రజ్ఞత్వం కలుగుతుందని నమ్మకం.

## యోగనిద్రా స్వరూపిణి

ధూమవతి ఒక వితంతువుగా తంత్ర శాస్త్రంలో పేర్కొనబడినది. ఈమెను దూమ్రావతి అని కూడా అంటారు. యోగనిద్రా స్వరూపిణి అంటే యోగులైనవారిని యోగనిద్రలో ఉంచేటువంటి శక్తి. ఈమె ఉగ్రదేవత.

## కేతు గ్రహానికి అధిష్టాన దేవత

దశ మహావిద్యలకు జ్యోతిష శాస్త్ర సారుప్యత దృష్ట్యా ధూమవతి కేతుగ్రహాదిష్టాన దేవత. ఈమె చూడటానికి వికారంగా, చేతిలో చాటతో, పొగసూరిన బట్టలతో, మెల్లకళ్ళతో, గుర్రంలేని బండిపై కూర్చుని ఉంటుంది. ధూమవతి సిద్ధిని ప్రసాదించే తల్లి.

## నిద్రా, నిద్రారాహిత్యాల దేవత

యత్ర అగ్నిః తత్ర ధూమః – అవిద్య నుండి విద్యను, విద్యాతత్త్వాన్ని అనుభూతి చేయగలది ధూమావతి. మానవుని నిద్రా, నిద్రారాహిత్యాలు ధూమవతి యొక్కవైభవము.

## మహామౌని

ధూమావతి అంటే ఉపాసనా పరంగా మహామౌనమని కూడా అర్థం. ఉపనిత్తులలో పేర్కొన్న భూమా విద్య ఇమేనని చెబుతారు. ఇది పూర్ణ విద్య మరియు అపూర్ణవిద్య కూడా – విద్యా విద్యా ఉ స్వరూపిణి.



## జ్యేష్టాదేవి కృపాకారకురాలు

లౌకికంగా ఆలోచిస్తే లక్ష్మీదేవి అనుగ్రహం పొందాలంటే ముందు జ్యేష్టాదేవి కృపతో అలక్ష్మిని తొలగించికోవాలి. జ్యేష్టాదేవి దయ ఉంటేనే లక్ష్మీదేవి ప్రసాదించే సంపద మనకు దక్కుతుంది. ధూమావతి మంత్రాలలో జ్యేష్టాదేవి మంత్రంకూడా వుంది. లోకంలో సంపద ఉంచాలన్నా తీసేయాలన్నా ఈమే కారణం.

## ధూమవతీ గాయిత్రి

ఓం ధూమవత్యైచ విద్మహే సంహారిణ్యైచ ధీమహి
తన్నో ధూమ ప్రచోదయాత్

## రూపంలోని ఆంతర్యం

ఈమె రూపం సాధకులకు ఒక పాఠం నేర్పుతుంది. పైన మెరుగులతో కనిపించే అందం శాశ్వతంకాదు. సాధకులు అటు వంటి అశాశ్వతమైన వాటి గురించి అర్రులు చాచకుండా తనలో తాను చూచుకొని శాశ్వత మైన జీవిత సత్యాన్ని తెలుసుకో వాలని ఆమె రూపం తెలియ పరుస్తుంది.



## సిద్ధులు కొలిచే దేవత

ఎంతటివారినైనా ఉచ్చాటన చేయగల తీవ్రశక్తి ఆమె. ఈమెను సిద్ధులు ప్రసాదించే దేవతగా కొలుస్తారు. ఈమె ఉపాసనా ప్రయోగమును ప్రధానంగా శత్రువులను నిర్మూలించడానికి చేస్తారు. తనకు అనుకూలంగా లేని వారిని తన నుండి దూరంగా వెళ్ళగొట్టదలచినప్పుడు ఈ దేవతా ప్రయోగం చేస్తారు. ఈమె మహోన్నతమైన ఐశ్వర్యాన్ని కూడా ఇస్తుంది. ఈమె సాధనలు రహస్యంగా శ్మశానంలోను, అడవిలోను జరుగుతుంటాయి. ఈమెకు వృద్ధకాళి అని, ధూమ్రవారాహి అని రూపాలు కూడా ఉన్నాయి.

## ప్రళయకాలంలో కనిపించే దేవత

జల ప్రళయం భూమండలాన్ని ముంచెత్తేవేళ సృష్టిలోని ప్రతి వస్తువు విధ్వంసం అవుతుంది. ఈ భూమిమీద జీవి అంటూ ఏదీ మిగలదు. అంటే బ్రహ్మ సృష్టిని మరలా ప్రారంభించాల్సిన సమయం అన్నమాట. ఈ సమయంలోనే ధూమావతి ఉద్భవిస్తుంది అంటారు. అంటే ప్రళయ కాలంలో కనుపించే దేవతగా ధూమావతిని చెబుతారు.



## దైవికజ్ఞానం కలిగించే దేవత



ధూమావతి దేవీలో ప్రతికూల లక్షణాలు ఎన్ని ఉన్నా ఆమె సానుకూల దృక్పథం కలిగి ఉంటుంది. ధూమావతి దయార్ద్ర మరియు ఉదార హృదయ. దైవిక జ్ఞానం మరియు విజ్ఞానాన్ని పెంచే గొప్ప ఉపాధ్యాయు రాలు. ఈ మాత కలిగించే విజ్ఞానంతో మానవుడు మాయా ప్రపంచంలోని భ్రమలను తొలగించుకొని నూతన ఆలోచనలతో పయనిస్తాడు.

## శత్రుభయం నుండి రక్షణ

ధూమావతి ఆకర్షణీయం కాని రూపం ఈ మాయా ప్రపంచంలోని మిడిమిడి జ్ఞానాన్ని జయించి శాశ్వత సత్యాన్ని పొందటాన్ని నేర్పుతుంది. పేదరికం, వ్యాధి, పిల్లల మరణం, శాపం, వితంతుతనము, చేతబడి, దురదృష్టాలు మరియు కేతు గ్రహం యొక్క ప్రతికూల ప్రభావాల వంటి అనేక తీవ్రమైన సమస్యల నుండి ఆమె తన భక్తులకు బలమైన రక్షణను అందిస్తుంది. శత్రుభయం నుండి ధూమావతి తన భక్తులను రక్షిస్తుంది. పార్వతి, దుర్గా మరియు భాగవతి వంటి అనేక ఇతర పేర్లలో కూడా ధూమావతిని పిలుస్తారు.

## ఎప్పుడూ ఆకలి, దాహంతో ఉండే మాత

ధూమావతి ఇతర మహావిద్యల మాదిరిగా కాకుండా ఎటువంటి నగలతో అలంకరించబడదు. ధూమావతి పాత, మురికి బట్టలు ధరిస్తుంది

మరియు జుట్టును విరబోసుకుంటుంది. వ్యక్తుల మధ్య తగాదాలు సృష్టించే ధూమవతి ఎప్పుడూ ఆకలితో, దాహంతో ఉంటుంది. తోడల తంత్రము ప్రకారము ధుమావతి వరాహ అవతారానికి సమానమైన దేవతగా చెబుతారు.



## జనన మరణాల అంతిమ గురువు





కటిక పేదరికం నుండి బయట పడటానికి ధూమావతి సాధనే మార్గ మని చెబుతారు. అన్ని రకాల వ్యాధుల నుండి బయట పడటానికి ధూమావతిని పూజిస్తారు. ధూమావతిని జనన మర ణాల అంతిమ పాఠాలు బోధించే గొప్ప గురువుగా భావిస్తారు. ధూమావతి స్వభావం ప్రకాశమానం కాదు, అస్పష్టత అని చెబుతారు. అంటే ఒక విషయాన్ని అస్పష్టం చేయటం అంటే ఒక విషయాన్ని స్పష్టం చేయటం అని తెలుసు కోవాలి. ధూమావతి అజ్ఞానం యొక్క శక్తిని లేదా సృజనాత్మక శక్తి యొక్క అంశాన్ని సూచిస్తుంది.



## దేవతల్లో వైధవ్య రూపిణి



దేవతల్లో వైధవ్య రూపిణిగా దర్శనమిస్తుంది. బూడిద రంగు ఆకృతి, మాసినవస్త్రాలు, వేలాడే స్తనాలు, విరబూసిన జుట్టు, ఆకలి గొట్టు, రౌద్రమైన చూపు, బొట్టు లేని ముఖంతో చాలా వృద్ధురాలుగా ఈ అమ్మ వారిని మనం చూస్తాం! దరిద్రగొట్టు పెద్దమ్మ అని పిలువబడే ఆ అమ్మ ఈ అమ్మే అని కొందరు అంటారు.

## వృద్ధకాళిక



ధూమవతినే వృద్ధ కాళికగా మరి కొందరు అభివర్ణించారు. వరాహ ముఖంగా ధూమ్రవారాహిగా మరింత రౌద్రాకారంలో మరి కొందరు కొలుస్తారు. ఈ శక్తి రూపం బట్టి చాలామంది ఈ దేవతని ఆరాధించడానికి భయపడతారు కాని నిజానికి ఈ దేవి సులభ వరప్రదాయిని అని సాధకులు చెబుతారు.

## పిప్పలాదుడు పూజించిన మాత

ఋషుల్లో తొలుత పిప్పలాదుడు ఈ అమ్మవారిని పూజించారు అని వారి ద్వారానే ఈమె ఆరాధన విధానం జగతికి అందుబాటులోకి వచ్చింది అంటారు. గణపతిముని "విశ్వోచ్చాటన కామో ధూమావతి ముపాసిత" అని పేర్కొన్నారు అంటే మొత్తం విశ్వాన్ని ఉచ్చాటనం చేయగలిగే శక్తి ఈ దేవతకు ఉందట.

## శత్రువును దూరం చేసే మాత

ఎంతటి దుష్ట శత్రువునైనా ఈమెని ఆరాధించడం ద్వారా దూరం చేసుకోవచ్చు అంటారు. అంతేకాదు మానసిక భ్రమలు, మూర్ఛ, క్యాన్సర్, మెదడు కణతి, పక్షవాతం, కీళ్ళనొప్పులు వంటి భయంకర వ్యాధులు, దారిద్ర్యం, వ్యసనాలు ఇలా ఒక మాటలో చెప్పాలి అంటే సర్వ దుఃఖ సంహారిణిగా ధూమావతిని భావిస్తారు.

## శనిబాధలను దూరం చేసే మాత



ఈ దేవిని నిత్యం పూజించి ఆమె అనుగ్రహం పొందితే అంతకన్నా అదృష్టం ఉండదు. అందులో కలియుగంలో శనిబాధ దూరం కావాలి అంటే పురుష దేవతలలో కాలభైరవుని; స్త్రీ దేవతల్లో ధూమావతినే ఎక్కువ ఆరాధించాలి అని చెబుతారు. అలాగే రుద్రుల్లో ధూమావతిది కాలభైరవ అంశగా భావిస్తారు. దశావతారాల్లో మత్స్య అవతారంగా చెబుతారు.

## పూజకు నల్లని వస్త్రాలు

ధూమావతి యజ్ఞం చేసే చోటుకు కాకులు కూడా విరివిగా చేరతాయి అని అంటారు. ఇక ఈ దేవిని ఆరాధించేవారు నలుపు వస్త్రాలు ధరించి ఆరాధించాలి అని చెబుతారు. అలాగే ఈమె ఉచ్చాటన దేవత కనుక అపసవ్య దిశలో ప్రార్థించాలి. అంటే ఐశ్వర్యాన్ని ప్రసాదించు అన కూడ దని, దారిద్ర్యాన్ని వెళ్లగొట్టు అనాలి అని చెబుతారు. ఇలాగే ఏ కోరిక అయినా కోరుకోవాలి అంటారు.

## ధూమావతి మంత్రాలు

ఓం ధూం ధూం ధూమావతి స్వాహా

ఓం ధూం ధూం ధూమావతి అపదోద్ధరనాయ స్వాహా

శనివారం రోజున కాకులకు అన్నం పై కొద్దిగా కుంకుమ వేసి కాకబలి సమర్పించుట వలన కూడా జేష్ఠాదేవి అవతారం అయిన ధూమావతి ప్రసన్నురాలు అవుతుంది అని అంటారు.

## లక్ష్మీ దేవికి అక్క



దుర్గా సప్తశతిలో ఎవరైతే నన్ను జయిస్తారో అతడినే నా పతి అని అంటుంది. అప్పుడు ఎవరూ ముందుకు రాకపోవడం చేత అమ్మవారు కన్యగా మిగిలిపోయినది. నారద పంచరాత్రాన్ని బట్టి అమ్మవారు శరీరం నుండి ఉగ్ర చండి ప్రకటించబడినది. ధూమావతి ఉపాసన వలన విపత్తు లను పోగొట్టడం, రోగ నివారణ, యుద్ధ జయం, ఉచ్చాటన ప్రయోగం మొదలైనవి సమకూరుతాయి అంటారు. ధూమావతి లక్ష్మీ దేవికి అక్కగా పేర్కొంటారు.

## తమోదేవి

వేదాల్లో ఈమెను అప్రకాశానికి గుర్తుగా, రాత్రిగా చీకటికి ప్రతిరూపమైన తమస్సుగా, తమోదేవిగా వర్ణిస్తారు. అలాగే అలక్ష్మీ స్వరూపమైన జ్యేష్ఠా దేవిగా కూడా ఈమె రూపాన్ని భావిస్తారు. వెళ్ళగొట్టుట ఈ దేవత యొక్క లక్షణం. ధూమావతి దేవి స్తోత్రపఠనంవల్ల భక్తుల కష్టాలు తొలగిపోతాయి. ముఖ్యంగా ఈమె ఉచ్చాటన దేవత. దారిద్రాన్ని, రోగాలు శత్రువులను దేనినైనా ఈ దేవి ఉచ్చాటన చేస్తుందనుటలో సందేహం లేదు.

# శ్రీ ధూమావతి స్తోత్రమ్-1



కల్పాదౌయా కాళికాద్యాఽచీ కలన్మధుకైటభౌ
కల్పాంతే త్రిజగత్సర్వం ధూమవతీం భజామి తాం ॥ 1

ఘూర్ణా ఘూర్ణ కరా ఘోరా ఘూర్ణితాక్షీ ఘనస్వనా
ఘూతినీ ఘూతుకానాం యా ధూమవతీ భజామితాం ॥ 2

చర్వంతీం అస్థిఖండానం చండ ముండ విదారిణీం
చండాట్టహాసినీం దేవీం భజే ధూమావతీ మహమ్ ॥ 3

ఢమరూ డిండిమారావాం ఢాకినీ గణమండితామ్
డాకినీం భోగసంతుష్టాం భజే ధూమవతీ మహమ్ ॥ 4

శంకరీం శంకర ప్రాణాం సంకట ధ్వంసం కారిణీం
శత్రు సంహారిణీం శుద్ధాం శ్రయే ధూమవతీ మహమ్ ॥ 5

ప్రాతర్యాస్యాత్కుమారీ కుసుమకళికయా జాపమాలాం జపంతీ
మధ్యాహ్నే ప్రౌఢ రూపా వికసిత వదనా చారునేత్రా నిశాయామ్॥ 6

సంధ్యాయాం వృద్ధ రూపా గళితకుచయుగా ముండమాలాం వహంతీ
సా దేవీ దేవదేవీ త్రిభువన జననీ కాళికా పాతు యుష్మాన్ ॥ 7

# శ్రీ ధూమావతి స్తోత్రమ్-2



ప్రాతర్యాస్యాత్కుమారీ కుసుమకలికయా జాపమాలాం జపంతీ

మధ్యాహ్నే ప్రౌఢరూపా వికసితవదనా చారునేత్రా నిశాయాం,

సంధ్యాయాం వృద్ధరూపా గలితకుచయుగా ముండమాలాం

వహంతీ సా దేవీ దేవదేవీ త్రిభువన జననీ కాళికా పాతు యుష్మాన్ 1

బధ్వా ఖట్వాంగకోటౌ కపిలవరజటామండలం పద్మయోనేః
కృత్వాదైత్యో త్తమాంగే స్రజమురసి శిరశ్శేఖరం తారక్ష్యపక్షైః
పూర్ణం రక్తై స్సురాణాం యమమహిషమహాశృంగ మాదాయ పాణౌ
పాయాద్వో వంద్యమాన ప్రలయ ముది తయా భైరవః కాళరాత్ర్యామ్ 2

చర్వంతీ మస్తిఖండం ప్రకటకటకటా శబ్దసంఘాత ముగ్రం
కుర్వాణా ప్రేతమధ్యే కహకహ కహకహా హాస్యముగ్రం కృశాంగీ
నిత్యం నిత్య ప్రసక్తా డమరు డిమడిమాన్ స్ఫారయంతీ ముఖాబ్జం
పాయాన్నశ్చండికేయం ఝఝుఝఝుమఝుమా జల్పమానా భ్రమంతీ 3

టం టం టం టం టంటాప్రకర టమటమానాటఘంటాం వహం తీ
స్ఫేం స్ఫేం స్ఫేం స్ఫార కారాటకటకితహసా నాదసంఘట్టభీమా,
లోలం ముండాగ్రమాలా లల హలహలహా లోలలోలాగ్ర వాచం
చర్వంతీ చండముండం మటమటమటితే చర్వయంతీ పునాతు 4

వామేకర్ణే మృగాక ప్రళయపరిగతం దక్షిణే సూర్యబింబం
కంఠే నక్షత్ర హారం వరవికటజటాజూటకేముండమాలాం
స్కంధే కృత్వోరగేంద్రం ధ్వజనికరయుతం బ్రహ్మకంకాలభారం
సంహారే ధారయంతీ మమ హరతు భయం భద్రదా భద్రకాళీ 5

తైలాభ్య క్తైక వేణీత్రపుమయవిలసత్కర్ణికా క్రాంతకర్ణా
లోహేనై కేన కృత్వా చరణనళినకా మాత్మనః పాదశోభాం
దిగ్వాసార సభేన గ్రసతి జగదిదం యా యవాకర్ణపూరా
వర్షిణ్యాతి ప్రబద్ధా ధ్వజవితతభుజా సాసి దేవి త్వమేవ 6

సంగ్రామే హేతికృత్త్యై స్సరుధిరదశనై ర్యద్భటానాం శిరోభిః
మాలామాబద్ధ్వమూర్ధ్ని ధ్వజవితతభుజా త్వంశ్మశానే ప్రవిష్టా
దృష్టా భూతప్రభూతైః పృథుతర జఘనా బద్ధనాగేంద్రకాంచీ
శూలాగ్రవ్యగ్రహస్తా మధురుధిరవసా తామ్రనేత్రా నిశాయామ్ 7

దంష్ట్రారౌద్రే ముఖేఽస్మిం స్తవ విశతి జగద్దేవి సర్వం క్షణార్ధాత్
సంసారస్యాంతకాలే నరరుధిర వసాసంప్లవే భూతధూమ్రే
కాళి కాపాలికీ సా శవశయనరతా యోగినీ యోగముద్రా
రక్తారూక్షా సభాస్థా మరణభయహర త్వం శివా చండఘంటా 8

ధూమావత్యష్టకం పుణ్యం సర్వాపద్వినివారణం
యః పఠేత్సాధకో భక్త్యా సిద్ధిం విందతి వాంఛితామ్ 9

మహాపది మహాఘోరే మహారోగే మహారణే
శత్రూచ్చాటే మారాణాదౌ జంతూనాం మోహనేతథా 10

పఠేత్ స్తోత్రమిదం దేవి సర్వతః సిద్ధిభాగ్భవేత్
దేవదానవగంధర్వ యక్షరాక్షసపన్నగాః 11

సింహవ్యాఘ్రాదికాస్సర్వే స్తోత్రస్మరణమాత్రతః
దూరాద్దూరతరం యాంతికింపునర్మానుషాదయః 12

స్తోత్రేణానేన దేవేశి కిన్న సిధ్యతి భూతలే
సర్వ శాంతిర్భవేద్దేవి అంతే నిర్వాణతాం వ్రజేత్ 13

ఇత్యూర్ధ్వామ్నాయే శ్రీ ధూమవతీ స్తోత్రమ్ సమాప్తం

# శ్రీధూమావతీ ధ్యానం



వివర్ణా చంచలా దుష్టా దీర్ఘా చ మలినాంబరా ।
విముక్తకుంతలా రూక్షా విధవా విరలద్విజా ॥ ॥ 1 ॥

కాకధ్వజరథారూఢా విలంబితపయోధరా ।
శూర్పహస్తాతిరూక్షాక్షా ధూతహస్తా వరాన్వితా ॥ ॥ 2 ॥

ప్రవృద్ధఘోణా తు భృశం కుటిలా కుటిలేక్షణా ।
క్షుత్పిపాసార్ది తా ధ్యేయా భయదా కలహాస్పదా ॥ ॥ 3 ॥

అత్యుచ్చా మలినాంబరాఽఖిలజనోద్వేగావహా దుర్మనా
రూక్షాక్షిత్రితయా విశాలదశనా సూర్యోదరీ చంచలా ।
ప్రస్వేదాంబుచితా క్షుధాకులతనుః కృష్ణాఽతిరూక్షప్రభా
ధ్యేయా ముక్తకచా సదాప్రియకలిర్ధూమావతీ మంత్రిణా ॥ ॥ 4 ॥

ఇతి శ్రీధూమావతీ ధ్యానం



# శ్రీ ధూమావతి కవచం - 1



**శ్రీ పార్వత్యువాచ :**

1. ధూమావత్యర్చనం శంభో శ్రుతం విస్తరతో మయా
కవచం శ్రోతుమిచ్ఛామి తస్యా దేవ వదస్వ మే

**శ్రీ భైరవ ఉవాచ :**

2. శృణు దేవి పరం గుహ్యం న ప్రకాశ్యం కలౌయుగే
ధూమావత్యాస్తు కవచం శత్రువిగ్రహకారకమ్

3. బ్రహ్మాద్యా దేవి సతతం యద్వశాదరిఘాతినః
దేవా భవంతి శత్రుఘ్నా యస్యాధ్యాన ప్రభావతః

ఓం అస్యశ్రీ ధూమవతీకవచస్య పిప్పలాద ఋషిః అనుష్టుప్ ఛ్ఛందః శ్రీ ధూమవతీ దేవతా ధూం భీజం స్వాహా శక్తిః ధూమవతీ కీలకం, శత్రుహననే జపే వినియోగః

4. ఓం ధూం బీజం మే శిరఃపాతు లలాటం సదావతు
ధూమ నేత్రయుగం పాతు వతీ కర్ణౌ సదావతు

5. దీర్ఘాతూదరమధ్యే తు నాభిం మే మలినాంబరా
శూర్పహస్తా పాతు గుహ్యం రూక్షా రక్షతు జానునీ

6. ముఖం మే పాతు భీమాఖ్యా స్వాహా రక్షతు నాసికాం
సర్వవిద్యావతాత్కంఠం వివర్ణా బాహుయుగ్మకమ్

7. చంచలా హృదయం పాతు దుష్టా పార్శ్వం సదావతు
ధూమహస్తా సదా పాతు పాదౌ పాతు భయాపహా

8. ప్రవృద్ధరోమా పాతు భృశం కుటిలా కుటిలేక్షణా
క్షుత్పిపాసార్దితా దేవీ భయదా కలహప్రియా

9. సర్వాంగం పాతు మే దేవీ సర్వశత్రు వినాశినీ
ఇత్యే తత్కవచం పుణ్యం కథితం భువి దుర్లభమ్

10. న ప్రకాశ్యం న ప్రకాశ్యం న ప్రకాశ్యం కలౌయుగే
పఠనీయం మహాదేవి త్రిసంధ్యం ధ్యానతత్పరైః

11. దుష్టాభిచారో దేవేశి తద్గాత్రం నైవ సంస్పృశేత్

ఇతి భైరవీ భైరవ సంవాదే శ్రీ ధూమావతీ కవచమ్ సంపూర్ణం



# శ్రీ ధూమావతీ దేవి కవచం-2



ముఖం ధూమవతీపాతు ధూంధూం స్వాహాస్వరూపిణీ

లలాటం విజయాపాతు మాలినీ నిత్యసుందరీ

కల్యాణీ హృదయం పాతు హసరీ నాభిదేశకం

సర్వాంగం పాతుదేవేశీ నిష్కలా భగమాలినీ

సుపుణ్యం కవచం దివ్యం యఃపఠేద్భక్తి సంయుతః

సౌభాగ్య మతులం ప్రాప్యచాంతే దేవీ పురం వ్రజేత్



# శ్రీ ధూమావతి హృదయ స్తోత్రం



ఓం అస్య శ్రీ ధూమవతీ హృదయస్తోత్ర మహామంత్రస్య పిప్పలాద ఋషిః, అనుష్టుప్ఛందః శ్రీ ధూమవతీ దేవతా – ధూం బీజం హ్రీం శక్తిః క్లీం కీలకం సర్వశత్రుసంహారార్థే జపే వినియోగః –

## కరాంగన్యాసౌ

ఓం ధాం అంగుష్ఠాభ్యాం నమః – ఓం ధీం తర్జనీభ్యాం స్వాహా – ఓం ధూం మధ్యమాభ్యాం వషట్ – ఓం ధైం అనామికాభ్యాం హుం – ఓం ధౌం కనిష్ఠకాభ్యాం వౌషట్ – ఓం ధః అస్త్రాయఫట్.

ఓం థాం హృదయాయ నమః ఓం ధీం శిరసే స్వాహా – ఓం ధూం శిఖాయై వషట్ – ఓం ధైం కవచాయ హుం ఓం ధౌం నేత్రత్రయాయ వౌషట్ – ఓం ధః అస్త్రాయఫట్.

## ధ్యానమ్

ఓం ధూమ్రాభాం ధూమ్రవస్త్రాం ప్రకటితదశానాం ముక్తవాలాంబ
రాఢ్యాం కాకాంకస్యందనస్థాం ధవళకరయుగాం శూర్పహస్తాతిరూక్షామ్,
కంకాంక్షు తాక్షంతదేహాం ముహురుతి కుటిలాం వారిదాభాం విచిత్రాం
ధ్యాయేద్ధూమా వతీం కుటిలితనయ నాం భీతిదాం భీషణాస్యామ్ 1

కల్పదౌ యా కాళికాద్యాఽచీకలన్మధుకైటభౌ
కల్పాంతే త్రిజగత్సర్వం భజే ధూమావతీమహమ్. 2

గుణాగారా గమ్యగుణా యా గుణాగుణవర్ధినీ
గీతావేదార్థతత్త్వజ్ఞైః భజే ధూమావతీమహమ్. 3

ఖట్వాంగధారిణీ ఖర్వఖండినీ ఖలరక్షసాం
ధారిణీ ఖేటకస్యాపి భజే ధూమావతీ మహమ్ 4

ఘూర్ణ ఘూర్ణకరాఘోరా ఘూర్ణితాక్షీ ఘనస్వనా
ఘాతినీ ఘాతకానాంయా భజే దూమావతీమహమ్ 5

చర్వంతీ మస్తిఖండానాం చండముండ విదారిణీం
చండాట్టహాసినీం దేవీం భజే ధూమావతీమహమ్. 6

ఛిన్నగ్రీవాం క్షతాంచ్ఛన్నాం ఛిన్నమస్త స్వరూపిణీం
ఛేదినీం దుష్టసంఘానాం భజే ధూమావతీమహమ్ 7

జాతాయా యాచితాదేవై రసురాణాం విధాతినీ
జల్పంతీ బహుగర్జంతీ భజేతాం ధూమ్రరూపిణీమ్ 8

ఝుంకార కారిణీ ఝుంఝూం ఝుంఝూమాం మవాదినీం
ఝుటిత్యాకర్షిణీందేవీం భజే ధూమవతీమహమ్ 9

హేతిపటంకారసంయుక్తాన్ ధనుష్టంకారకారిణీం
ఘోరాఘుంఘుటాటోపాం వందే ధూమవతీమహమ్ 10

ఠంఠంఠం మనుప్రీతిం ఠఃఠః మంత్రస్వరూపిణీం
ఠమకాహ్నగతిప్రీతాం భజే ధూమావతీమహమ్ 11

డమరూ డిండిమారావాం డాకినీగణమండితాం
డాకినీభోగసంతుష్టాం భజే ధూమావతీమహమ్ 12

ఢక్కానాదేన సంతుష్టాం ఢక్కావాదన సిద్ధిదాం
ఢక్కావాదచలచ్చిత్తాం భజే ధూమావతీమహమ్ 13

తత్త్వవార్తా ప్రియప్రాణాం భవపాయోధితారిణీం
తారస్వరూపిణీం తారాం భజే ధూమావతీమహమ్ 14

థాం థీం థూం థేమంత్రరూపాం థైంథోథంథః స్వరూపిణీం
థకారవర్ణసర్వస్వాం భజే ధూమావతీమహమ్ 15

దుర్గాస్వరూపిణీందేవీం దుష్టదానవదారిణీం
దేవదైత్యకృతధ్వంసాం వందే ధూమావతీమహమ్ 16

ధ్వాంతా కారాంధకధ్వంసాం ముక్తధమ్మిల్లధారిణీం
ధూమధారాప్రభాం ధీరాం భజే ధూమావతీమహమ్ 17

నర్తకీనటనప్రీతాం నాట్యకర్మ వివర్ధినీం
నారసింహీం నరారాధ్యాం నౌమి ధూమావతీమహమ్ 18

పార్వతీపతిసంపూజ్యాం పర్వతోపరి వాసినీం
పద్మారూపాం పద్మపూజ్యాం నౌమి ధూమావతీమహమ్ 19

ఫూత్కారసహితశ్వాసాం ఫట్ మంత్ర ఫలదాయినీం
ఫేత్కారిగణసంసేవ్యాం సేవే ధూమావతీమహమ్ 20

బలిపూజాం బలారాధ్యాం బగళారూపిణీం వరాం
బ్రహ్మాదివందితాం విద్యాం వందే ధూమావతీ మహమ్ 21

భవ్యరూపాం భవారాధ్యాం భువనేశ్వరీ స్వరూపిణీం
భక్తభవ్యప్రదాం దేవీం భజే ధూమావతీమహమ్. 22

మాయాం మధుమతీం మాన్యాం మకరధ్వజమానితాం
మత్స్యమాంసమహాస్వాదాం మన్యే ధూమావతీమహమ్ 23

యోగయజ్ఞప్రసన్నాస్యాం యోగినీపరిసేవితాం
యశోదాం యజ్ఞఫలదాం యజేధూమావతీమహమ్ 24

రామారాధ్యపదద్వంద్వాం రావణధ్వంసకారిణీం
రమేశరమణీపూజ్యామహం ధూమవతీంశ్రయే. 25

లక్షలీలాకళాలక్ష్యాం లోకవంద్య పదాంబుజాం
లంబితాం బీజకోశాఢ్యాం వందే ధూమవతీమహమ్ 26

బకపూజ్య పదాంభోజాం బకధ్యానపరాయాణాం
బలాంబ కారిసంధ్యేయాం వందే ధూమావతీమహమ్ 27

శంకరీం శంకరప్రాణాం సంకటధ్వంసకారిణీం
శత్రుసంహారిణీం శుద్ధాం శ్రయే ధూమవతీమహమ్ 28

షడాననారిసంహంత్రీం షోడశీరూపధారిణీం
షడ్రసాస్వాదినీం సౌమ్యాం సేవే ధూమవతీమహమ్ 29

సురసేవిత పాదాబ్జాం సురసౌఖ్య ప్రదాయినీం
సుందరీ గణసంసేవ్యాం సేవే ధూమావతీమహమ్ 30

హేరంబజననీం యోగ్యాం హాస్యలాస్యవిహారిణీం
హరిణీం శత్రుసంఘానాం సేవే ధూమావతీమహమ్ 31

క్షీరోదతీరసంవాసాం క్షీరపాన ప్రహర్షితాం
క్షణదేశేజ్యపాదాబ్జాం సేవే ధూమావతీమహమ్ 32

చతుస్త్రింశద్వర్ణకానాం ప్రతివర్ణాదినామభిః
కృతం తు హృదయంస్తోత్రం ధూమావత్యాస్సుసిద్ధిదమ్. 33

య ఇదం పఠతిస్తోత్రం పవిత్రం పాపనాశనం
సప్రాప్నోతిపరాం సిద్ధం ధూమావత్యాః ప్రసాదతః 34

పఠన్నేకాగ్రచిత్తోయో యద్యదిచ్ఛతి మానవః
తత్సర్వం సమవాప్నోతి సత్యం సత్యం వదామ్యహమ్ 35

ఇతి శ్రీ ధూమావతీ హృదయం సోత్రం సంపూర్ణం



## శ్రీ ధూమావతి ప్రార్థన



వివర్ణా చంచలా దుష్టా దీర్ఘా చ మలినాంబరా
విముక్త కుంతలా రూక్షా విధవా విరళద్విజా ॥ 1

కాకధ్వజ రథా రూఢా విలంబిత పయోధరా
శూర్పహస్తాతిరూక్షాక్షా ధూతహస్త వరాన్వితా ॥ 2

ప్రవృద్ధ ఘోషణాతు భృశం కుటిలా కుటిలేక్షణా
క్షుత్పిపాసార్ధితా నిత్యం భయదా కలహ ప్రియా ॥ 3

# శ్రీధూమావత్యుచ్చాటన మంత్రః



**ధ్యానం :**

కాకారూఢాతికృష్ణాభా భిన్నదంతా విరాగిణీ ।
ముక్తకేశీ సుధూమ్రాక్షీ క్షుత్తృషార్తా భయాతురా ॥

చంచలా చాతి కామార్తా క్లిష్టా పుష్టాలసాంగికా ।
మలినా శ్రమనీ రక్తా వ్యక్తగర్భావిరోధినీ ।
ధృతసర్పాగ్రహస్తా చ ధ్యేయా ధూమావతీపరా ॥

**మనుః**

ఓం ధూం ధూమావతి దేవదత్తో ధావతీతి స్వాహా ।
ఋషిః క్షపణకః గాయత్రీ ఛందః ధూమావతీ దేవతా ధూం
బీజం స్వాహాశక్తిః సముచ్చాటే వినియోగః-
లక్షం జపేత్మహేశాని జగదుచ్చాటనం చరేత్ ।

ఇతి శ్రీధూమావత్యుచ్చాటన మంత్రః

# శ్రీ ధూమావతి అష్టోత్తర శత నామావళి



ఓం ధూమవత్యై నమః

ఓం ధూమ్రవర్ణాయై నమః

ఓం ధూమ్రపానపరాయణాయై నమః

ఓం ధూమ్రాక్ష మథిన్యై నమః

ఓం ధన్యాయై నమః

ఓం ధన్యస్థాన నివాసిన్యై నమః

ఓం అఘోరాచార సంతుష్టాయై నమః

ఓం అఘోరచార మండితాయై నమః

ఓం అఘోరమంత్ర సంప్రీతాయై నమః

ఓం అఘోరమంత్ర సంజితాయై నమః

ఓం అట్టాట్టహాస నిరతాయై నమః

ఓం మలినాంబర ధారిణ్యై నమః

ఓం వృద్ధాయై నమః

ఓం విరూపాయై నమః

ఓం విధవాయై నమః

ఓం విద్యాయై నమః

ఓం విరళద్విజాయై నమః

ఓం ప్రబృద్ధఘోణాయై నమః

ఓం కుముఖ్యై నమః

ఓం కుటిలాయై నమః

ఓం కుటిలేక్షణాయై నమః

ఓం కరాళ్యై నమః

ఓం కరాళాస్యాయై నమః

ఓం కంకాళ్యై నమః

ఓం శూర్పధారిణ్యై నమః

ఓం కాకధ్వజధారూఢాయై నమః

ఓం కేవలాయై నమః

ఓం కఠినాయై నమః

ఓం కుహూయై నమః

ఓం క్షుత్పిపాసార్థితాయై నమః

ఓం నిత్యాయై నమః

ఓం లలజ్జిహ్వాయై నమః

ఓం దిగంబర్యై నమః

ఓం దీర్ఘోదర్యై నమః

ఓం దీర్ఘరవాయై నమః

ఓం దీర్ఘాంగ్యై నమః

ఓం దీర్ఘమస్తకాయై నమః

ఓం విముక్తకుంతలాయై నమః

ఓం కీర్త్యాయై నమః

ఓం కైలాస స్థానవాసిన్యై నమః

ఓం క్రూరాయై నమః

ఓం కాలస్వరూపాయై నమః

ఓం కాలచక్రప్రవర్తిన్యై నమః

ఓం వివర్ణాయై నమః

ఓం చంచలాయై నమః

ఓం దుష్టాయై నమః

ఓం దుష్టవిధ్వంసకారిణ్యై నమః

ఓం చండ్యై నమః

ఓం చండ స్వరూపాయై నమః

ఓం చాముండాయై నమః

ఓం చండనిఃస్వనాయై నమః

ఓం చండవేగాయై నమః

ఓం చండగత్యై నమః

ఓం చండముండవినాశిన్యై నమః

ఓం చండాలిన్యై నమః

ఓం చిత్రరేఖాయై నమః

ఓం చిత్రాంగ్యై నమః

ఓం చిత్రరూపిణ్యై నమః

ఓం కృష్ణాయై నమః

ఓం కపర్దిన్యై నమః

ఓం కుల్లాయై నమః

ఓం కృష్ణరూపాయై నమః

ఓం క్రియావత్యై నమః

ఓం కుంభస్తన్యై నమః

ఓం మదోన్మత్తాయై నమః

ఓం మదిరాపాన విహ్వలాయై నమః

ఓం చతుర్భుజాయై నమః

ఓం లలజ్జిహ్వాయై నమః

ఓం శత్రుసంహారకారిణ్యై నమః

ఓం శవారూఢాయై నమః

ఓం శవగతాయై నమః

ఓం శ్మశాన స్థానవాసిన్యై నమః

ఓం దురారాధ్యాయై నమః

ఓం దురాచారాయై నమః

ఓం దుర్జనప్రీతిదాయిన్యై నమః

ఓం నిర్మాంసా నమః

ఓం నిరాహారాయై నమః

ఓం ధూతహస్తాయై నమః

ఓం వరాన్వితాయై నమః

ఓం కలహాయై నమః

ఓం కలిప్రీతాయై నమః

ఓం కలికల్మషనాశిన్యై నమః

ఓం మహాకాల స్వరూపాయై నమః

ఓం మహాకాల ప్రపూజితాయై నమః

ఓం మహాదేవ ప్రియాయై నమః

ఓం మేధాయై నమః

ఓం మహాసంకటనాశిన్యై నమః

ఓం భక్తప్రియాయై నమః

ఓం భక్తగత్యై నమః

ఓం భక్తశత్రువినాశిన్యై నమః

ఓం భైరవ్యై నమః

ఓం భువనాయై నమః

ఓం భీమాయై నమః

ఓం భారత్యై నమః

ఓం భువనాత్మికాయై నమః

ఓం భారుండాయై నమః

ఓం భీమనయనాయై నమః

ఓం త్రినేత్రాయై నమః

ఓం బహురూపిణ్యై నమః

ఓం త్రిలోకేశ్యై నమః

ఓం త్రికాలజ్ఞాయై నమః

ఓం త్రిస్వరూపాయై నమః

ఓం త్రయీతనువే నమః

ఓం త్రిమూర్త్యై నమః

ఓం తన్వ్యై నమః

ఓం త్రిశక్త్యై నమః

ఓం త్రిశూలిన్యై నమః

ఓం యక్షరాక్షస పూజితాయై నమః

ఓం ధూం ధూమావత్యై నమః

శ్రీ ధూమావతీ అష్టోత్తర శతనామావళి సమాప్తం

# శ్రీ ధూమావతి అష్టోత్తర శతనామ స్తోత్రం



**ఈశ్వర ఉవాచ :**

ఓం ధూమవతీ ధూమ్రవర్ణా ధూమ్రపానపరాయణా
ధూమ్రాక్ష మథినీ ధన్యాన్యస్థాన నివాసినీ ॥ 1

అఘోరమంత్ర సంతుష్టా అఘోరాచారమండితా
అఘోరమంత్ర సంప్రీతా అఘోరమను పూజితా ॥ 2

అట్టహాసనిరతా మలినాంబరధారిణీ
వృద్ధా విరూపా విధవా విద్యా చ విరళద్విజా ॥ 3

ప్రవృద్ధఘోణా కుముఖీ కుటిలా కుటిలేక్షణా
కరాళీ చ కరాళాస్యా కంకాళీ శూర్పధారిణీ ॥ 4

కాకధ్వజరథారూఢా కేవలా కఠినా కుహూః
క్షుత్పిపాసార్దితా నిత్యా లలజ్జిహ్వా దిగంబరీ ॥ 5

దీర్ఘోదరీ దీర్ఘరవా దీర్ఘాంగీ దీర్ఘమస్తకా
విముక్తకుంతలా కీర్త్యా కైలాస స్థానవాసినీ ॥ 6

క్రూరా కాలస్వరూపా చ కాలచక్ర ప్రవర్తినీ
వివర్ణాచంచలా దుష్టా దుష్టవిధ్వంసకారిణీ ॥ 7

చండీ చండస్వరూపాచ చాముండా చండనిస్వనా
చండవేగా చండగతిశ్చండముండ వినాశినీ ॥ 8

చాండాలినీ చిత్రరేఖా చిత్రాంగీ చిత్రరూపిణీ
కృష్ణాకపర్థినీ కుళ్లా కృష్ణరూపా క్రియావతీ ॥ 9

కుంభస్తనీ మదోన్మత్తా మదిరాపాన విహ్వలా
చతుర్భుజా లలజ్జిహ్వా శత్రుసంహార కారిణీ ॥ 10

శవారూఢా శవగతా శ్మశానస్థానవాసినీ
దురారాధ్యా దురాచార దుర్జన ప్రీతిదాయినీ ॥ 11

నిర్మాంసా చ నిరాహారా ధూతహస్తా వరాన్వితా
కలహా చ కలిప్రీతా కలికల్మషనాశినీ ॥ 12

మహాకాలస్వరూపా చ మహాకాల ప్రపూజితా
మహాదేవ ప్రియా మేధా మహాసంకట నాశినీ ॥ 13

భక్తప్రియా భక్తగతి ర్భక్తశత్రువినాశినీ
భైరవీ భువనా భీమా భారతీ భువనాత్మికా ॥ 14

భరుండా భీమనయనా త్రినేత్రా బహురూపిణీ
త్రిలోకేశీ త్రికాలజ్ఞా త్రిస్వరూపా త్రయీ తనుః ॥ 15

త్రిమూర్తిశ్చ తథాతన్వీ త్రిశక్తిశ్చ త్రిశూలినీ
ఇతి ధూమా మహత్ స్తోత్రం నామ్నామష్టశతాత్మకమ్ ॥ 16

మయాతే కథితందేవి శత్రుసంఘ వినాశనమ్
కారాగారే రిపుగ్రస్తే మహోత్పాతే మహాభయే ॥ 17

ఇదం స్తోత్రం పఠేన్మర్త్యోముచ్యతే సర్వసంకటైః
గుహ్యాద్గుహ్యతరం గుహ్యం గోపనీయం ప్రయత్నతః ॥ 18

చతుష్పదార్థదం నృణాం సర్వసంపత్ప్రదాయకమ్

ఇతి శ్రీ ధూమావతీ అష్టోత్తర శతనామావళీ స్తోత్రం సంపూర్ణమ్

# శ్రీధూమావతీ సహస్రనామావళిః



**ధ్యానం :**

వివర్ణా చంచలా దుష్టా దీర్ఘా చ మలినాంబరా ।
విముక్తకుంతలా రూక్షా విధవా విరలద్విజా ॥ ॥ 1 ॥

కాకధ్వజరథారూఢా విలంబితపయోధరా ।
శూర్పహస్తాతిరూక్షాక్షా ధూతహస్తా వరాన్వితా ॥ ॥ 2 ॥

ప్రవృద్ధఘోణా తు భృశం కుటిలా కుటిలేక్షణా ।
క్షుత్పిపాసార్ది తా ధ్యేయా భయదా కలహాస్పదా ॥ ॥ 3 ॥

అత్యుచ్చా మలినాంబరాఽఖిలజనోద్వేగావహా దుర్మనా
రూక్షాక్షిత్రితయా విశాలదశనా సూర్యోదరీ చంచలా ।
ప్రస్వేదాంబుచితా క్షుధాకులతనుః కృష్ణాఽతిరూక్షప్రభా
ధ్యేయా ముక్తకచా సదాప్రియకలిర్ధూమావతీ మంత్రిణా ॥ ॥ 4 ॥

ఓం ధూమాయై నమః ।
ఓం ధూమవత్యై నమః ।
ఓం ధూమాయై నమః ।
ఓం ధూమపానపరాయణాయై నమః ।
ఓం ధౌతాధౌతగిరాం ధామ్న్యై నమః ।
ఓం ధూమేశ్వరనివాసిన్యై నమః ।
ఓం అనంతాయై నమః ।
ఓం అనంతరూపాయై నమః ।
ఓం అకారాకారరూపిణ్యై నమః ।
ఓం ఆద్యాయై నమః । 10
ఓం ఆనందదానందాయై నమః ।
ఓం ఇకారాయై నమః ।
ఓం ఇంద్రరూపిణ్యై నమః ।
ఓం ధనధాన్యార్థవాణీదాయై నమః ।
ఓం యశోధర్మప్రియేష్టదాయై నమః ।
ఓం భాగ్యసౌభాగ్యభక్తిస్థాయై నమః ।
ఓం గుహాపర్వతవాసిన్యై నమః ।
ఓం రామరావణసుగ్రీవమోహదాయై నమః ।

ఓం హనుమత్ప్రియాయై నమః ।
ఓం వేదశాస్త్రపురాణజ్ఞాయై నమః । 20
ఓం జ్యోతిశ్ఛందఃస్వరూపిణ్యై నమః ।
ఓం చాతుర్యచారురుచిరారంజనప్రేమతోషదాయై నమః ।
ఓం కమలాసనసుధావక్త్రాయై నమః ।
ఓం చంద్రహాసస్మితాననాయై నమః ।
ఓం చతురాయై నమః ।
ఓం చారుకేశ్యై నమః ।
ఓం ముదా చతుర్వర్గప్రదాయై నమః ।
ఓం కలాకాలధరాయై నమః ।
ఓం ధీరాయై నమః ।
ఓం ధారిణ్యై నమః ।
ఓం వసునీరదాయై నమః । 31
ఓం హీరాయై నమః ।
ఓం హీరకవర్ణాభాయై నమః ।
ఓం హరిణాయతలోచనాయై నమః ।
ఓం దంభమోహక్రోధలోభస్నేహద్వేషహరాయై పరాయై నమః ।
ఓం నరదేవకర్త్ర్యై నమః ।
ఓం రామాయై నమః ।
ఓం రామానందమనోహరాయై నమః ।
ఓం యోగభోగక్రోధలోభహరాయై నమః ।
ఓం హరనమస్కృతాయై నమః । 40

ఓం దానమానజ్ఞానమానపానగానసుఖప్రదాయై నమః ।

ఓం గజగోశ్వపదాగంజాయై భూతిదాయై నమః ।

ఓం భూతనాశిన్యై నమః ।

ఓం భవభావాయై నమః ।

ఓం బాలాయై నమః ।

ఓం వరదాయై నమః ।

ఓం హరవల్లభాయై నమః ।

ఓం భగభంగభయాయై నమః ।

ఓం మాలాయై నమః ।

ఓం మాలత్యై నమః । 50

ఓం తాలనాదదాయై నమః ।

ఓం జాలవాలహాలకాలకపాలప్రియవాదిన్యై నమః ।

ఓం కరంజశీలగుంజాఢ్యాయై నమః ।

ఓం చూతాంకురనివాసిన్యై నమః ।

ఓం పనసస్థాయై నమః ।

ఓం పానసక్తాయై నమః ।

ఓం పనసేశకుటుంబిన్యై నమః ।

ఓం పావన్యై నమః ।

ఓం పావనాధారాయై నమః ।

ఓం పూర్ణాయై నమః । 60

ఓం పూర్ణమనోరథాయై నమః ।

ఓం పూతాయై నమః ।

ఓం పూతకలాయై నమః ।

ఓం పౌరాయై నమః ।

ఓం పురాణసురసుందర్యై నమః ।

ఓం పరేశ్యై నమః ।

ఓం పరదాయై నమః ।

ఓం పారాయై నమః ।

ఓం పరాత్మనే నమః ।

ఓం పరమోహిన్యై నమః । 70

ఓం జగన్మాయాయై నమః ।

ఓం జగత్కర్త్ర్యై నమః ।

ఓం జగత్కీర్త్యై నమః ।

ఓం జగన్మయ్యై నమః ।

ఓం జనన్యై నమః ।

ఓం జయిన్యై నమః ।

ఓం జాయాయై నమః ।

ఓం జితాయై నమః ।

ఓం జినజయప్రదాయై నమః ।

ఓం కీర్తిజ్ఞానధ్యానమానదాయిన్యై నమః । 80

ఓం దానవేశ్వర్యై నమః ।

ఓం కావ్యవ్యాకరణజ్ఞానాయై నమః ।

ఓం ప్రజ్ఞాప్రజ్ఞానదాయిన్యై నమః ।

ఓం విజ్ఞాజ్ఞాయై నమః ।

ఓం విజ్ఞజయదాయై నమః ।
ఓం విజ్ఞావిజ్ఞప్రపూజితాయై నమః ।
ఓం పరావరేజ్యాయై నమః ।
ఓం వరదాయై నమః ।
ఓం పారదాయై నమః ।
ఓం శారదాదరాయై నమః । 90
ఓం దారిణ్యై నమః ।
ఓం దేవదూత్యై నమః ।
ఓం మదనామదనామదాయై నమః ।
ఓం పరమజ్ఞానగమ్యాయై నమః ।
ఓం పరేశ్యై నమః ।
ఓం పరగాయై పరాయై నమః ।
ఓం యజ్ఞాయజ్ఞప్రదాయై నమః ।
ఓం యజ్ఞజ్ఞానకార్యకర్త్యై నమః ।
ఓం శుభాయై నమః ।
ఓం శోభిన్యై నమః । 100
ఓం శుంభమథిన్యై నమః ।
ఓం నిశుంభాసురమర్దిన్యై నమః ।
ఓం శాంభవ్యై నమః ।
ఓం శంభుపత్న్యై నమః ।
ఓం శంభుజాయాయై నమః ।
ఓం శుభాననాయై నమః ।

ఓం శాంకర్యై నమః ।

ఓం శంకరారాధ్యాయై నమః ।

ఓం సంధ్యాయై నమః ।

ఓం సంధ్యాసుధర్మిణ్యై నమః । 110

ఓం శత్రుఘ్న్యై నమః ।

ఓం శత్రుహాయై నమః ।

ఓం శత్రుప్రదాయై నమః ।

ఓం శాత్రవనాశిన్యై నమః ।

ఓం శైవ్యై నమః ।

ఓం శివలయాయై నమః ।

ఓం శైలాయై నమః ।

ఓం సదా శైలరాజప్రియాయై నమః ।

ఓం శర్వర్యై నమః ।

ఓం శబర్యై నమః । 120

ఓం శంభవే నమః ।

ఓం సుధాఢ్యాయై నమః ।

ఓం సౌధవాసిన్యై నమః ।

ఓం సగుణాగుణరూపాయై నమః ।

ఓం గౌరవ్యై నమః ।

ఓం భైరవీరవాయై నమః ।

ఓం గౌరాంగ్యై నమః ।

ఓం గౌరదేహాయై నమః ।

ఓం గౌర్యై నమః ।
ఓం గురుమత్యై గురవే నమః । 130
ఓం గవే గవే నమః ।
ఓం గవ్యస్వరూపాయై నమః ।
ఓం గుణానందస్వరూపిణ్యై నమః ।
ఓం గణేశగణదాయై నమః ।
ఓం గుణ్యగుణాయై నమః ।
ఓం గౌరవవాంఛితాయై నమః ।
ఓం గణమాత్రే నమః ।
ఓం గణారాధ్యాయై నమః ।
ఓం గణకోటివినాశిన్యై నమః ।
ఓం దుర్గాయై నమః । 140
ఓం దుర్జనహంత్ర్యై నమః ।
ఓం దుర్జనప్రీతిదాయిన్యై నమః ।
ఓం స్వర్గాపవర్గదాయై నమః ।
ఓం దాత్ర్యై నమః ।
ఓం దీనాదీనదయావత్యై నమః ।
ఓం దుర్నిరీక్ష్యాయై నమః ।
ఓం దురాదుఃస్థాయై నమః ।
ఓం దౌస్థ్యభంజనకారిణ్యై నమః ।
ఓం శ్వేతపాండురకృష్ణాభాయై నమః ।
ఓం కాలదాయై నమః । 150

ఓం కాలనాశిన్యై నమః ।

ఓం కర్మనర్మకర్త్ర్యై నమః ।

ఓం నర్మాయై నమః ।

ఓం ధర్మాధర్మవినాశిన్యై నమః ।

ఓం గౌరీగౌరవదాయై నమః ।

ఓం గోదాయై నమః ।

ఓం గణదాయై నమః ।

ఓం గాయనప్రియాయై నమః ।

ఓం గంగాయై నమః ।

ఓం భాగీరథ్యై నమః । 160

ఓం భంగాయై నమః ।

ఓం భగాయై నమః ।

ఓం భాగ్యవివర్ధిన్యై నమః ।

ఓం భవాన్యై నమః ।

ఓం భవహంత్ర్యై నమః ।

ఓం భైరవ్యై నమః ।

ఓం భైరవీసమాయై నమః ।

ఓం భీమాభీమరవాయై నమః ।

ఓం భైమ్యై నమః ।

ఓం భీమానందప్రదాయిన్యై నమః । 170

ఓం శరణ్యాయై నమః ।

ఓం శరణాయై నమః ।

ఓం శమ్యాయై నమః ।

ఓం శశిన్యై నమః ।

ఓం శంఖనాశిన్యై నమః ।

ఓం గుణాగుణకర్త్యై నమః ।

ఓం గౌణీప్రియాయై నమః ।

ఓం ప్రీతిప్రదాయిన్యై నమః ।

ఓం జనమోహనకర్త్ర్యై నమః ।

ఓం జగదానందదాయిన్యై నమః । 180

ఓం జితాజాయాయై నమః ।

ఓం విజయాయై నమః ।

ఓం విజయాజయదాయిన్యై నమః ।

ఓం కామాయై నమః ।

ఓం కాల్యై నమః ।

ఓం కరాలాస్యాయై నమః ।

ఓం ఖర్వాయై నమః ।

ఓం ఖంజాయై నమః ।

ఓం ఖరాయై నమః ।

ఓం గదాయై నమః । 190

ఓం గర్వాయై నమః ।

ఓం గరుత్మత్యై నమః ।

ఓం ఘర్మాయై నమః ।

ఓం ఘర్ఘరాయై నమః ।

ఓం ఘోరనాదిన్యై నమః ।

ఓం చరాచర్యై నమః ।

ఓం చరారాధ్యాయై నమః ।

ఓం ఛిన్నాఛ్ఛిన్నమనోరథాయై నమః ।

ఓం ఛిన్నమస్తాయై నమః ।

ఓం జయాజాప్యాయై నమః । 200

ఓం జగజ్జాయాయై నమః ।

ఓం ఝర్ఝర్యై నమః ।

ఓం ఝకారాయై నమః ।

ఓం ఝీష్కృత్యై నమః ।

ఓం టీకాయై నమః ।

ఓం టంకాయై నమః ।

ఓం టంకారనాదిన్యై నమః ।

ఓం ఠీకాయై నమః ।

ఓం ఠక్కురఠక్కాంగ్యై నమః ।

ఓం ఠఠఠాంకారఢుంఢురాయై నమః । 210

ఓం ఢుంఢ్యై నమః ।

ఓం తారాజతీర్ణాయై నమః ।

ఓం తాలస్థభ్రమనాశిన్యై నమః ।

ఓం థకారాయై నమః ।

ఓం థకరాయై నమః ।

ఓం దాత్ర్యై నమః ।

ఓం దీపాయై నమః ।
ఓం దీపవినాశిన్యై నమః ।
ఓం ధన్యాయై నమః ।
ఓం ధనాధనవత్యై నమః । 220
ఓం నర్మదాయై నమః ।
ఓం నర్మమోదిన్యై నమః ।
ఓం పద్మాయై నమః ।
ఓం పద్మావత్యై నమః ।
ఓం పీతాస్ఫాంతాయై నమః ।
ఓం ఫూత్కారకారిణ్యై నమః ।
ఓం ఫుల్లాయై నమః ।
ఓం బ్రహ్మమయ్యై నమః ।
ఓం బ్రాహ్మ్యై నమః ।
ఓం బ్రహ్మానందప్రదాయిన్యై నమః । 230
ఓం భవారాధ్యాయై నమః ।
ఓం భవాధ్యక్షాయై నమః ।
ఓం భగాలీమందగామిన్యై నమః ।
ఓం మదిరాయై నమః ।
ఓం మదిరేక్షాయై నమః ।
ఓం యశోదాయై నమః ।
ఓం యమపూజితాయై నమః ।
ఓం యామ్యాయై నమః ।

ఓం రామ్యాయై నమః ।
ఓం రామరూపాయై నమః । 240
ఓం రమణ్యై నమః ।
ఓం లలితాయై నమః ।
ఓం లతాయై నమః ।
ఓం లంకేశ్యై నమః ।
ఓం వాక్ప్రదాయై నమః ।
ఓం వాచ్యాయై నమః ।
ఓం సదాశ్రమనివాసిన్యై నమః ।
ఓం శ్రాంతాయై నమః ।
ఓం శకారరూపాయై నమః ।
ఓం షకారఖరవాహనాయై నమః । 250
ఓం సహ్యాద్రిరూపాయై నమః ।
ఓం సానందాయై నమః ।
ఓం హరిణీహరిరూపిణ్యై నమః ।
ఓం హరారాధ్యాయై నమః ।
ఓం బాలవాచాలవంగప్రేమతోషితాయై నమః ।
ఓం క్షపాక్షయప్రదాయై నమః ।
ఓం క్షీరాయై నమః ।
ఓం అకారాదిస్వరూపిణ్యై నమః ।
ఓం కాలికాయై నమః ।
ఓం కాలమూర్తయే నమః । 260

ఓం కలహాయై నమః ।

ఓం కలహప్రియాయై నమః ।

ఓం శివాయై నమః ।

ఓం శందాయిన్యై నమః ।

ఓం సౌమ్యాయై నమః ।

ఓం శత్రునిగ్రహకారిణ్యై నమః ।

ఓం భవాన్యై నమః ।

ఓం భవమూర్తయే నమః ।

ఓం శర్వాణ్యై నమః ।

ఓం సర్వమంగలాయై నమః । 270

ఓం శత్రువిద్రావిణ్యై నమః ।

ఓం శైవ్యై నమః ।

ఓం శుంభాసురవినాశిన్యై నమః ।

ఓం ధకారమంత్రరూపాయై నమః ।

ఓం ధూంబీజపరితోషితాయై నమః ।

ఓం ధనాధ్యక్షస్తుతాయై నమః ।

ఓం ధీరాయై నమః ।

ఓం ధరారూపాయై నమః ।

ఓం ధరావత్యై నమః ।

ఓం చర్విణ్యై నమః । 280

ఓం చంద్రపూజ్యాయై నమః ।

ఓం ఛందోరూపాయై నమః ।

ఓం ఛటావత్యై నమః ।

ఓం ఛాయాయై నమః ।

ఓం ఛాయావత్యై నమః ।

ఓం స్వచ్ఛాయై నమః ।

ఓం ఛేదిన్యై నమః ।

ఓం భేదిన్యై నమః ।

ఓం క్షమాయై నమః ।

ఓం వల్గిన్యై నమః । 290

ఓం వర్ధిన్యై నమః ।

ఓం వంద్యాయై నమః ।

ఓం వేదమాత్రే నమః ।

ఓం బుధస్తుతాయై నమః ।

ఓం ధారాయై నమః ।

ఓం ధారావత్యై నమః ।

ఓం ధన్యాయై నమః ।

ఓం ధర్మదానపరాయణాయై నమః ।

ఓం గర్విణ్యై నమః ।

ఓం గురుపూజ్యాయై నమః । 300

ఓం జ్ఞానదాత్ర్యై నమః ।

ఓం గుణాన్వితాయై నమః ।

ఓం ధర్మిణ్యై నమః ।

ఓం ధర్మరూపాయై నమః ।

ఓం ఘంటానాదపరాయణాయై నమః ।
ఓం ఘంటానినాదిన్యై నమః ।
ఓం ఘూర్ణాఘూర్ణితాయై నమః ।
ఓం ఘోరరూపిణ్యై నమః ।
ఓం కలిఘ్న్యై నమః ।
ఓం కలిదూత్యై నమః । 310
ఓం కలిపూజ్యాయై నమః ।
ఓం కలిప్రియాయై నమః ।
ఓం కాలనిర్ణాశిన్యై నమః ।
ఓం కాల్యాయై నమః ।
ఓం కావ్యదాయై నమః ।
ఓం కాలరూపిణ్యై నమః ।
ఓం వర్షిణ్యై నమః ।
ఓం వృష్టిదాయై నమః ।
ఓం వృష్టిర్మహావృష్టినివారిణ్యై నమః ।
ఓం ఘాతిన్యై నమః । 320
ఓం ఘాటిన్యై నమః ।
ఓం ఘోంటాయై నమః ।
ఓం ఘాతక్యై నమః ।
ఓం ఘనరూపిణ్యై నమః ।
ఓం ధూంబీజాయై నమః ।
ఓం ధూంజపానందాయై నమః ।

ఓం ధూంబీజజపతోషితాయై నమః ।

ఓం ధూంధూంబీజజపాసక్తాయై నమః ।

ఓం ధూంధూంబీజపరాయణాయై నమః ।

ఓం ధూంకారహర్షిణ్యై నమః । 330

ఓం ధూమాయై నమః ।

ఓం ధనదాయై నమః ।

ఓం ధనగర్వితాయై నమః ।

ఓం పద్మావత్యై నమః ।

ఓం పద్మమాలాయై నమః ।

ఓం పద్మయోనిప్రపూజితాయై నమః ।

ఓం అపారాయై నమః ।

ఓం పూరణ్యై నమః ।

ఓం పూర్ణాయై నమః ।

ఓం పూర్ణిమాయై నమః । 340

ఓం పరివందితాయై నమః ।

ఓం ఫలదాయై నమః ।

ఓం ఫలభోక్త్ర్యై నమః ।

ఓం ఫలిన్యై నమః ।

ఓం ఫలదాయిన్యై నమః ।

ఓం ఫూత్కారిణ్యై నమః ।

ఓం ఫలావాప్త్యై నమః ।

ఓం ఫలభోక్త్ర్యై నమః ।

ఓం ఫలాన్వితాయై నమః ।
ఓం వారిణ్యై నమః । 350
ఓం వారణప్రీతాయై నమః ।
ఓం వారిపాథోధిపారగాయై నమః ।
ఓం వివర్ణాయై నమః ।
ఓం ధూమ్రనయనాయై నమః ।
ఓం ధూమ్రాక్ష్యై నమః ।
ఓం ధూమ్రరూపిణ్యై నమః ।
ఓం నీత్యై నమః ।
ఓం నీతిస్వరూపాయై నమః ।
ఓం నీతిజ్ఞాయై నమః ।
ఓం నయకోవిదాయై నమః । 360
ఓం తారిణ్యై నమః ।
ఓం తారరూపాయై నమః ।
ఓం తత్త్వజ్ఞానపరాయణాయై నమః ।
ఓం స్థూలాయై నమః ।
ఓం స్థూలాధరాయై నమః ।
ఓం స్థాత్ర్యై నమః ।
ఓం ఉత్తమస్థానవాసిన్యై నమః ।
ఓం స్థూలాయై నమః ।
ఓం పద్మపదస్థానాయై నమః ।
ఓం స్థానభ్రష్టాయై నమః । 370

ఓం స్థలస్థితాయై నమః ।
ఓం శోషిణ్యై నమః ।
ఓం శోభిన్యై నమః ।
ఓం శీతాయై నమః ।
ఓం శీతపానీయపాయిన్యై నమః ।
ఓం శారిణ్యై నమః ।
ఓం శంఖిన్యై నమః ।
ఓం శుద్ధాయై నమః ।
ఓం శంఖాసురవినాశిన్యై నమః ।
ఓం శర్వర్యై నమః । 380
ఓం శర్వరీపూజ్యాయై నమః ।
ఓం శర్వరీశప్రపూజితాయై నమః ।
ఓం శర్వరీజాగ్రితాయై నమః ।
ఓం యోగ్యాయై నమః ।
ఓం యోగిన్యై నమః ।
ఓం యోగవందితాయై నమః ।
ఓం యోగినీగణసంసేవ్యాయై నమః ।
ఓం యోగినీయోగభావితాయై నమః ।
ఓం యోగమార్గరతాయై నమః ।
ఓం యుక్తాయై నమః । 390
ఓం యోగమార్గానుసారిణ్యై నమః ।
ఓం యోగభావాయై నమః ।

ఓం యోగయుక్తాయై నమః ।

ఓం యామినీపతివందితాయై నమః ।

ఓం అయోగ్యాయై నమః ।

ఓం యోధిన్యై నమః ।

ఓం యోద్ధ్రాయై నమః ।

ఓం యుద్ధకర్మవిశారదాయై నమః ।

ఓం యుద్ధమార్గరతాయై నమః ।

ఓం నాంతాయై నమః । 400

ఓం యుద్ధస్థాననివాసిన్యై నమః ।

ఓం సిద్ధాయై నమః ।

ఓం సిద్ధేశ్వర్యై నమః ।

ఓం సిద్ధ్యై నమః ।

ఓం సిద్ధిగేహనివాసిన్యై నమః ।

ఓం సిద్ధరీత్యై నమః ।

ఓం సిద్ధప్రీత్యై నమః ।

ఓం సిద్ధాయై నమః ।

ఓం సిద్ధాంతకారిణ్యై నమః ।

ఓం సిద్ధగమ్యాయై నమః । 410

ఓం సిద్ధపూజ్యాయై నమః ।

ఓం సిద్ధవంద్యాయై నమః ।

ఓం సుసిద్ధిదాయై నమః ।

ఓం సాధిన్యై నమః ।

ఓం సాధనప్రీతాయై నమః ।

ఓం సాధ్యాయై నమః ।

ఓం సాధనకారిణ్యై నమః ।

ఓం సాధనీయాయై నమః ।

ఓం సాధ్యసాధ్యాయై నమః ।

ఓం సాధ్యసంఘసుశోభిన్యై నమః । 420

ఓం సాధ్వ్యై నమః ।

ఓం సాధుస్వభావాయై నమః ।

ఓం తస్యై నమః ।

ఓం సాధుసంతతిదాయిన్యై నమః ।

ఓం సాధుపూజ్యాయై నమః ।

ఓం సాధువంద్యాయై నమః ।

ఓం సాధుసందర్శనోద్యతాయై నమః ।

ఓం సాధుదృష్టాయై నమః ।

ఓం సాధుపుష్టాయై నమః ।

ఓం సాధుపోషణతత్పరాయై నమః । 430

ఓం సాత్త్విక్యై నమః ।

ఓం సత్త్వసంసిద్ధాయై నమః ।

ఓం సత్త్వసేవ్యాయై నమః ।

ఓం సుఖోదయాయై నమః ।

ఓం సత్త్వవృద్ధికర్త్యై నమః ।

ఓం శాంతాయై నమః ।

ఓం సత్త్వసంహర్షమానసాయై నమః ।

ఓం సత్త్వజ్ఞానాయై నమః ।

ఓం సత్త్వవిద్యాయై నమః ।

ఓం సత్త్వసిద్ధాంతకారిణ్యై నమః । 440

ఓం సత్త్వవృద్ధ్యై నమః ।

ఓం సత్త్వసిద్ధ్యై నమః ।

ఓం సత్త్వసంపన్నమానసాయై నమః ।

ఓం చారురూపాయై నమః ।

ఓం చారుదేహాయై నమః ।

ఓం చారుచంచలలోచనాయై నమః ।

ఓం ఛద్మిన్యై నమః ।

ఓం ఛద్మసంకల్పాయై నమః ।

ఓం ఛద్మవార్తాయై నమః ।

ఓం క్షమాప్రియాయై నమః । 450

ఓం హఠిన్యై నమః ।

ఓం హఠసంప్రీత్యై నమః ।

ఓం హఠవార్తాయై నమః ।

ఓం హఠోద్యమాయై నమః ।

ఓం హఠకార్యాయై నమః ।

ఓం హఠధర్మాయై నమః ।

ఓం హఠకర్మపరాయణాయై నమః ।

ఓం హఠసంభోగనిరతాయై నమః ।

ఓం హఠాత్కారరతిప్రియాయై నమః ।
ఓం హఠసంభేదిన్యై నమః । 460
ఓం హృద్యాయై నమః ।
ఓం హృద్యవార్తాయై నమః ।
ఓం హరిప్రియాయై నమః ।
ఓం హరిణ్యై నమః ।
ఓం హరిణీదృష్ట్యై ర్హరిణ్యై నమః ।
ఓం మాంసభక్షణాయై నమః ।
ఓం హరిణాక్ష్యై నమః ।
ఓం హరిణపాయై నమః ।
ఓం హరిణీగణహర్షదాయై నమః ।
ఓం హరిణీగణసంహంత్ర్యై నమః । 470
ఓం హరిణీపరిపోషికాయై నమః ।
ఓం హరిణీమృగయాసక్తాయై నమః ।
ఓం హరిణీమానపురస్సరాయై నమః ।
ఓం దీనాయై నమః ।
ఓం దీనాకృత్యై నమః ।
ఓం దూనాయై నమః ।
ఓం ద్రావిణ్యై నమః ।
ఓం ద్రవిణప్రదాయై నమః ।
ఓం ద్రవిణాచలసంవాసాయై నమః ।
ఓం ద్రవితాయై నమః । 480

ఓం ద్రవ్యసంయుతాయై నమః ।

ఓం దీర్ఘాయై నమః ।

ఓం దీర్ఘపదాయై నమః ।

ఓం దృశ్యాయై నమః ।

ఓం దర్శనీయాయై నమః ।

ఓం దృఢాకృత్యై నమః ।

ఓం దృఢాయై నమః ।

ఓం ద్విష్టమత్యై నమః ।

ఓం దుష్టాయై నమః ।

ఓం ద్వేషిణ్యై నమః । 490

ఓం ద్వేషిభంజిన్యై నమః ।

ఓం దోషిణ్యై నమః ।

ఓం దోషసంయుక్తాయై నమః ।

ఓం దుష్టశత్రువినాశిన్యై నమః ।

ఓం దేవతార్తిహరాయై నమః ।

ఓం దుష్టదైత్యసంఘవిదారిణ్యై నమః ।

ఓం దుష్టదానవహంత్ర్యై నమః ।

ఓం దుష్టదైత్యనిషూదిన్యై నమః ।

ఓం దేవతాప్రాణదాయై నమః ।

ఓం దేవ్యై నమః । 500

ఓం దేవదుర్గతినాశిన్యై నమః ।

ఓం నటనాయకసంసేవ్యాయై నమః ।

ఓం నర్తక్యై నమః ।

ఓం నర్తకప్రియాయై నమః ।

ఓం నాట్యవిద్యాయై నమః ।

ఓం నాట్యకర్త్ర్యై నమః ।

ఓం నాదిన్యై నమః ।

ఓం నాదకారిణ్యై నమః ।

ఓం నవీననూతనాయై నమః ।

ఓం నవ్యాయై నమః । 510

ఓం నవీనవస్త్రధారిణ్యై నమః ।

ఓం నవ్యభూషాయై నమః ।

ఓం నవ్యమాలాయై నమః ।

ఓం నవ్యాలంకారశోభితాయై నమః ।

ఓం నకారవాదిన్యై నమః ।

ఓం నమ్యాయై నమః ।

ఓం నవభూషణభూషితాయై నమః ।

ఓం నీచమార్గాయై నమః ।

ఓం నీచభూమ్యై నమః ।

ఓం నీచమార్గగత్యై గత్యై నమః । 520

ఓం నాథసేవ్యాయై నమః ।

ఓం నాథభక్తాయై నమః ।

ఓం నాథానందప్రదాయిన్యై నమః ।

ఓం నమ్రాయై నమః ।

ఓం నమ్రగత్యై నమః ।
ఓం నేత్ర్యై నమః ।
ఓం నిదానవాక్యవాదిన్యై నమః ।
ఓం నారీమధ్యస్థితాయై నమః ।
ఓం నార్యై నమః ।
ఓం నారీమధ్యగతాయై నమః । 530
ఓం అనఘాయై నమః ।
ఓం నారీప్రీత్యై నమః ।
ఓం నరారాధ్యాయై నమః ।
ఓం నరనామప్రకాశిన్యై నమః ।
ఓం రత్యై నమః ।
ఓం రతిప్రియాయై నమః ।
ఓం రమ్యాయై నమః ।
ఓం రతిప్రేమాయై నమః ।
ఓం రతిప్రదాయై నమః ।
ఓం రతిస్థానస్థితారాధ్యాయై నమః । 540
ఓం రతిహర్షప్రదాయిన్యై నమః ।
ఓం రతిరూపాయై నమః ।
ఓం రతిధ్యానాయై నమః ।
ఓం రతిరీతిసుధారిణ్యై నమః ।
ఓం రతిరాసమహోల్లాసాయై నమః ।
ఓం రతిరాసవిహారిణ్యై నమః ।

ఓం రతికాంతస్తుతాయై నమః ।

ఓం రాశ్యై నమః ।

ఓం రాశిరక్షణకారిణ్యై నమః ।

ఓం అరూపాయై నమః । 550

ఓం శుద్ధరూపాయై నమః ।

ఓం సురూపాయై నమః ।

ఓం రూపగర్వితాయై నమః ।

ఓం రూపయౌవనసంపన్నాయై నమః ।

ఓం రూపరాశ్యై నమః ।

ఓం రమావత్యై నమః ।

ఓం రోధిన్యై నమః ।

ఓం రోషిణ్యై నమః ।

ఓం రుష్టాయై నమః ।

ఓం రోషిరుద్ధాయై నమః । 560

ఓం రసప్రదాయై నమః ।

ఓం మాదిన్యై నమః ।

ఓం మదనప్రీతాయై నమః ।

ఓం మధుమత్తాయై నమః ।

ఓం మధుప్రదాయై నమః ।

ఓం మద్యపాయై నమః ।

ఓం మద్యపధ్యేయాయై నమః ।

ఓం మద్యపప్రాణరక్షిణ్యై నమః ।

ఓం మద్యపానందసందాత్ర్యై నమః ।
ఓం మద్యప్రేమతోషితాయై నమః । 570
ఓం మద్యపానరతాయై నమః ।
ఓం మత్తాయై నమః ।
ఓం మద్యపానవిహారిణ్యై నమః ।
ఓం మదిరాయై నమః ।
ఓం మదిరాసక్తాయై నమః ।
ఓం మదిరాపానహర్షిణ్యై నమః ।
ఓం మదిరాపానసంతుష్టాయై నమః ।
ఓం మదిరాపానమోహిన్యై నమః ।
ఓం మదిరామానసాయై నమః ।
ఓం ముగ్ధాయై నమః । 580
ఓం మాధ్వీపాయై నమః ।
ఓం మదిరాప్రదాయై నమః ।
ఓం మాధ్వీదానసదానందాయై నమః ।
ఓం మాధ్వీపానరతాయై నమః ।
ఓం మదాయై నమః ।
ఓం మోదిన్యై నమః ।
ఓం మోదసందాత్ర్యై నమః ।
ఓం ముదితాయై నమః ।
ఓం మోదమానసాయై నమః ।
ఓం మోదకర్త్ర్యై నమః । 590

ఓం మోదదాత్ర్యై నమః ।
ఓం మోదమంగలకారిణ్యై నమః ।
ఓం మోదకాదానసంతుష్టాయై నమః ।
ఓం మోదకగ్రహణక్షమాయై నమః ।
ఓం మోదకాలబ్ధిసంక్రుద్ధాయై నమః ।
ఓం మోదకప్రాప్తితోషిణ్యై నమః ।
ఓం మాంసాదాయై నమః ।
ఓం మాంససంభక్షాయై నమః ।
ఓం మాంసభక్షణహర్షిణ్యై నమః ।
ఓం మాంసపాకపరప్రేమాయై నమః । 600
ఓం మాంసపాకాలయస్థితాయై నమః ।
ఓం మత్స్యమాంసకృతాస్వాదాయై నమః ।
ఓం మకారపంచకాన్వితాయై నమః ।
ఓం ముద్రాయై నమః ।
ఓం ముద్రాన్వితాయై నమః ।
ఓం మాత్రే నమః ।
ఓం మహామోహాయై నమః ।
ఓం మనస్విన్యై నమః ।
ఓం ముద్రికాయై నమః ।
ఓం ముద్రికాయుక్తాయై నమః । 610
ఓం ముద్రికాకృతలక్షణాయై నమః ।
ఓం ముద్రికాలంకృతాయై నమః ।

ఓం మాద్ర్యై నమః ।

ఓం మందరాచలవాసిన్యై నమః ।

ఓం మందరాచలసంసేవ్యాయై నమః ।

ఓం మందరాచలవాసిన్యై నమః ।

ఓం మందరధ్యేయపాదాబ్జాయై నమః ।

ఓం మందరారణ్యవాసిన్యై నమః ।

ఓం మందురావాసిన్యై నమః ।

ఓం మందాయై నమః । 620

ఓం మారిణ్యై నమః ।

ఓం మారికామితాయై నమః ।

ఓం మహామార్యై నమః ।

ఓం మహామారీశమన్యై నమః ।

ఓం శవసంస్థితాయై నమః ।

ఓం శవమాంసకృతాహారాయై నమః ।

ఓం శ్మశానాలయవాసిన్యై నమః ।

ఓం శ్మశానసిద్ధిసంహృష్టాయై నమః ।

ఓం శ్మశానభవనస్థితాయై నమః ।

ఓం శ్మశానశయనాగారాయై నమః । 630

ఓం శ్మశానభస్మలేపితాయై నమః ।

ఓం శ్మశానభస్మభీమాంగ్యై నమః ।

ఓం శ్మశానావాసకారిణ్యై నమః ।

ఓం శామిన్యై నమః ।

ఓం శమనారాధ్యాయై నమః ।

ఓం శమనస్తుతివందితాయై నమః ।

ఓం శమనాచారసంతుష్టాయై నమః ।

ఓం శమనాగారవాసిన్యై నమః ।

ఓం శమనస్వామిన్యై నమః ।

ఓం శాంత్యై నమః । 640

ఓం శాంతసజ్జనపూజితాయై నమః ।

ఓం శాంతపూజాపరాయై నమః ।

ఓం శాంతాయై నమః ।

ఓం శాంతాగారప్రభోజిన్యై నమః ।

ఓం శాంతపూజ్యాయై నమః ।

ఓం శాంతవంద్యాయై నమః ।

ఓం శాంతగ్రహసుధారిణ్యై నమః ।

ఓం శాంతరూపాయై నమః ।

ఓం శాంతియుక్తాయై నమః ।

ఓం శాంతచంద్రప్రభామలాయై నమః । 650

ఓం అమలాయై నమః ।

ఓం విమలాయై నమః ।

ఓం మ్లానాయై నమః ।

ఓం మాలతీకుంజవాసిన్యై నమః ।

ఓం మాలతీపుష్పసంప్రీతాయై నమః ।

ఓం మాలతీపుష్పపూజితాయై నమః ।

ఓం మహోగ్రాయై నమః ।

ఓం మహత్యై నమః ।

ఓం మధ్యాయై నమః ।

ఓం మధ్యదేశనివాసిన్యై నమః । 660

ఓం మధ్యమధ్వనిసంప్రీతాయై నమః ।

ఓం మధ్యమధ్వనికారిణ్యై నమః ।

ఓం మధ్యమాయై నమః ।

ఓం మధ్యమప్రీత్యై నమః ।

ఓం మధ్యమప్రేమపూరితాయై నమః ।

ఓం మధ్యాంగచిత్రవసనాయై నమః ।

ఓం మధ్యఖిన్నాయై నమః ।

ఓం మహోద్ధతాయై నమః ।

ఓం మహేంద్రకృతసంపూజాయై నమః ।

ఓం మహేంద్రపరివందితాయై నమః । 670

ఓం మహేంద్రజాలసంయుక్తాయై నమః ।

ఓం మహేంద్రజాలకారిణ్యై నమః ।

ఓం మహేంద్రమానితాఽమానాయై నమః ।

ఓం మానినీగణమధ్యగాయై నమః ।

ఓం మానినీమానసంప్రీతాయై నమః ।

ఓం మానవిధ్వంసకారిణ్యై నమః ।

ఓం మానిన్యాకర్షిణ్యై నమః ।

ఓం ముక్త్యై నమః ।

